# నౌకాపిత

( నవల )

రవీంద్రనాథ టాగూరు



జయంతి పబ్లికేషన్సు
గోపాలరెడ్డి రోడ్డు :: విజయవాడ-2.

# అమిత

అమితరాయ్ బారిస్టరు. ఆంగ్ల ఉచ్చారణ ప్రభావం వల్ల అతని ఇంటిపేరు రాయ్ అల్లా రోయ్ రేగా రూపాంతరం పొందింది. దానివల్ల అందం చెడ్డదన్నమాటేగాని అభిమానులు ఎక్కువయారు. పేరు ఇంకా సహజంగా ఉండాలనే ఉద్దేశంతో అతని ఆంగ్ల స్నేహితులు స్నేహితురాండ్రు అమితరాయే అని ఉచ్చరించేటట్లు చేశారు.

అమిత తండ్రి కూడా బారిస్టరే. కడు సమర్థుడు. మూడు తరాలవారు అధఃపతనం కావడానికి సరిపడినంత ధనం కూడబెట్టి పోయాడు తండ్రినుంచి సంక్రమించిన ఈ ఆఘాతాన్నుంచు అమిత ఎలాగో తప్పించుకుని బయట పడ్డాడు. కలకత్తా విశ్వవిద్యాలయంలో పట్టాపుచ్చుకోకుండానే ఆక్స్‌ఫర్డులో చదవడానికి వెళ్ళాడు. అక్కడ నిండు ఏడు సంవత్సరాలు పరీక్షలతో చెలగాటమాడాడు. అమిత మంచి తెలివితేటలుగలవాడేగాని చదువుమీద శ్రద్ధతక్కువ. చదువు మీద శ్రద్ధలేని లోపాన్ని అతనిలోని సహజ వాక్సమత్కృతి మరుగుపరిచింది. అతనేదో చదివి ఉద్ధరిస్తాడని తండ్రి పెద్దగా ఆశించలేదు. ఆక్స్‌ఫర్డులో చదివాడంటే స్వదేశంలో తేలికగా చెలామణీ అవుతాడనే అతని ఉద్దేశం.

నాకు అమిత అంటే ఇష్టం నేను కొత్త రచయితను. నా రచనలు చదివే పాఠకుల సంఖ్య పరిమితం. వారిలో మొదటివాడు అమిత. నా శైలిలోని తళుకుబెళుకులకు అతను

సమ్మోహితుడయ్యాడు. మన సాహిత్య విపణిలో ఎక్కువగా చెలామణీ అవుతున్నవారి రచనలలో చెప్పుకోదగ్గ శైలి లేదని అతని నమ్మకం. మోడమూఫ్తురం, పొట్టవీపు, వికృతంగా మోటుగా ఉంటే ఒంటెలాంటిదే వారి సాహిత్య సృష్టి. ఒంటెలాగానే వారు కూడా బెంగాలీ సాహిత్యపు ఎడారిలో వంకరటింకరగా అడుగులువేస్తూ పయనిస్తున్నారు. ఈ అభిప్రాయం నాదికాదని విమర్శకులకు మనవి.

అమిత ఫాషన్‌ను ముఖవేష్టనంతోను శైలిని ముఖ సౌందర్యంతోను పోలుస్తూంటాడు. అతని అభిప్రాయంలో శైలి సాహిత్య సమ్రాట్‌లకు ఫాషన్ సామాన్య సాహితీపరు లకు తగినది. సాహిత్య సమ్రాట్టులు నిరంకుశులు వారి వారి ఇష్టాయిష్టాలమీదనేగాని ఇతరుల ఇష్టాఇష్టాలమీద ఆధార పడరు. ఇక సామాన్య సాహితీ పరులకు ఇతరుల ఇష్టాయిష్టాల మీద ఆధారపడడమే తృప్తి. బంకిం శైలికోసమయితే అతని 'విషవృక్షం' చదవాలి. అందులో బంకిం నిజరూపం గోచ రిస్తుంది. బంకిం ఫాషన్ కోసమయితే నాసీరామ్ రచించిన 'మనమోహన మోహానబగన్'చదవాలి. అందులో అసలయిన బంకిం హత్య గోచరిస్తుంది. నృత్యమే వృత్తిగా పెట్టుకున్న నర్తకి బహిరంగ నాట్యశాలలో తెరసీడలో కనిపిస్తుంది. కాని పెళ్ళికూతురు ముఖంమీద కాశీపట్టు మేలిముసుగు ఉండాలి. వరుడు ఆ మేలిముసుగును తొలగించి శుభదృష్టి పరపాలి. ఫాషన్‌కు కితనార తెర, శైలికి కాశీపట్టు. ఇలా ఒక్కొక్క ముఖానికి అనుగుణమయిన ఒకొక్క భూమిక ఉండాలి మన దేశంలో శైలి విషయంలో, ఎక్కువ శ్రద్ధతీసుకోరని అమిత

అంటూ౦టాడు. దీనికి కారణం నలుగురూ నడిచేమార్గంవిడిచి కొత్తమార్గం తొక్కడానికి మనం సాహసించకపోవడమే. ఈ సత్యానికి ఉదాహరణ పౌరాణికగాధ దక్షయజ్ఞం. యజ్ఞానికి దేవలోకంలోని ఫాషన్ దేవుళ్ళు ఇంద్ర చంద్ర వరుణులను ఆహ్వానించారు. కాని శివుని శైలివేరు. అతను అపూర్వ పురుషుడు. అందుకని అతనిని పూజించడం భావ్యంకాదని ఋత్విక్కులు భావించారు. ఆక్స్ఫర్డులో చదివివచ్చిన వ్యక్తి ఇలా మాట్లాడడం నాకు ఎంతో ఆనందం కలిగిస్తుంటుంది. నా రచనలకు నా శైలి విశిష్టత చేకూర్చిందని నా విశ్వాసం. అందువల్లనే నా గ్రంథాలన్నీ నిర్వాణం పొందాయి. పునర్జన్మ నుంచి విముక్తి పొందాయి. అంటే మలి ముద్రణపడలేదు.

నా భార్యా సోదరుడు నవకృష్ణ అమిత ప్రసంగోక్తులను సహించలేకపోయేవాడు. "నీ ఆక్స్ఫర్డు పండితుని విషయం యిక కట్టిపెట్టు" అని అరిచేవాడు. అతను ఆంగ్ల సాహిత్యంలో యం. ఏ. పట్టంపొందినదిట్ట బాగా చదువుకున్నవాడు. కాని గ్రహణశక్తి తక్కువ. ఒకరోజున "గొప్ప రచయితలను చిన్నబుచ్చడానికే అమిత సామాన్య రచయితలను అమిత గొప్పవారిగా చిత్రిస్తుంటాడు. అహంకారంతో స్వంత డబ్బా వాయించుకోవడం అతనికెంతో యిష్టం. నువా వాయింపుకు కర్రముక్కగా వుపయోగపడుతున్నావు" అని అభిప్రాయం వెల్లడించాడు దురదృష్టవశాత్తు నా భార్య ముందు ఇలా మాట్లాడడం జరిగింది. ఆమె అతని స్వంత సోదరి అయినా ఈ మాటలను ఏ మాత్రం సహించలేకపోవడం సంతృప్తికరంగా ఉంది. ఆమె చదువుకోలేదనే

చెప్పాలి. అయినా అమిత అభిరుచులను ఆమె ఆమోదించింది. స్త్రీల సహజ ప్రతిభ నిజానికి ఆశ్చర్యం కలిగిస్తూంటుంది.

సుప్రసిద్ధ ఆంగ్ల రచయితలను అమిత తేలికగా త్రోసి పారేస్తూంటే నాకే విస్మయం కలిగేది. బజారులో తేలికగా చెలామణి అయే వస్తువులు వంటివారట ఆరచయితలు. వారిని ప్రశంసించడానికి వారి రచనలు చదవవలసిన అగత్యం లేదు. పరీక్షలో ఉత్తీర్ణుడు కావడానికి కావలసిన మార్కులు సంపాదించడానికి వారిని పొగిడి తేవాలి. కళ్ళు మూసుకుని వారిని నిందించినా హానిలేదు కాబట్టి వారి రచనలు చదవడం అనావశ్యకమని అమిత అభిప్రాయం. అసలు విషయమేమంటే సుప్రసిద్ధ రచయితలు బర్ద్వాన్ రైలు స్టేషనులోని విశ్రాంతి గదిలాగా పెద్ద అధికారులలాగా అతనికి కనిపిస్తారు. ఇక అతను వెలికితీసిన రచయితలు ప్రత్యేక రైలులోని స్వంత పెట్టెలాగా అతని స్వంతం.

సాహిత్య గుణవిచక్షణలో నేగాక అమిత వేషభాషా ప్రవర్తనలలో కూడా శైలిగోచరిస్తుంది. అతని ఆకారంలోనే ఒక విశిష్టత ఉంది. ఎంతమందిలోనయినా అతను కొట్టవచ్చినట్టు కనిపిస్తాడు. అయిదుగురిలో ఏ ఒకడుగానోగాక విశిష్టంగా అగుపిస్తాడు. అతనిముందు తక్కిన నలుగురుమరుగునపడిపోతారు. ముఖం నున్నన, మృదువు, కాంతివంతం, శ్యామవర్ణం, వైఖరి ఉల్లాసం. కళ్ళల్లో జీవం తొణికిసలాడుతూంటుంది. పెదవుల మీద మందహాసం ఆడుతూంటుంది. విరామం లేని కదలికలు. ఇక అతని ప్రత్యాక్షేపం చేసుముకి రాయినుంచి వెలువడేనిప్పురవ్వ. సాధారణంగా బెంగాలీ దుస్తులే ధరిస్తూంటాడు గానికి కారణం

అతని మిత్రబృందం ఎక్కువగా బెంగాలీ దుస్తులు వాడకపోవడమే అతను అంచులేని సాదాధోవతి కుచ్చెళ్ళుపోసి కట్టేవాడు. అతని వయసు వారెవరూ అలా కట్టకపోవడమే అతను కట్టడానికి కారణం. అంగరజాకు ఎడమభుజం దగ్గరనుంచి కుడివేపున నడుంవరకు గుండీలు పెట్టేవాడు. అంగరజాచేతులు మణికట్టునుంచి మోచేతివరకు కుట్టిఉండేవికావు ధోవతిమీద నడుంచుట్టూ వెడల్పాటి జేగురురంగు బంగారు అంచుల దట్టీ కట్టేవాడు. దానికి ఎడమవేపున బృందావన కలంకారీ గుడ్డసంచి. ఆ గుడ్డసంచిలో జేబుగడియారం ఉండేది పాదాలకు కటక్‌లో తయారు చేసిన ఎరుపు-తెలుపు ముచ్చెలు వేసుకునేవాడు. బయటకు వెళ్ళేటప్పుడు ఎడమభుజం మీదనుంచి మోకాలివరకు శుభ్రంగా మడతలుపెట్టిన మదరాసు అంచుల ఖండువా వేలాడుతూంటుంది. ఏ స్నేహితుడయినా భోజనానికి పిలిస్తే లక్నో ముస్లింలు ధరించే తెల్లటి అల్లిక టోపీ డాబుగా పెట్టుకుని వెళ్ళేవాడు. వేషమంతా సహజంగాలేక కడుపుబ్బ నవ్వుపుట్టించేదిగా ఉండేది. అతను ఆంగ్ల దుస్తులు ధరించే విధానంమాత్రం ఎవరికీ అర్థంకాదు. కాని బాగా తెలిసిన వారు అతను వదులు, బరువు దుస్తులు ధరించేవాడని, ఇంగ్లండులో వాటిని విశిష్టమయినవిగా పేర్కొనేవారని చెప్తారు. విచిత్ర వేషధారణమీద మోజుకంటె భాషనును అవహేళన చేయాలనే పట్టుదల ఎక్కువ చాలామంది యువకు తాము యువకులమని రుజువు చేసుకోవడానికి జననకాల పత్రిక చూపించవలసి ఉంటుంది. అమిత యవ్వనం అలా రుజువు పరచుకోవలసినదికాదు. దుర్లభమయింది. విశుద్ధమయింది.

కలవరపాటు లేనిది. దేనినీ నిలవ ఉండనీయకుండా అన్నింటినీ తోసుకుపోయే వరదలాగా బాధ్యతారహితంగా పొంగిపొరలు తూండేది.

అమితకు ఇద్దరు సోదరీమణులు. వారి ముద్దుపేర్లు సిసీ, లిసీ ఆపాదమస్తకం నవనాగరికత వారిలో గోచరిస్తుంది. ఫాషన్ ప్రదర్శనశాలలో చక్కగా అలంకరించిన వస్తువుల లాంటివారు. ఎత్తుమడమల పాదరక్షలు ధరించడం వారికి ముచ్చట. చేతులు కట్టి కిందుగా కత్తిరించిన జాకెట్లు, దాని మీద కర్పూర పగడమాల వేసుకోవడం వారికి సరదా. అట్లా వయ్యారం ఒలికిస్తూ నడిచేవారు. పెద్దగా మాట్లాడే వారు మాటిమాటికీ లేచికూర్చునేవారు. వారి కిలకిల నవ్వు దొంతరలు దొంతరలుగా తారాస్థాయికి అందుకునేది. తలలు ఒకపక్కకు వంచి మనోహరంగా మందహాసం చేసేవారు. కీగంటి చూపులు త్వరితగతిని బరపేవారు. నిండుమనసుతో భావగర్భితంగా చూసేవారుకూడా. గులాబీ రంగు పట్టువిసన కర్రలు వారి చెంపలమీద ఎడతెగకుండా ఆడుతూండేవి వారి అభిమానులు కూర్చున్న కుర్చీలచేతులుమీద కూర్చుని వారి కృత్రిమ పరిహాస పూర్వక ప్రసంగాలకు అసమ్మతి సూచకంగా విసనకర్రలతో వారిని మెల్లగా తట్టేవారు.

తోటి బాలికలతో అమిత చనువుగా ప్రవర్తించడం అతడి పురుషస్నేహితులకు ఈర్ష్యాజనకంగా ఉండేది. స్త్రీ జన ఆకర్షణకు అతను ఉదాసీనం వహించేవాడు కాదు. కాని ఏ ఒక స్త్రీ విషయంలోనూ ఆసక్తి కనపరచేవాడని చెప్పడానికి వీలు లేదు. అందరి ఎడ సమంగానే ఆసక్తి కనపరచేవాడు. ఒక్క

మాటలో చెప్పాలంటే స్త్రీలంటే ఆసక్తి ఎక్కువగాఉన్నా వారి ఆకర్షణకు లోనుకాలేదు. అమిత టీపార్టీలకువెళ్ళేవాడు. చీట్లపేక ఆడేవాడు. కావాలనుకున్నప్పుడు ఓడిపోయేవాడు. సరిగా పాడలేని స్త్రీని పట్టుపట్టి తిరిగి పాడించటంలో నేర్పరి. వెగటురంగుచీర ధరించిన స్త్రీ కనిపిస్తే, "యీ చీర యే దుకాణంలో దొరుకుతుంది?" అని ప్రశ్నించేవాడు. యాదృచ్ఛికంగా కాస్త పరిచయమయితే చాలు ఎంతో అన్యోన్యతతో శాతాఖానీ కొట్టేవాడు. అయితే ఆ అన్యోన్యత ఉదాసీనతవల్ల జనించిందని అందరికీ తెలిసిందే. అనేకమంది దేవతలను పూజిస్తూ ప్రతిదేవుని 'నీ వంత గొప్పవాడులేడు' అని స్తుతించే భక్తుని మాటలకు దేవతలు మోసపోరు. పైగా సంతోషిస్తారు కాని ఆడపిల్లల తల్లులు ఆశాలేశం పట్టుకుని వేలాడుతున్నా ఆడపిల్లలుమాత్రం అమిత చేతికందని దిఙ్మండలవర్ణంలాంటి వాడని గ్రహించారు. అతని మనసు ఏ ఒక బాలికమీద నిలవలేదుగాని అందరి బాలికలమీద విహరించేది. వారితో అన్యోన్యంగా మెలగడంలో అతనికే లక్ష్యం లేదు. అందుకనే ధైర్యంగా చొరవ తీసుకునేవాడు వారి సమక్షంలో భయపడేవాడుకాదు. పేలుడు పదార్థాలు సమీపంలోఉన్న నిప్పురవ్వలు రగలనీయ కూడదని నిశ్చయించుకున్నాడు.

ఒకానొకరోజున వనభోజనానికి వెళ్ళి అమిత గంగా నది ఒడ్డున లిలీగంగూలీ పక్కన కూర్చున్నాడు. అవతలిఒడ్డు ప్రశాంతంగా ఉంది. చీకటి వ్యాపించింది. చంద్రుడు ఉదయించాడు. అమిత మృదుల స్వరంతో, "లిలీ! అవతలిఒడ్డున

ఉదయించే చంద్రుడు, యీ వొడ్డున నువ్వూ నేనూ. యిటువంటి సమయం ఈ అనంతకాలంలో యెన్నడూ తిరిగీరాదు," అన్నాడు.

మొదటలో లిలీ హృదయం ఒక్క-క్షణం ఎగిరిగంతులు వేసింది. అతనిమాటలు పైకి నిజం అనిపిస్తాయిగాని యదార్థానికి నిజంకావని ఆమెకు తెలుసు. నీటిబుడగమీద క్షణం క్షణం మారే రంగులు లాంటివే అతని మాటలు. క్షణిక వ్యామోహాన్ని వదలించుకుని లిలీ నవ్వుతూ, "అమిత! నువ్వు చెప్పింది యదార్థమే. కాని చెప్పవలసిన అవసరంమాత్రం కనిపించదు. ఒకక్షణంకితం ఒక కప్ప నీటిలోదూకింది అనంత కాలంలో తిరిగి యిది సంభవించదు," అంది.

అమిత నవ్వి, "దానికీ దీనికీ పూర్తిగా భేదంవుంది. ఈ సాయంసమయంలో కప్ప నీటిలో దూకడం అసంగతం, అపశృతి. కాని నువ్వూ నేనూ చంద్రుడు గంగానదీప్రవాహం, ఆకాశంలో చుక్కలు, బిథోవెన్ రచించిన వెన్నెల గేయంలాగా సంపూర్ణ ఏకతానిక సృష్టి. విశ్వకర్మ కర్మాగారంలో ఒక ఉన్మత్త దేవతా స్వర్ణకారుడు వజ్రాలు, పచ్చలు, నీలాలు తాపిన నిర్మల బంగారపుటుంగరం తయారు చేసి, వెనువెంటనే దానిని సముద్రంలో పడవేసినట్టుంటుంది. యిక ఆ వుంగరం యెవరికీ దొరకదు," అన్నాడు.

"బాగానేవుందిగాని, అమిత్! యెందుకొచ్చినగొడవ! విశ్వకర్మ ఆ వుంగరం ఖరీదు యిచ్చుకోవలసిందని నీకు బిల్లు పంపడులే."

"కాని లిలీ! లక్షలకొలదీ యుగాల అనంతరం యే అంగారక గ్రహంలోనో బంగారు అడవుల నీడలో ఓ పెద్ద సరోవరం తీరాన మనం తిరిగికలుసుకుంటామనుకో! శాకుంతల నాటకంలోని జాలరి చేపనుకోసి నేటి అద్భుత సువర్ణ క్షణాన్ని మనకుపంపేస్తాడనుకో! మనం ఒకరినొకరి గుర్తుపడతామనుకో! అపుడేం జరుగుతుంది?"

"అపుడా?" అంటూ ప్రారంభించింది లిలీ చేతిలో విసన కర్రతో అమితను తేలికగా తట్టుతూ, "అపుడు మైమరపువల్ల ఆ సువర్ణ క్షణం తిరిగీ సముద్రగర్భంలో లీనమయిపోయి మరి కనిపించదు వున్మత్త స్వర్ణకారుడు తయారుచేసిన అటువంటి క్షణాలనేకం నువు కోల్పోయావు వాటిలెక్క నీకు తెలియదు. అన్నీ మరిచేపోయావు"

ఇలా చెపుతూ లిలీ త్వరితంగా లేచి తన స్నేహితురాండ్రను కలుసుకున్నది. అమిత జీవితంలోని అనేక ఘటనలలో ఇదొక మచ్చుతునక.

"నువు వివాహం ఎందుకు చేసుకోవు అమీ!" అని అతని సోదరీమణులు సిసీ లిసీ ప్రశ్నించారు.

"వివాహ వ్యవహారంలో ప్రధానం ఆడపిల్ల, ఆ తరవాతనే మొగపిల్లవాడు," అని జవాబిచ్చాడు అమిత.

"ఆశ్చర్యంగా వుంది! ఆడపిల్లలకు కరువు వచ్చినట్టు మాట్లాడుతున్నావ్!" అంది సిసీ

"పూర్వకాలంలో ఆడపిల్ల జాతకం సలక్షణంగావుంటే వివాహం చేసుకునేవారు. యిక నా విషయంలోనో పిల్ల సలక్షణంగా వుండాలి. అద్వితీయంగా వుండాలి. యీ భూమి

మీాద అటువంటిది వుండటానికి వీలు లేనిదయినంత లక్షణంగా వుండాలి"

"కాని ఆ పిల్ల నీ యింట అడుగిడగానే నీకే ప్రాధాన్యం వస్తుంది. ఆమె రెండోది. నీ ద్వారానే అంటే నీ భార్యగానే పేరుపొందుతుంది," అంది సిసీ వాదన వదలకుండా.

"నా భావనా ప్రపంచంలో నేను వృథాగా ప్రేమించే యువతికి గృహం లేదు. గుమ్మందాటి లోనికిరాదు. ఆకాశంలోని తోకచుక్కలాగా నా హృదయంలో తళుక్కుమంటుంది. భౌతిక గృహంలో అడుగుపెట్టకముందే గాలిలో కనిపించకుండా పోతుంది," అన్నాడు అమిత.

"అంటే ఆ అమ్మాయి నీ చెల్లెళ్ళలాగా యే మాత్రం వుండదన్నమాట!" అంది సిసీ ముఖం చిట్లించుకుంటూ.

"అంటే కుటుంబానికి అదనంగా మాత్రం వచ్చి చేరడం కాదన్నమాట!" అన్నాడు అమిత.

"సరేగాని సిసీ," అంటూ అడ్డువచ్చింది లిసీ.

"అమిత శాస్త్ర తల ఆడిస్తే చాలు వచ్చి పడడానికి విమీాబోసు సిద్ధంగా వుంది, నీకు తెలియదూ? అమిత ఆమెను యెందుకు పెళ్ళిచేసుకోకూడదూ? ఆమెకి సంస్కృతి లేదనా! వృక్షశాస్త్రంలో యం. ఎ. పరీక్షలో ప్రథమురాలుగా వచ్చిందిగదా! విద్య సంస్కృతి కాదా?"

"విద్య చెకుముకిరాయి. సంస్కృతి నిప్పు రవ్వ. చెకుముకిరాయి బరువుంది. యిక సంస్కృతి ప్రకాశిస్తుంది."

ఈ మాటలకు లిసీ మండిపడి, "బలే! వినండి! వినండి. యీాయనగారికి విమీాబోసు తగిందికాదట! నిజానికి ఆమెకి

యీాయనగారు తగిన వాడేనా అని సందేహం. పిచ్చెత్తి వివాహం చేసుకుంటానని వెంటబడినా కన్నెత్తయినా ఈయన గార్ని చూడవద్దని విమీాని హెచ్చరిస్తాను," అంది.

"నాకు పిచ్చెత్తితేతప్ప విమీాబోసును వివాహమాడాలని కాంక్షిస్తానా? నిజంగా పిచ్చెత్తితే కుదర్చడానికి మందులు వాడండిగాని పెళ్ళిమాత్రం చేయకండి," అని అవహేళనగా మాట్లాడాడు అమిత.

అమిత వివాహమాడతాడనే ఆశను అతని బంధుమిత్రులు వదులుకున్నారు అసంభవ స్వప్నాలను కనే అలవాటు, అసంబద్ధ ప్రలాపాలతో జనాన్ని అదర గొట్టడం వివాహ బాధ్యతను తప్పించుకునే లక్షణాలని వారికి విశ్వాసం కుదిరింది. వివాహ బాధ్యతలను వహించే శక్తి అమితకులేదని వారి భావన అతని మనసు కొంవిదయ్యం లాంటిది. బహిరంగ ప్రదేశంలో అది మనుష్యులను ప్రలోభపరిచి దారితప్పిస్తుంది. కాని పట్టుకుని ఇంటిలో పెట్టుకుందామంటే చేతికి చిక్కదు.

ఈరోజులలో అమితహడావిడిగా ఎక్కడికిపడితే అక్కడికిపరుగెత్తుతూ కాలంగలదుపుతున్నాడు. రకరకాల పరిచయస్తులతో ఫిర్పో హోటలులో తేనీరు సేవిస్తున్నాడు. వేళాపాళా లేకుండా అనవసరంగా స్నేహితులతో షికారుకు వెళుతున్నాడు. ఏ దుకాణంలో పడితే ఆ దుకాణంలో రకరకాల వస్తువులు కొని విచక్షణ లేకుండా వారికీ వీరికీ ఇచ్చివేస్తున్నాడు. ఇంగ్లీషు పుస్తకాలుకొని బంధుమిత్రుల ఇళ్ళల్లో వదిలి వేస్తున్నాడు.

అతని సోదరీమణులకు ఆగ్రహం కలిగించే విషయం అసహ్యంగా మాట్లాడే అలవాటు. పదిమంది పెద్దమనుషుల ముందు అక్కడి వారందరినీ అప్రతిష్టపాల్జేసేదేదో మాట్లాడుతూంటాడు.

ఒకరోజున ఒక రాజకీయతత్త్వవేత్త ప్రజాస్వామ్యమును శ్లాఘిస్తుండగా అమిత అడ్డువచ్చి, "ప్రాణంలేని సతీదేవి భౌతిక కాయాన్ని విష్ణువు ముక్కలు ముక్కలుగా నరకగా ఆ ముక్కలుపడ్డ ప్రదేశాలలో వంద పవిత్రక్షేత్రాలు వెలిశాయి. నేటి మన ప్రజాస్వామ్యం అక్కడక్కడా పడివున్న జీవరహిత రాజరికాన్ని పూజిస్తోంది. ఈ భూమిమీద చిన్నచిన్న సమ్రాట్టులు రాజకీయ సమ్రాట్టులు, సాహిత్య సమ్రాట్టులు, సాంఘిక సమ్రాట్టులు బయలుదేరుతున్నారు వారంతా క్షుద్రులు. ఒక్కరికీ ఆత్మవిశ్వాసం లేదు," అన్నాడు.

ఇంకోరోజున స్త్రీ స్వాతంత్ర్యం, సాంఘిక సంస్కరణలను గురించి పట్టుదలగా పోరాడే ఒకరు పురుషుడు స్త్రీ మీద అధికారం చెలాయించడాన్ని ఖండిస్తూ మాట్లాడుతూంటే అమిత నోటిలోనుంచి సిగరెట్టు తీసివేసుకుని, "పురుషుడు స్త్రీ మీద అధికారం చెలాయించడం మానిన మరుక్షణంలో స్త్రీ పురుషునిమీద అధికారం చెలాయించడం ప్రారంభిస్తుంది. దుర్బలుల అధికారం ఘోరంగా తయారవుతుంది," అన్నాడు.

అక్కడవున్న స్త్రీలు, స్త్రీ స్వాతంత్ర్య అనుకూలవాదులు తాము అప్రతిష్టపాలయినట్టు భావించి, "ఎలా రుజువు చేయగలవు?" అని ప్రశ్నించారు.

"దగ్గర గొలుసులు వున్నవారు వాటితో పక్షులను బంధిస్తారు అంటే లోబరుచుకుంటారు. దగ్గర గొలుసులు లేని వారు పక్షులకు నల్లమందు అలవాటు చేస్తారు అంటే మత్తుగొలుపుతారు. మొదటివారు బంధిస్తారేగాని మత్తు గొలపరు. ఇక రెండవవారో బంధిస్తారు, మత్తుగొలుపుతారు. స్త్రీలు యీ మత్తుమందును చేతిసంచులలో తీసుకు వెళు తూంటారు. ప్రకృతి ఈ మత్తుమందును వారికి కావలసినంత సరఫరా చేస్తుంటుంది."

మరోరోజున బాలీగంజ్ సాహిత్య సమావేశంలో రవీంద్రనాథటాగోరు పద్యకవిత్వం మీద చర్చ జరిగింది. అమిత అతని జీవితంలో మొదటిసారిగా అధ్యక్షత వహించ డానికి అంగీకరించాడు. పోరాటానికి పూర్తిగా సంసిద్ధమయే అక్కడకు వెళ్ళాడు పూర్వకాలపు సిద్ధాంతాలకు ప్రాతినిధ్యం వహించే ఒక వక్త రవీంద్రుని కవిత, కవిత అని నిరూపించ డానికి యత్నిస్తు ప్రసంగించాడు. ఒకరిద్దరు కళాశాల అధ్యా పకులు మినహా తక్కిన వారంతా ఆ వ్యక్తి చూపించిన ప్రమాణాలు విశ్వసనీయమనే భావించారు ఆ తరవాత అధ్య క్షుడు లేచి ఇలా ప్రసంగించాడు.

"కవి తన యిరవయిఅయిదోయేటనుంచి ముప్ఫయ్యో యేడు వరకు అంటే అయిదు సంవత్సరాలుమాత్రమే కవిత్వం చెప్పాలి. అతని తరవాతవచ్చే కవి నుంచి మనం అంతకంటె మంచి కవిత ఆశించం. విభిన్నమయిన కవితను ఆశిస్తాం. మామిడిపళ్ళ కాలం ముగిసిన తరవాత యింకా మంచి మామిడిపళ్ళు కావాలని కోరుకోం. తాజా సీతాఫలాలు

రావాలని కోరుకుంటాం. కొబ్బరిబొండాం కొద్దికాలమే వుంటుంది మకరందం కూడా క్షణికమే కాని ఎండు కొబ్బరి కాయ చాలా కాలం వుంటుంది. ఎండుకొబ్బరి యింకా యెక్కువకాలం వుంటుంది. అలాగే కవులు నీటిబుడగలవంటి వారు. తత్త్వవేత్తలు శాశ్వితులు. రవీంద్రనాథటాగోరు పాత బడిన వర్ద్యవర్తును అనుకరిస్తూ యింకా కవిత్వం చెప్పాలనే మొండిపట్టుదలతో వున్నాడు. ఇదే అతనిమీద మాకుగలగట్టి అభ్యంతరం అనేకసారులు యమధర్మరాజు దీపం ఆర్పే యవలసిందని పిలుపు యిచ్చాడు. కాని యీ ముదుసలి తన సింహాసనంమీదనుంచి లేచినా దాని చేతులను పట్టుకునివేలా డుతున్నాడు తనంతటతానే సింహాసనం వదలిపెట్టకపోతే మనమంతా ఒక్కుమ్మడిగా అతని దర్బారును వదలివేయడం మన కర్తవ్యం అతని తరవాత సింహాసనం ఎక్కే వ్యక్తి విజయగర్వంతో తన పాలనకు అంతంలేదంటూ గర్జిస్తాడు. తన నివాస ద్వారానికి ఆకాశాన్ని కట్టివేస్తానని ప్రగల్భాలు పలుకుతాడు. అతని భక్తులు కొంతకాలం అతనిని పోషిస్తారు. గౌరవిస్తారు. పూజిస్తారు. కాని పరిత్యాగ శుభముహూర్తం వస్తుంది. అపుడు ఆ భక్తులే భక్తి బంధనాలనుంచి విముక్తి కోసం ఆందోళన చేస్తారు. ఈ విధంగానే ఆఫ్రికాలో చతు ష్పాద దేవతను ఆరాధిస్తున్నారు. ఈవిధంగాకూడా ద్విపాద, త్రిపాద, చతుష్పాద, చతుర్దశపాద ఛందస్సును ఆరాధించ వచ్చు. రసహీనమయే వరకు భక్తిని కొనసాగించే అప చారంతో అపవిత్రతను పోల్చనయినా లేము...... మొప్పుకు కూడా పరిణామం వుంది. అయిదు సంవత్సరాలకితం మనం

మెచ్చుకున్నది యింకాఅలాగే అంటిపెట్టుకునివుంటే దానిలో జీవం నశించిందని పాపం! దానికి తెలిసి వుండదు. నిజమైన వారసులకు న్యాయంగా వారసత్వం దక్కకుండా మోసగించ డానికి ఖనన కాండను దాని నభిమానించేవారు ఆలస్యం చేస్తున్నారు. దీనిని రుజువు చేయడానికి ఆ మృత కవితను అటూ యిటూ కదలించాలసి వుంటుంది. టాగోరు అభి మానుల ఈ అక్రమ కుట్రను బట్టబయలు చేయడానికి నేను ప్రమాణం స్వీకరించాను," అన్నాడు.

దానికి మనిభూషన్ కళ్ళజోడును తళుక్కుమనిపిస్తూ "అలా అయితే సాహిత్యం నుంచి భక్తివిశ్వాసాలను తరిమి వేస్తావా?" అని ప్రశ్నించాడు.

"ఆ-పూర్తిగా. సాహిత్య నిరంకుశ విధానం త్వరిత గతిని కాలగర్భంలో లీనమయిపోతోంది. రవీంద్రనాథ టాగోరు రచనా లేఖ అతని దస్తూరీలాగానే గుండ్రంగానో, తరంగంలాగానోవుంటుంది. గులాబీపూలనో, చందమామనో, స్త్రీ ముఖాలనో జ్ఞాపకం చేస్తూంటుంది. ప్రకృతిని అనుక రించడం అతి ప్రాచీన విధానం నూతన సాహిత్య నిరంకుశుని నుంచి ముళ్ళలాగా బాణాలలాగా బల్లాలలాగా సరళంగా వాడిగావుండే సాహిత్య సృష్టిని ఆశిస్తాం. పుష్పాలలాగాగాక మురుపుతీగలాగా, నాడీ వ్యాధి బాధలాగా, దేవాలయ మంటపంలాగా వర్తులంలాగా కోణాకార బల్లీలాగా గుచ్చు కునేటట్టుండాలి. నారమిల్లులాగా ప్రభుత్వ కార్యాలయంలాగా కనిపించినా పరవాలేదు... ఛందో సంకెళ్ళ వ్యామోహం నశించగానే సీతను రావణుడు పెకలించుటకు వెళ్ళినట్లు మీ

మనసుల ఛందోలోనుంచి ఛందో వ్యామోహమును పెకలించి వేయండి. మనసుగనక అభ్యంతరపెట్టి ఏడ్చిమొత్తుకున్నా దానిని లాగివేయవలసిందే. వృద్ధ జటాయువు అడ్డువచ్చి మృత్యువాతపడితే పడనీ. తొందరలోనే కిష్కింధలోని మర్కటలోకం చెలరేగుతుంది. అనుమానంలేదు. ఏ హనుమంతుడో లంకా పట్టణంమీద వురికి దగ్ధంచేసి మనసును తిరిగి దాని నివాసస్థానానికి తీసుకువస్తాడు. అపుడు మనం టెనిసన్ కవి పునర్జన్మోత్సవం జరుపుకుంటాం. బైరన్‌కవి మెడ మీద వాలి కన్నీరు మున్నీరుగా ప్రవహింపజేస్తాయి. స్వీయ వ్యామోహంనుంచి కోలుకోనడానికే నిన్ను విడనాడామని చెప్పి డికెన్సును క్షమాపణ కోరతాం... మొగల్‌చక్రవర్తుల కాలంనుంచి పిచ్చిగా స్వప్నాలుగనే శిల్పి యీ ప్రాచీన భూఖండమంతటా నీటిబుడగలలా చలువరాతి గుమ్మటాలను నిర్మించివుంటే యిరవయియేళ్ళ వయసు వచ్చిన ప్రతి పెద్ద మనిషి వానప్రస్థాశ్రమం పుచ్చుకునేవాడు తాజమహల్‌ను మెచ్చుకోవాలంటే దానిమీది వ్యామోహంనుంచి తప్పించుకోవాలి. (అమితవాదనలు అర్థంకాక మా విలేఖరి తల తిరిగి పోయిందని యిక్కడ మనవి చేసుకోవలసి ఉంది. అమిత ప్రసంగంకంటె అతని కథనం మరీ దుర్గ్రాహ్యంగా ఉంది. వాటిలోనుంచి కొన్నిటిని పరిక్రమబద్ధంచేసి యిక్కడ పొందుపరచడ మయింది.)"

తాజమహల్ ప్రసక్తి తెచ్చేసరికి టాగోరు అభిమానులలో ఒకరు మండిపడ్డాడు. మొహం కందగడ్డ అయింది.

"మంచివస్తువులు యెన్నివుంటే అంతమంచిదికాదా?" అన్నాడు

"కాదు. కొరత శ్రేష్ఠతనుసృష్టించడం, అతిసామాన్యతకు దారితీయడం ప్రకృతి ధర్మం... అరవయి డబ్భయిఏళ్ళ వయసు వచ్చేవరకు జీవితానికి అంటిపెట్టుకుని వుండడానికి సిగ్గుపడని కవులు తమకుతామే చవున్ పరచుకుంటారు. వారు దాని ఫలితాలను అనుభవించ వలసిందే. చివరకు వారిని అనుకరించేవారే వారిని చుట్టుముట్టి వేళాకోళం చేస్తారు. వారి రచనలు యోగ్యతను కోలుపోతాయి. వారి గత రచనలలోనుంచి వారే దొంగిలించి దొంగవస్తువుల వ్యాపారుల కింద తయారవుతారు. అటువంటప్పుడు పాఠకలోకం మానవ క్షేమందృష్ట్యా యీ వృద్ధ వ్యర్థ జీవులను మననీయరాదు అంటే కవిగా మననీయరాదు. భౌతికంగా కాదు. వారి వృద్ధ ఆచార్యులు, వృద్ధ రాజకీయవేత్తలుగా, వృద్ధవిమర్శకులుగా మననీయవచ్చు."

అంతకుముందు మాట్లాడిన వక్త, "అయితే మీ నిరంకుశ సాహితీవేత్త పేరు చెపుతారా?" అని అడిగాడు.

"నివారణ చక్రవర్తి," అని అమిత వెనువెంటనే జవాబిచ్చాడు

"నివారణ చక్రవర్తి? యెవరాయన?" అని ఆశ్చర్యంతో ముక్తకంఠంతో ప్రశ్న వెలువడింది.

"నేడు యీ ప్రశ్న విత్తనంలాంటిది. రేపుదీని జవాబు మహావృక్షంగా రూపొందుతుంది," అన్నాడు అమిత.

"సరే. యీ లోగా అతని రచనలలో నుంచి మచ్చు తునక వినదలచాం."

"అయితే వినండి," అంటూ అమిత జేబులోనుంచి పొడుగాటి కాన్వాసు బైండు నోటుపుస్తకం తీసి తెరిచి చదవ సాగాడు.

నేను ఒంటరిని
బాటసారుల గుంపుమధ్య,
వికృత జనగణ దేవతా
వికట్టహాస జనిత
నూతన భావ ప్రకాశమును నేను
మీ ద్వారాలు తెరువుడి
కాల దేవత పంపిన
అజ్ఞాత అక్షరాల
సవాలు అందుకునే
వ్యక్తికై గాలించుచుంటి.
ఆ సవాలును పెట్టరు చెవిని
మేధా దరిద్రులు
అటకాయింతురుతోవ
వారి వ్యర్ధకోపం
విరుచుకుపడు నాపై
చలించని బండరాతిని
ఢీకొనే తరంగాల వోలె
పూలకిరీటం లేదునాకు
లేదు కవచం వక్షస్థలి

నా దుస్తులు చినిగినా
కిరీటంలేని నా నుదుట
దాగియున్నది శుభ విజయచిహ్నం,
నీ వస్తుసముదాయంబును
విరజిమ్మి చివరవరకు
తెరువుము నీ ద్వారమ్ము
ఆలసించక లొంగిపొమ్ము
నా బలవంతపు కోరికలకు.
నా హృదయం కొట్టుకొనును
గడియలు వణికిపోవును
కిందభూమి నిట్టూర్చును,
భయపడిన జీవాత్మ
"పొమ్ము పో పొమ్ము
నిర్దయుడా! కలహప్రియుడా!
పీడకుడా! పో పొమ్ము!
నా వ్యర్థ ప్రలాపం
వాడిగల కత్తిలాగా
మా అర్థరాత్రి నిద్రాహృదిని
గుచ్చుకొనెను."
తెమ్ము నీ కత్తిని
నా పార్శ్వస్థికపై
నాటించుము!
మృత్యువును మృత్యువు
హతమార్చగనిమ్ము.

నీకు శాశ్వత కానుకగా
చేతును ప్రాణదానంబు
సంకెళ్ళతో బంధింపుము నన్ను
ముక్కముక్కలుగా తెంచివేయ
స్వాతంత్ర్యం సంపాదించి
ప్రసాదింతు నీకు స్వాతంత్ర్యం
శ్రుతి స్మృతులతో
ముట్టడింతువా నన్ను!
వాటిలోని యుక్తుల
ఖండింతు ముక్కలుగా
నీ కనుల కప్పిన శుష్క పదబంధాల
తొలగించి వెలుగు ప్రసాదింతు
రగుల్చుము అగ్నిజ్వాలలు!
నేటి కాంతి మాసినదని వగవకు
రేపు భూమిని నింపు బూడిదతో
పాలద్రోలుము దుఃఖమును
అద్వితీయ ఔపదేశిక
అగ్నికీలలో ప్రకాశించు
విశ్వమిత్రునకు స్వాగతంబిమ్ము
నా పిలుపు, బలీయ ముష్టిపోటై
శత్రుహృదయాల కదలించివైచు
పోరాట విరమణ కాంక్షించి
సులభ ముక్తికై అన్వేషించు వారిని
దారిద్ర్యంతో పాలిపోయి

ప స్తులు చేసేవారిని
కలవర పెట్టును నా ఉన్మత్త కవిత
సుదురు కొట్టుకొనుచు
భయంతో కోపంతో కన్నీటితో
ఒకరొకరు అపరిచితుని
విజయం అంగీకరింతురు
భయంకర తుఫాను
ఊపివేయును విశ్వమ్మునంత
ఉరుములతో బెదరించును.
స్వాతంత్ర్యోన్మాదంలో
గర్భమ్మున వర్షము దాచికొన్న
మేఘమ్ముల చిందరవందరపరచి
నశింపజేయు సుమ్ము

టాగోరు అభిమానులు ఆనాటికేమీ మాట్లాడకుండా అక్షరముఖంగా వాదన కొనసాగిస్తామని బెదిరించి వెళ్ళి పోయారు.

శ్రోతలను విజయవంతంగా పరాజితులనుజేసి అమిత కారులో ఇంటికి వెళుతూండగా సిసీ, "యీ పెద్దలను కలవర పెట్టడానికి నివారణ చక్రవర్తిని సృష్టించి జేబులో నుంచి తీశావుగదూ!" అంది.

దానిమీద అమిత, "అనాగతుల రాకను త్వరితం చేయడం విధివిలాసం. నేనా విధిపాత్రను నిర్వహిస్తున్నాను. యీ రోజున నివారణ చక్రవర్తి యీ భూమిమీద అవత

రించాడు. యిక అతని పురోగమనానికి అడ్డంకిలేదు," అని ప్రత్యుత్తరమిచ్చాడు.

సిసీ లోలోపల సోదరుని చూసుకుని గర్వపడసాగింది. "అమిత! ప్రతిరోజు వుదయం కూర్చుని ఆ రోజు వుపయోగించే సూక్తులను తీర్చిదిద్దుతూంటావా?" అని అడిగింది.

"యేవేళ యేమి సంభవిస్తుందో అన్నిటికీ తయారయి వుండడంనాగరికతాలక్షణం అనాగరికత తెలియకుండానే పట్టుపడిపోతుంది. యీ విషయంకూడా నానోటు పుస్తకంలో వ్రాసివుంచాను."

"నీకు నీ స్వంత అభిప్రాయాలంటూ లేనట్టున్నాయే. ఆ సమయానికి యేది శ్రేష్ఠంగాతోస్తే అది చెప్పేస్తూంటావు!"

"నా స్వంత అభిప్రాయాలను నా హృదయ దర్పణానికి పులిమితే సంచలించే క్షణికాలను ప్రతిబింబింపజేయదు."

"అమితా! నీ జీవితం ప్రతిబింబాలమధ్య గడుస్తుంది," అంది సిసీ.

## సంఘాతం

ఎట్టకేలకు షిల్లాంగ్ వెళ్ళడానికి అమిత నిశ్చయించుకున్నాడు. రెండు కారణాల ప్రభావంవల్ల ఈ నిర్ణయం జరిగింది. అతని వర్గీయులెవరూ ఎపుడు అక్కడికి వెళ్ళకపోవడం ఒకకారణం. అక్కడ పెళ్ళికొడుకులకోసం వేటతీవ్రంగాలేదు. అమిత హృదయాన్ని తన బాణానికి లక్ష్యంగా చేసుకున్న

దేవత తన గురి దూరమును నవనాగరీక ప్రదేశానికి పరిమితం చేసుకున్నాడు. కొండలమీదివిలాసప్రదేశాలలోషిల్లాంగ్‌లో అతని బాణ సంధాన అభ్యాసానికి అవకాశంతక్కువ. అమిత సోదరీమణులు శిరఃకంపనంతో తమ మనసులోని భావాలను "వెళ్ళితీరాలంటే నువ్వు వెళ్ళు. మేమురాము," అంటూ తెలియజేశారు

అనుకరణ పారసీకశాలువా దుస్తులను ధరించి, ఎడమ చేత సుకుమారమయిన నవనాగరీక గొడుగుపట్టుకొని, కుడిచేత టెన్నీసు రాకెట్టు పట్టుకుని ఆ బాలికలు డార్జిలింగ్‌కు బయలు దేరారు. వారికిముందే విమ్మీబోసు అక్కడికి వెళ్ళిఉంది. అమితను వెంటబెట్టుకురాకుండా సిసీ లిసీలు మాత్రమేరావడం చూసి ఆమె నలువేపులా పరికించి డార్జిలింగ్‌లో జనసందో హమేగాని సహచరులులేరని గ్రహించింది.

ఏకాంతం అనుభవించడానికి షిల్లాంగ్ వెళుతున్నానని కనిపించినవారందరితో అమిత చెప్పాడు. కాని త్వరలోనే జన సందోహం లేకపోవడంవల్ల ఏకాంతంలోని ఆనందం లోపిం చిందని గ్రహించాడు కెమేరా పట్టుకుని ఆరుబయట దృశ్యా లనుచూస్తూ తిరగాలనే కాంక్ష అమితకు లేదు. తాను విలాస యాత్రీకుడను కానని చెప్పుకున్నాడు. అచ్చటి దృశ్యాలలోని సౌందర్యాన్ని మనసుతో ఆస్వాదించడమేగాని కంటితో ఆస్వాదించడం అతని విధానం కాదు.

కొండవాలుమీద దేవదారు వృక్షాల నీడను పుస్త కాలు చదువుతూ కొన్నిరోజులు కాలక్షేపం చేశాడు. నవ లలు ముట్టుకోలేదు. శెలవురోజులలో నవలలు చదవడం అనా

గరీక లక్షణమని అతని అభిప్రాయం. నవలలు బహులు సునీతి చటర్జీ రచించిన, "బెంగాలీ సాహిత్యం పుట్టుపూర్వోత్త రాలు," అనే గ్రంథం చదవడం ప్రారంభించాడు. ఆ రచన లోని లోపాలను పట్టుకుని ఆ రచయితతో తర్కించే అవ కాశంకోసమే ప్రధానంగా ఆ గ్రంథం చదవడం మొదలు పెట్టాడు. భాషా తత్వశాస్త్రపఠనోద్రేకం, అలసటల మధ్య అడవులు, కొండలు, పర్వతాలు అతనికి తరుచు రమణీయంగా కనిపించసాగాయి కాని రాగం ఎత్తుకొని పూర్తిచేయని విధంగా, అతనిమనసులో రమణీయతాభావంలోతుగానిండుగా పాదుకునిపోలేదు. చెల్లాచెదరుగా పడిఉన్న భావ సముదాయాన్ని కలిపే ఐక్యతా భావం లోపించింది. అతని స్వీయ విశ్వంలో లోపించిన ఐక్యతాభావం అతనిలో ఎడతెగని కల తకు నిస్పృహాభావానికి కారణం. పట్నంలోకంటె ఇది అక్కడ తక్కువ బాధాకరమేమీ కాదు. పట్నంలో ఉంటే ఎన్నో విధాల దీనిని తప్పించుకుని కాలక్షేపం చేసేవాడు. కాని ఇక్కడ ఆ కలతయే సరోవరంలో బంధించిన జలపాతంలాగా, అతనిలో పాదుకునిపోయి భారంగా తయారయినట్టుంది. ఈ పర్వతాలకు పెడముఖంపెట్టి సిల్హెట్, సిల్చార్ మైదానాలలో చిత్తంవచ్చినట్లు దిమ్మరాలని నిశ్చయించుకునేసరికి వానా కాలం వచ్చేసింది. ప్రతికొండను, ప్రతి అడవిని వానజల్లు చుట్టు ముట్టింది. చెరాపుంజివద్ద పర్వతశ్రేణులు నవవర్ష మేఘ సముదాయాన్ని అడ్డగించాయనీ, భారీవర్షాలవల్లవిజృంభించిన జలపాతాలు పర్వతాలమీాదకు వచ్చిపడతాయనీ వార్తలు వ్యాపించాయి. దానిమీాద అమిత కొన్ని రోజులు చెరా

పుంజిలోని డాన్‌బంగళాలో మకాంపెట్టి అదృశ్య అలకాపురీ నాయిక అశరీర విద్యుల్లతలాగా ఊరూ పేరు చెప్పకుండా హృదయాకాశంలో నిరంతరం మెరిసేటట్లుచేసే మేఘదూతను సృజించుకోవాలని నిశ్చయించుకున్నాడు.

ఆ ప్రకారం పర్వతీయులుధరించే ముతకఉన్ని మేజోళ్ళు లావుపాటి గట్టిమడమల బూట్లు కాళ్ళకువేసుకున్నాడు. కురచ చొక్కామీద అంగరఖా ధరించాడు. తలమీద సోలాహాటు పెట్టుకున్నాడు. అవనీంద్రనాథ టాగోరు చిత్రించిన యక్షుని లాగా లేడుగాని రోడ్డు మరమ్మతులకు బయలుదేరిన జిల్లా ఇంజనీరులాగా ఉన్నాడు. అయినా వివిధ భాషలలోని పద్య జేబు సంపుటాలు కొన్ని కూడా తీసుకుని బయలుదేరాడు.

అమిత ఇంటికి వెళ్ళేదారి ఇరుకు, వంకర టింకర. దాని కుడివేపున అడవితో నిండిన ఏటవాలు కొండగట్టు. ప్రయాణపు రద్దీ ఉండదనే ఉద్దేశంతో అమిత హారన్ మోగించ కుండా నిర్లక్ష్యంగా మోటారుకారు నడుపుతున్నాడు. ఒక సంస్కృత కవి చెప్పినట్లు ధూమం, నీరు, గాలి, అగ్నికణాల సంయోగంవల్ల మేఘదూత రూపొందుతోంది. స్వాయం చోదక వాహనంలో కూడా ఆ పదార్థాలు తగుపాళ్ళలో వున్నాయి. అందుచేత ఆధునిక కాలంలో దూరప్రదేశమందు వున్న ప్రియురాలి వద్దకు మోటారుదూతను పంపడంమంచిది, ప్రశస్తమయినది. మోటారు డ్రయివరుకు ఉత్తరం ఇచ్చి పంపితే అందుతుందో అందదో అనే అనుమానానికి తావు వుండదు. అమిత ఇలా యోచించి వచ్చేవర్షాకాలం ప్రవేశిం చిన రోజున మేఘదూత. ప్రయాణం చేసిన మార్గాన్నే

మోటారు దూత ప్రయాణ ప్రారంభోత్సవం జరపడానికి నిశ్చయించుకున్నాడు. ఎవరికి తెలుసు? ప్రియుని అడుగుల చప్పుడు కోసం గేటుపక్కన నిరీక్షించే కాళిదాసు నాయికలు అవంతిక, మాళవిక, అప్సరాంగనలలాగా విధివిలాసం వల్ల అతనికోసం నిరీక్షిస్తున్న యువతి మార్గంలో తారసిల్లుతుందేమో! ఇలా ఆలోచిస్తు దోవలో మలుపును సమీపించేసరికి ఎదురుగా కారు వస్తూండడం హఠాత్తుగా చూశాడు. ఇరుకుదారి. రెండు కార్లు ఒకదాని సరసన ఒకటి వెళ్ళడానికి వీలులేదు. అమిత బ్రేకు వేశాడుగాని కారు ఆగేలోగా అవతలి కారు వచ్చి గుద్దుకుంది. కాని ప్రమాదమేమీ జరగలేదు. అవతలి కారు వెనుకకువెళ్ళి పర్వత పార్శ్వతలానికి తగిలి ఆగిపోయింది.

ఆ కారులో నుంచి ఒక కన్య బయటకు వచ్చి ఆగింది. మృత్యువాతనుంచి తప్పించుకుని బయటపడ్డ పూర్వభూమిక దృష్ట్యా ఆమె విద్యుల్లత చెక్కిన స్త్రీ మూర్తిలాగా తళుకు తళుకు మంటోంది. చుట్టుముట్టిన విషాద వాతావరణంలో నుంచి వేరుపడ్డ తేజోరేఖలా తోచింది. అమిత కళ్ళ ముందు ఒక అపూర్వ దృశ్యంగోచరించింది. అల్లకల్లోలమై నిట్టూరుస్తున్న పాల సముద్రమును మందర పర్వతం చిలుకుతూంటే పొందిన నురుగుమీదనుంచి అప్పుడే ఉద్భవించిన లక్ష్మిలా ఆమె గోచరించింది. జనంతో నిండిన కచేరి గదిలో అయితే ఆమె పరిపూర్ణ రూపం ఇంతగా ద్యోతకమయేది కాదు. ఈ ప్రపంచంలో చూడదగిన వ్యక్తులు తటస్థ పడుతూనేఉంటారు

కాని వారిని సరయిన సమయంలో, సరయిన ప్రదేశంలో తటస్థపడటం అరుదు.

ఆమె సన్నని తెల్లని, సన్నఅంచు చీర, ఆ చీరకు అనుగుణమయిన జాకెట్టుధరించింది. పాదములకు తెల్లని దేశీ తోలు పాదరక్షలు తొడిగింది. ఆమెపొడుగరి. బక్కపలుచన. ఆమె శరీరం మెరిసే గోధుమరంగు. చారడేసికళ్ళు బొద్దుకను బొమలు. ప్రశాంతలలాటం. వెనకకులాగిముడివేసినజుట్టు. పండ బారిన ఫలంలాగా మనోహరమయిన ముఖబింబం. జాకెట్టు చేతులు మణికట్టు వరకు ఉన్నాయి. మణికట్టుకు రెండే రెండు సన్నని గాజులు. చీర చెరగును భుజాలమీద బ్రూచీతో బంధించకుండా తలమీద మేలిముసుగుగా వేసుకుని కట కంలో తయారయిన వెండిపిన్నీసుతో జుట్టుకు గుచ్చింది.

అమిత హేటును కారులో వదలి దిగివచ్చి మాట్లాడ కుండా చివాట్లు తినడానికి సిద్ధమయినవాడిలా ఆమెకు ఎదు రుగా మాట్లాడకుండా నిలబడ్డాడు. ఈ నిస్సహాయతా భంగి మకు ఆమె మనసు కరిగింది. కుతూహలం హెచ్చింది. ఎట్ట కేలకు అమిత, "తప్పుచేశాను, క్షమించు," అని ఎలాగో మెల్లగా గొణగ గలిగాడు.

దానిమీద ఆ కన్య నవ్వి, "తప్పుకాదు. పొరపాటు. ఆ పొరపాటు కూడా నాదే," అంది.

ఆ కన్య కంఠస్వరం ఊటచెలము పొంగులోని పరి పూర్ణ మూర్ఛనలాగా, బాలుని కంఠస్వరంలాగా సున్ని తంగా ధారాళంగా ఉంది. అమిత ఇంటికి తిరిగి వెళ్ళిన తర వాత సాయంకాలం ఆమె కంఠస్వరంతో పోల్చదగిన ప్రతి

రూపంకోసం తెగ ఆలోచించాడు. ఆమె స్వరంలో ఒకానొక మాధుర్యం, ప్రత్యేక శోభ ఉన్నట్లు అతనికి తోచింది. ఇలా ఆలోచించీ ఆలోచించీ చివరకు నోటుపుస్తకం తీసి ఇలా రాశాడు: "నీటిలో ప్రవహించడం ద్వారా సున్నితమయి పొగాకు వగరు రుచిని కోల్పోయి, స్నిగ్ధ గులాబీ సుగంధ స్పర్శతో హుక్కాలోనుంచి వెలువడే పొగాకు పొగలాగా ఆమె స్వరం తేలియాడుతోంది."

క్షమాపణ కోరుతున్న దానిలా ఆ కన్య, "స్నేహితు రాలు ఒకామె వచ్చిందని తెలిసి కలుసుకోవడానికి బయలు దేరాను. కొద్ది దూరం వచ్చిన తరవాత చాఫరు తప్పుదోవ పట్టామని చెప్పాడు. కారు తిప్పడానికి సందు లేకపోవడంవల్ల ముందుకు సాగిపోతున్నాం. యింతలో పైనుంచి మీ కారు వచ్చి గుద్దుకుంది," అని చెప్పింది.

"పై కారేకాదు, ఆ కారుకు పైన ఆకాశం వుంది. ఆ ఆకాశంలోని దుష్టనక్షత్రపు దుష్కృత్యమే యిదంతా." అన్నాడు అమిత.

సరిగా ఈ సమయంలో చాఫరువచ్చి కారు ఎక్కు వగా చెడిపోలేదుగాని బాగుపడి నడవడానికి కొంతసేపు పడు తుందని చెప్పాడు.

దానిమీద అమిత, "అపరాధం చేసిన నా కారును క్షమించండి. మీ రెక్కడికి వెళ్ళదలచితే అక్కడకు తీసుకు వెళతాను," అన్నాడు.

"అబ్బే! మరేం అవసరం లేదు. థాంక్స్. యీ పర్వత మార్గాలలో నడవడం నాకు అలవాటే," అంది ఆ కన్య.

"అవసరం నాది. క్షమించారనడానికి రుజువు," అన్నాడు అమిత

ఆమె కొంచెం తటపటాయించింది. కాని ఏమీ జవాబు చెప్పలేదు అమిత అంతటితో ఊరుకోకుండా, "యింకో విషయం. కారునడపడం పెద్దవిశేషమేమీ కాదు. వంశపరంపరాభివృద్ధిగా కారు నడపలేం. కాని దురదృష్ట వశాత్తూ ప్రథమ పరిచయంలోనే నా మీద మీకు సదభి ప్రాయం కలిగినట్టులేదు. యీ ప్రపంచంలో నా విలువ కనీసం మీ డ్రయివరుతో సమాన మయినదని రుజువుచేసే అవకాశ మివ్వవలసింది," అన్నాడు

అపరిచయస్తులతో తొలిసారి పరిచయంలో ప్రమాద భయంతో యువతులు సిగ్గుపడుతూంటారు. కారు ఢీకొన్న సంఘటన ఈ ప్రాథమిక తొట్రుపాటును ఎగరగొట్టి వేసింది. వారిమనసులు ఒకదానినొకటి తెలుసుకుని కలిసిపోవడానికి విధి అసమానంతో హఠాత్తుగా ఆరోడ్డుమధ్యన వారినినిలిపివేసింది. ఆకస్మిక విద్యుత్ప్రకాశంవల్ల ద్యోతకమయిన ఆ దృశ్యం నిశాసమయంలో మేలుకొన్నపుడు వెంటాడడానికి అంధకార పటలంమీద తారాడుతూనే ఉంటుంది. నీలి ఆకాశంలో ప్రచండ ఆఘాతంవల్ల సూర్యకుటుంబ అగ్నిజ్వాల జనించి నట్టు వారి చేతన కేంద్రంలో లోతుగా ఆ దృశ్యం ముద్ర పడింది.

ఆమె కాదనకుండా కారు ఎక్కి-కూర్చుని మార్గం సూచించింది. కారు గమ్యస్థానం చేరుకోగానే ఆమె కారుదిగి "తీరుబడిగా వుంటే రేపు ఒకసారి యిక్కడికి దయచేయండి. యీ యింటి యజమానురాలికి మిమ్ముల్ని పరిచయం చేయ దలిచాను," అంది.

అమిత్, "ఓ అలాగే రాగలను. కావలసినంత తీరుబడి వుంది," అని అనాలనుకున్నాడుగాని కలవరపాటువల్ల అతని నోటివెంట మాటలు పెగలలేదు.

ఇంటికి తిరిగివచ్చి నోటుపుస్తకంలో ఇలా రాశాడు: "రోడ్డుమీద ఈ వున్మాదమేమిటి? రెండు విభిన్న స్థలాలనుంచి యిద్దరు వ్యక్తులనుబయలుదేరదీసి, బహుశా యీ రోజునుంచి ఒకే ఒక మార్గంవెంట పయనించేటట్లు చేయడమేమిటి? జ్యోతిష శాస్త్రవేత్తలు పొరబడ్డారు. అజ్ఞాత ఆకాశమండలం నుంచి చంద్రుడు భూమి కక్ష్యలోకి మహావేగంతో ప్రవేశించాడు. వారిమోటారుకార్లు ఢీకొన్నాయి అలాఢీకొన్ననాటి నుంచి ఆరెండూ యుగయుగాలుగా ఒకేమార్గంలోపయనిస్తూ ఒకటి నొకటి ప్రకాశింపజేసుకుంటున్నాయి చలనంలో వాటి బంధనం తెగిపోలేదు. మేంకూడఒకరిచేయిఒకరంపట్టుకుని ఒకే మార్గంవెంటపయనిస్తూ, మార్గంలోఉజ్వల క్షణాలనుఏరి మా యాత్రామాలికగా గుచ్చుతున్నామని నా హృదయం చెపుతున్నట్టునాలోవినిపిస్తున్నది. మానిర్ణీతజీతభత్యాలకోసంఅదృష్టదేవత మందిర ద్వారంలో నిరీక్షించవలసిన అగత్యంలేదు."

బయట వర్షం కురుస్తోంది. వరండాలో అటు ఇటు పచార్లుచేస్తూ మౌనంగా ఇలా ధ్యానించసాగాడు, "నివారణ

చక్రవర్తి! యెక్కడున్నావు? సహాయం చేయడానికి రా, రా! వచ్చి నా నోటివెంట మాటలు పలికించు, నాకు సుస్వరం ప్రసాదించు!" అంతట పొడుగాటి సన్నని నోటుపుస్తకం బయటకు వచ్చింది. నివారణచక్రవర్తి చెపుతూంటే అమిత రాయసాగాడు:

సంకెలలులేని బంధనంలో రోడ్డు మమ్ము బంధించింది
గాలివాటున సాగిపోతూంటాం మేము
రంగురంగు క్షణాలు, ధూళి మురిపాలు
హృదిపై జల్లును కపోలాల వసంతాలు
వాయు అప్సర్సలు నర్తింతురు
వర్షాభ్రములపై మేలిముసుగులు తేలియాడ
హఠాత్ కాంతి కిరణాలు ప్రకాశింపజేయు హృదిని
కనకచంపా పుష్పలతాగృహమ్ము లేదు మాకు
వకుళ పుష్పాలు వెదజల్లిన వనవీధి లేదు మాకు
సందెవేళ నామహీన పుష్ప సౌరభమ్ము
తేలియాడును అజ్ఞాతంగా
ఉదయ సంధ్యాకాంతిలో శాఖశాఖలపై
గుమిగూడిన దాఫోడెన్ ఫ్రాన్ గుచ్ఛాలు
ఉదయ అరుణమేఘాల మేలమూడును నిరాఘాటంగా
లేదు మాకు ధనరత్న సంచయమ్ము
లేదు గృహానందం ప్రేమైకలాలన
పక్షులు కోకిల నాడించు మార్గమందు
కాని బంధింపము వాటిని పంజరాన
స్వాతంత్ర్య ప్రియులు జంటజంటలుగా

రెక్కలువిప్పి సంతృప్తిగా కూయును
అనిరీక్షిత సంచలిత కాంతిపుంజమ్ము
దివ్యదీప్తితో ప్రకాశింపజేయు మమ్ము

## పూర్వ భూమిక

బెంగాలులో ఆంగ్లవిద్యాబోధన ప్రవేశపెట్టిన ప్రథమ దశలో పురాతన విద్యా పీఠాలకు నూతన పాఠశాలలకు కళాశాలలకు వాతావరణం విభేదించడంవల్ల సాంఘిక సంఘర్షణ తుఫానులా జనించింది. ఈ తుఫానులో జ్ఞానానంద శంకర్ చిక్కుకున్నాడు అతను జన్మతః పూర్వకాలపు మనిషి. కాని హఠాత్తుగా నూతన కాలంలోకి వచ్చిపడ్డాడు. అతను కాలానికి ముందుగాపుట్టి దృక్పథంలోగాని, మాటలలోగాని, అలవాట్లలోగాని సమకాలికులతో కలిసి పోలేకపోయాడు. తరంగాలమీద ఊగుతూ ఆనందించే సముద్రపు పక్షిలాగా సాంఘిక నిందా దుమారానికి ఛాతీ అప్పగించి నిలబడడం అతనికి ఆనందం.

అటువంటి వ్యక్తి సంతానం కాల చాపల్యాన్ని సరిచేసే బాధ్యతను వహిస్తే వారు సూటిగా విరుద్ధ గమ్యస్థానానికి వచ్చిపడతారు. జ్ఞానానందశంకర్ మనుమడు వరదాశంకర్ విషయంలో సరిగా ఇలాగే జరిగింది. తండ్రి నిర్యాణానంతరం వరదాశంకర్ కాల విరుద్ధంగా తాతతండ్రులకంటె కూడా సనాతనుడుగా తయారయాడు. అతను నాగదేవతా భక్తుడు. మశూచి దేవతను తల్లిగా భావించి ప్రార్థించేవాడు. తాయె

త్తుతో మంత్రించిన నీరుతాగి దుర్గ సహస్రనామాలు వ్రాయ డంతో ఉదయకాలమంతాగడిపేవాడు. యావజ్జీవం బ్రాహ్మ ణేతరుల జ్ఞానార్జనా నటనను తూర్పార బడుతూండేవాడు. విజ్ఞానశాస్త్ర అంటువ్యాధి సోకకుండా హిందూ మతమును రక్షించడానికి సనాతన మహాపండితుల సహాయంతో మహ ర్షుల అపార విజ్ఞానాన్ని ఆధునిక మేధావులకు ఉచితంగా అంద య జేడానికి ఎంతాఖర్చుకయినా వెనుదీయకుండాఅసంఖ్యాక కర పత్రాలను ప్రచురించాడు. కొద్దికాలంలోనే పెద్దలు నిర్ణయిం చిన విధంగా జప కర్మకాండలను విసుగు విరామం లేకుండా ఆచరించి అచంచల సనాతన ధర్మ దుర్గాన్ని రక్షించి దుర్భే ద్యంగా తయారు చేశాడు. ఇరవయి ఏడవ ఏట అసంఖ్యాక బ్రాహ్మణులకు మాతాపితల పేరున కుమార్తె పేరునగోదానం, సువర్ణదానం, భూదానంచేసి వారి ఆశీస్సులుపొంది జీవా త్మను వదలివేశాడు.

వరద భార్య యోగమాయ అతని తండ్రికి ప్రాణ స్నేహితుడయిన రామలోచన బెనర్జీ కూతురు. వారిద్దరూ ఒకేసారి ఒకే కళాశాలలో చదువుతూ ఒకే హోటలుకువెళ్ళి విదేశీమాంసపు తునకలులాంటి నిషిద్ధ పదార్థాలను తినేవారు. వివాహ సమయంలో ఆమె పుట్టింటి అత్తింటి ఆచారవ్యవహా రాలకు సంఘర్షణ ఉండేదికాదు. ఆమె పుట్టింట బాలికలు చదువుకునేవారు. స్వేచ్ఛగా తిరిగేవారు. వారిలో కొంత మంది సచిత్రమాసపత్రికలలో వారి యాత్రానుభవాలను వ్రాశారుకూడా. కాని వివాహానంతరం ఆమె భర్త ఆమే సంస్కృతిలో పూర్తి సంస్కరణను తీసుకువచ్చే బాధ్యతను

పైన వేసుకున్నాడు సనాతన సరిహద్దు రక్షణకు నీతికి విధాయకమయిన అవసరాలకు అనుగుణంగా తయారుచేసిన నియమావళి ఆమె సంచారగతికి విధినిషేధాలు ఏర్పరచింది. ఆమె నేత్రాల మీదకు మేలిముసుగు వచ్చిపడి మనసునుకూడా కప్పి వేసింది. జనానాలోనికి వెళ్ళడానికి అనుమతి కావాలంటే చదువులరాణి సరస్వతీదేవి అయినా సోదాకులోబడవలసిందే. ఆమె వద్దఉన్న ఇంగ్లీషు గ్రంథాలను వెనువెంటనే స్వాధీనం చేసుకున్నాడు. ఇక బెంగాలీ గ్రంథాలలో బంకిం పూర్వ రచయితల సాహిత్యానికి మాత్రమే ఆ ఇంటిద్వారం దాటి లోనికి వెళ్ళడానికి అనుమతి లభించేది. చక్కగా బైండుచేసిన యోగవాసిష్ఠ రామాయణ బెంగాలీ అనువాద గ్రంథం చిరకాలం నుంచి ఆమె పుస్తకాల అలమారాను అలంకరించింది. ఆమె వినోదంకోసం ఎప్పటికయినా ఆ ఆధ్యాత్మిక ప్రమాణిక గ్రంథం చదువుతుందని జీవితం ఆఖరిఘడియవరకు ఆమె భర్త ఆశిస్తూనే ఉన్నాడు.

పురాణాల ఇనపపెట్టెలో భద్రంగా ముకిలించుకు కూర్చోవడం కష్టమయినా ఆమె తిరగబడే మనసుకు కళ్ళెం వేయడం నేర్చుకుంది. ఈ మానసిక దిగ్బంధంనుంచి ఆమెకు ఏకైక శరణ్యం వారి కుటుంబ పురోహితుడు పండిత దినశరణ వేదాంతరత్న. అతను ఆమె సహజ కుశాగ్రబుద్ధిని మెచ్చుకుంటూండేవాడు. అతను, "బిడ్డా! కర్మకాండల జంజాటము నీకు యుక్తమయిందికాదు. మూఢులు తమను తాము మోసగించుకుంటారు. పైగా ప్రపంచం వారిని మోసగిస్తుంది. యీ శాస్త్రాలను మేము విశ్వసిస్తున్నామని భావిస్తున్నా

వేమో! యే మాత్రం వెనుదీయకుండా మేము మా సౌకర్యాలకు అనుగుణంగా శాస్త్రాలను తలకిందులుచేసి చెప్పడం గమనించలేదా? అంటే మాకు యీకర్మకాండల్లో విశ్వాసంలేదని బోధపడడంలేదా? మూఢులను సంతృప్తి పరచడానికి మేము మూఢులంగా నటిస్తాం అయితే నువ్వు నిన్ను మోసగించుకోదలుచుకోలేదు కాబట్టి నిన్ను నేను మోసగించదలచుకోలేదు. నీకు యిష్టం వచ్చినప్పుడు నాకు కబురుచేయి. వచ్చి యదార్థమని నేను విశ్వసించే శాస్త్ర భాగాలను చదివి వినిపిస్తాను," అని స్పష్టంగా చెప్పాడు.

అతను అప్పుడప్పుడువచ్చి యోగమాయకుగీతలోనుంచో బ్రహ్మభాష్యంలో నుంచో చదివి వ్యాఖ్యానం చెప్పేవాడు. యోగమాయ గట్టిప్రశ్నలు వేసేది. ఆమె తెలివితేటలకు అతను ఎంతో సంతోషించేవాడు. ఆ విషయాలు ఆమెతో చర్చించేటప్పుడు ఎక్కడలేని ఉత్సాహం చూపేవాడు. వరదాశంకర్ తన చుట్టు చేర్చిన వేదాంతోపదేశకులంటే వేదాంతరత్నకు గౌరవ లేదు. ఆ మహా పట్టణ మంతటిలోనూ ఆమె ఒక్క దానితో చర్చించడమే తనకు సంతోషదాయకంగా ఉంటుందని అతను ఆమెతో చెప్పాడు. "బిడ్డా! నువ్వు నన్ను ఆత్మతిరస్కారంనుంచి రక్షించావు," అన్నాడు ఆమెతో. ఈ విధంగా ఎడతెగని వ్రతాలు ఉపవాసాల జంజాటన చుట్టుముట్టినా, ఆమె నియమబద్ధ అయినా ఎలాగో శాస్త్రదాస్య జీవితంనుంచి తప్పించుకుని మన గలిగింది.

భర్త మరణానంతరం యోగమాయ తన కుమారుడు యతిశంకర్, కుమార్తె సురమాలను వెంటబెట్టుకుని బయటకు

వేమో! యే మాత్రం వెనుదీయకుండా మేము మా సౌకర్యాలకు అనుగుణంగా శాస్త్రాలను తలకిందులుచేసి చెప్పడం గమనించలేదూ? అంటే మాకు యీకర్మకాండల్లో విశ్వాసంలేదని బోధపడడంలేదా? మూర్ఖులను సంతృప్తి పరచడానికి మేము మూర్ఖులంగా నటిస్తాం అయితే నువ్వు నన్ను మోసగించుకోదలుచుకోలేదు కాబట్టి నిన్ను నేను మోసగించదలచుకోలేదు. నీకు యిష్టం వచ్చినప్పుడు నాకు కబురుచేయి. వచ్చి యదార్థమని నేను విశ్వసించే శాస్త్ర భాగాలను చదివి వినిపిస్తాను," అని స్పష్టంగా చెప్పాడు.

అతను అప్పుడప్పుడువచ్చి యోగమాయకుగీతలోనుంచో బ్రహ్మభాష్యంలో నుంచో చదివి వ్యాఖ్యానం చెప్పేవాడు. యోగమాయ గట్టిప్రశ్నలు వేసేది. ఆమె తెలివితేటలకు అతను ఎంతో సంతోషించేవాడు. ఆ విషయాలు ఆమెతో చర్చించేటప్పుడు ఎక్కడలేని ఉత్సాహం చూపేవాడు. వరదాశంకర్ తన చుట్టు చేర్చిన వేదాంతోపదేశకులంటే వేదాంతరత్నకు గౌరవ లేదు. ఆ మహా పట్టణ మంతటిలోనూ ఆమె ఒక్క దానితో చర్చించడమే తనకు సంతోషదాయకంగా ఉంటుందని అతను ఆమెతో చెప్పాడు. "బిడ్డా! నువ్వు నన్ను ఆత్మతిరస్కారంనుంచి రక్షించావు," అన్నాడు ఆమెతో. ఈ విధంగా ఎడతెగని వ్రతాలు ఉపవాసాల జంజాటన చుట్టుముట్టినా, ఆమె నియమబద్ధ అయినా ఎలాగో శాస్త్రదాస్య జీవితంనుంచి తప్పించుకుని మన గలిగింది.

భర్త మరణానంతరం యోగమాయ తన కుమారుడు యతిశంకర్, కుమార్తె సురమాలను వెంటబెట్టుకుని బయటకు

గణితశాస్త్ర యదార్థాలతో ఘనీభవించిందనీ బాహ్య ప్రపంచం ఆమె మనసుకు ఏమాత్రం హత్తుకోదనే గట్టిగా నమ్ముతూ వచ్చాడు. ఆమె వివాహం చేసుకోకుండా ఉండే అవకాశం ఉందని భావించాడు. "వివాహంచేసుకోకపోతేనేం! విజ్ఞానాన్నే వరించనీ!" అనుకునేవాడు.

అతని ప్రేమకు పాత్రమయిన ఇంకో వ్యక్తి శోభన్ లాల్. అంత చిన్న వయస్సులో అతనిలా అంత శ్రద్ధగా విజ్ఞానాన్నార్జించడానికి కాలం వినియోగించే బాలురుఅరుదు. శోభనలాల్ నుదురువిశాలం. స్వచ్ఛమైనకళ్ళు. ఉల్లాసంతాండ వించే పెదవులవంపు మనోహర ముఖంలో సుకుమార మంద హాసం చూపరులను ఆకర్షించేది. కాని అతనికి బిడియం ఎక్కువ అతనివంక ఏమాత్రం ధ్యాసపెట్టిచూసినా కలవరపడే వాడు.

అతని కుటుంబం బీదకుటుంబం. ఉచిత విద్యార్థి వేతన సోపానాల నెక్కుతూ దుర్గమ పరీక్షా శిఖరాలను చేరుకుంటు న్నాడు. శోభన్‌లాల్ ఎప్పుడో ఒకప్పుడు గొప్పకీర్తి సంపా దిస్తాడని, ఆ కీర్తిని తీర్చిదిద్దిన ప్రధాన శిల్పిగా తనకూ కీర్తి లభిస్తుందనీ అవనీశదత్తా గర్వపడుతూండేవాడు. శోభన పాఠాలు చెప్పించుకోవడానికి అతని వద్దకు వెళుతూండేవాడు. అడ్డులేకుండా అతని గ్రంథాలయంలోకి చొచ్చుకుపోతూండే వాడు లావణ్య కనిపించితేచాలు కంగారు పడేవాడు. బిడి యంతో ముకుళించుకుపోయి వెనకకు తగ్గుతూండడంవల్ల లావణ్య దృష్టిని ఎక్కువగా ఆకర్షించలేక పోయాడు. తమ

ఉనికిని స్త్రీల దృష్టికి తీసుకురావడానికి తటపటాయించే పురుషులలాగానే విధివిలాసాన్ని ఆశ్రయించాడు.

ఒకరోజున హఠాత్తుగా శోభనలాల్ తండ్రి నానీ గోపాల్ అవనీశ ఇంటిమీదకు వచ్చిపడి ఏకధాటిగా నానా తిట్లు తిట్టాడు. అవనీశ ఇంట్లో వలపన్ని పాఠాలు చెప్పే మిషతో పెళ్ళికావలసిన యువకులను ఆకర్షిస్తున్నాడనినిందించాడు. సాంఘిక సంస్కరణోన్మాదంలో మునిగిపోయి శోభనలాల్‌వంటి అగ్రవర్ణ బాలురను వర్ణభ్రష్టులను చేయదలచాడని నేరంమోపాడు. అందుకు సాక్ష్యంగా అతని కుమారుని పెట్టెలో గులాబీరేకులతో కప్పిన లావణ్య పెనసలు చిత్రం చూపాడు.లావణ్య ఆ చిత్రాన్ని తన కుమారునికి జ్ఞాపకార్థం పంపిందనిఅతనినమ్మకం. వివాహవిపణిలోశోభనలాల్‌విలువను సరిగాలెక్కగట్టాడు. ఇంకా కొంతకాలం ఆపితే విలువ ఇంకా హెచ్చుతుందని అంచనా వేశాడు. అంతవిలువయిన వ్యక్తిని ఉచితంగా స్వాధీనపర్చుకోవాలనే అవనీశ ఎత్తులు దొంగతనంతో సమానమని అతని భావన. ధనాపహరణకు దీనికీ భేదమేమిటి?

రహస్య పూజాపీఠంమీద ఎవరికంటాబడకుండా తన ప్రతిమకు పూజ జరుగుతోందని అప్పటివరకు లావణ్యకు తెలియదు. అవనీశ గ్రంథాలయంలో ఒకమూలకరపత్రాలు, పత్రికలగుట్టఅడుగున లావణ్య మలినచిత్రం హఠాత్తుగాదొరికింది. ఒక చిత్రకార మిత్రునిచేత దానికి కాపీతీయించి, అసలు చిత్రమును యథాస్థానంలో ఉంచాడు. గులాబీలు కూడా ఆ మిత్రుని తోటలోనివే. అతని బిడియం రహస్య ప్రేమలాగానే

ఆ గులాబీలు కూడా సహజంగా వికసించినవి. అనుచిత ఔద్ధత్య రహితమయినవి. అయినా శిక్ష అనుభవించక తప్పు తుందా! తెలవంచుకుని, సిగ్గుతో కన్నీటిని ఎవరూ చూడ కుండా తుడుచుకుంటూ ఆ ఇంటిని విడిచి వెళ్ళిపోయాడు.

మానవహృదయాలలోని రహస్యాలనెరిగిన భగవాను సికి తక్క ఇంకెవరికీ తెలియని తన ప్రేమను అర్పించినట్లు దూరాన్నుంచే శోభనలాల్ రుజువుపర్చాడు. బి ఎ. పరీక్ష లలో అతనికి ప్రథమస్థానం లావణ్యకు తృతీయస్థానం లభిం చింది ఈ ఘటన రెండుకారణాలవల్ల లావణ్యకు బాధా కరంగా అవమానకరంగా పరిణమించింది. శోభనలాల్ ప్రతి భను ఆమెతండ్రి అతిగా మెచ్చుకోవడం ఆమె అహంకారానికి దెబ్బగొట్టింది. ఈ మెచ్చుకోలు ప్రేమతో కలసిందనే పరి జ్ఞానం ఆమె బాధను ఇనుమడింప జేసింది. పరీక్షలో శోభన లాల్‌ని మించిపోవాలని ఆమె శాయశక్తులాకృషిచేసిందిగాని అతను తనను మించి పోయాడని తెలిసిన తరవాత అతనిని క్షమించడం కష్టమని గ్రహించింది చదువు చెప్పవలసిందని శోభనలాల్ ఆమె తండ్రిని ఎన్నడూ కోరకపోయినా పరీక్షా ఫలితాలలోని వ్యత్యాసాలనుబట్టి తన తండ్రి అతనికి ప్రత్యేక శిక్షణ ఇచ్చిఉంటాడనే అనుమానం ఆమె మనసులో రగి లింది ఆ తరవాత చాలా రోజులవరకు శోభనలాల్ కంట బడితే మొహం తిప్పివేసుకుని దూరంగా వెళ్ళిపోయేది. ఎం. ఎ. పరీక్షలో లావణ్య శోభనలాల్‌ను మించిపోయే అవకాశం కనిపించలేదు. అయినా మించిపోయింది. అవనీశస్సైతం ఆశ్చర్యపోయాడు. శోభన్‌లాల్‌కు కవిత్వం అల్లడం చేత

నయితే ఒక పద్యకావ్యం రచించేవాడే. కాని ఇప్పుడు పద్య కావ్యంబదులు పరీక్షమార్కుల మీాద తన హక్కును పరిత్య జించి తెచ్చిసమర్పించాడు.

వారి కాలేజీ విద్యాభ్యాసం పూర్తిఅయింది. తరవాత కొద్దికాలానికి మనసును విజ్ఞానంతో ఎంతనింపినా మన్మథుడు ప్రవేశించడానికి కావలసిన సందు ఉంటుందనే విషయం అవ నీశ అతిబాధాకరమయిన స్వానుభవంవల్ల గ్రహించగలిగాడు అప్పటికి అతనికి నలభయి ఏడుఏళ్ళు. ఆ అత్యంత నిస్సహాయ దుర్బల వయసులో అతని పాండిత్య ప్రాకారం ఎక్కి అతని గ్రంథాలయంలోపి ఘనగ్రంథవ్యూహమును ఛేదించుకుని వచ్చి ఒక పూర్వసువాసిని అతని హృదయంలో ప్రవేశిం చింది. లావణ్యమీాది మమతతక్క ఆమెను వివాహ మాడ డానికి మరే అడ్డంకీలేదు. లావణ్యమీాది మమత ఈ నూతన కాంక్షల మధ్య భీషణ సంఘర్షణ ప్రారంభమయింది అవనీశ చదవాలని బహుపట్టుదలగా కూర్చున్నాడు. కాని ప్రేమ చింతన ఇంకా ఎక్కువ పట్టుదలతో అతని మనసును ముట్ట డించింది. మోడరన్‌రివ్యూ పత్రిక కార్యాలయంనుంచి సమీాక్షార్థం గ్రంథాలు, అతనెక్కువగా అభిమానించే బౌద్ధ పురాశిల్పవాస్తుశాస్త్ర గ్రంథాలు వచ్చాయి. కాని అతను వాటిని తెరవనే లేదు. శతాబ్దాల మౌనభారంతో చలనం లేని బౌద్ధస్తూపాలలాగా అతను వాటిముందు కూర్చున్నాడు. సంపాదకుడు సహనంకోల్పోవచ్చు. కాని ఒకసారి ఊగిసలాడిన విద్వాంస విజ్ఞానస్తూపం గతి అంతే! దొంగ ఇసకమీాద ఏనుగు అడుగువేస్తే దానిని రక్షించే ఉపాయమేముంది?

అవనీశను పశ్చాత్తాప భావం వెంటాడ జొచ్చింది. పుస్తకాల మత్తుమందులో పడిపోయి తన కుమార్తె శోభనలాల్‌ను ప్రేమిస్తున్నదనే విషయం గమనించలేకపోయానని భావించాడు. శోభనలాల్‌వంటి యువకుని ప్రేమించకపోవడం అస్వాభావికం. స్థూలంగా తండ్రిజాతిమీద, తనమీద ముఖ్యంగా నానీగోపాల్ మీద అతనికి కోపంవచ్చింది.

ఈ కాలంలోనే శోభనలాల్ దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులో అతను ప్రేమచంద్రు రాయచంద్రు ఉపకారవేతనంకోసం తయారుచేస్తున్న గుప్తవంశంమీది గ్రంథ రచనకు కావలసిన గ్రంథాలిచ్చి సహాయం చేయవలసిందని అవనీశను కోరాడు వెనువెంటనే అవనీశ విశేష ఆదరంతో జవాబురాస్తూ పూర్వంలాగానేవచ్చి గ్రంథాలయమును స్వేచ్ఛగా ఉపయోగించుకోవలసిందని ఆహ్వానించాడు.

శోభనలాల్ హృదయం దడదడాకొట్టుకోసాగింది ఈ ఉత్సాహలేఖవెనక లావణ్య మాన అంగీకారం ఉండి ఉంటుందని భావించాడు. తరుచు అవనీశ గ్రంథాలయానికి వచ్చి పోతున్నాడు. హాలులోకి వచ్చిపోయేటప్పుడు యాదృచ్ఛికంగా లావణ్య ఒకక్షణం కంటబడితేచాలు తనతో మాటాడుతుందని, తన యోగక్షేమాలు విచారిస్తుందని, తన గ్రంథరచన విషయంలో ఆసక్తి చూపుతుందని ఆశిస్తూ ఉద్దేశపూర్వకంగానే నడకవేగం తగ్గించాలని ఆమె అడిగితేచాలు ఆ గ్రంథ విషయంలో ఆమెతో చర్చించాలని తానురాసుకున్న నోట్సు ఆమెకు చూపాలని ఎంతో ముచ్చటపడ్డాడు. ఆ గ్రంథంలోని విషయంమీద ఆమె అభిప్రాయం తెలుసుకోవాలని ఆతుర

పడ్డాడు. కాని ఇంతవరకు ఒకమాటుకూడా వారు మాటాడుకో లేదు. ప్రోత్సాహం లేకుండా తనంతట తానుగా సాహసించి మాట్లాడేధైర్యం అతనికి లేకపోయింది.

కొన్ని రోజులు ఇలాగడిచినాయి. ఒకఆదివారంనాడు శోభనలాల్ మేజాబల్లమీది కాగితాలుఅమర్చి ఒక పుస్తకం తిరగవేస్తు మధ్య మధ్య నోట్సు తీసుకుంటున్నాడు మధ్యాహ్నం గదిలో ఇంకెవరూ లేరు. శెలవుదినం కావడంవల్ల ఆ అవకాశం తీసుకుని అవనీశ బంధుమిత్రులను చూడడానికి వెళ్ళాడు. ఎక్కడికి వెళుతున్నదీ చెప్పలేదు. టీకి రానని మాత్రం చెప్పి వెళ్ళాడు.

హఠాత్తుగా తలుపు తెరుచుకుంది. శోభనలాల్ హృదయం దడదడా కొట్టుకోసాగింది. లావణ్య ఆ గదిలో ప్రవేశించింది. శోభనలాల్ కంగారుపడి ఆసనంమీదనుంచి లేచి నిలబడ్డాడు ఏమిచేయాలో అతనికి తోచలేదు. లావణ్య నిప్పులా మండిపడుతూ బుసకొడుతూ, "ఈ యింటికి ఎందుకు వచ్చావు?" అని ప్రశ్నించింది.

హఠాత్తుగా శోభనలాల్ అదిరిపోయాడు. నోటివెంట మాట పెగలలేదు.

"నువు యిక్కడికి వస్తున్న విషయంలో మీ నాన్న యేమన్నదీ తెలియదూ? నన్ను అవమానించడానికి సిగ్గు వేయడం లేదూ?"

కిందికిచూస్తూ శోభనలాల్, "దయయుంచి క్షమించు. యిపుడే వెళ్ళిపోతాను," అని ఎలాగో అనగలిగాడు.

ఆమె తండ్రే తనను అక్కడకు రప్పించి అవమానించా డని ఆమెకు తెలియజెప్పలేకపోయాడు. కాగితాలు పోగు చేసుకున్నాడు. చేతులు తీవ్రంగా వణికిపోయాయి. ఒకానొక మూగ బాధ అతని మనోద్వారాలను తట్టి బయటకు రావా లని యత్నించింది. నిలువునా కుంగిపోయి శోభనలాల్ ఆ ఇంటినుంచి నిష్క్రమించాడు. ప్రేమమార్గానికి అడ్డంకివచ్చి ప్రేమించదగిన వారిని ప్రేమించకుండా నిరోధం ఏర్పడితే, అటువంటి వ్యక్తి ఉదాసీనానికి కాకుండా ప్రేమకు విరుద్ధ మయిన గుడ్డి ద్వేషానికి గురిఅవుతాడు. బహుశా తనకు తెలియకుండానే లావణ్య ఒకప్పుడు తన ప్రేమకానుకను శోభనలాల్ కి సమర్పించడానికి సిద్ధమయింది. కాని శోభన లాల్ సరయిన సమయంలో ఈ ప్రస్తావన తీసుకు రాలేక పోయాడు. నాటినుంచి సర్వమూ అతనికి వ్యతిరేకంగా జరుగు తోంది. ఈ అంతిమ సంఘటన అన్నిటికంటె నిర్దయాత్మక మయిన విచ్ఛేదన విపరీతమయిన బాధలో లావణ్య తండ్రిని అపార్థం చేసుకుంది. తన నెలానయినా వదలించుకుని స్వేచ్ఛ సంపాదించుకోవాలనే ఉద్దేశంతో బుద్ధిపూర్వకంగానే శోభన లాల్ తనపై ప్రేమ వెల్లడించడానికి ఆహ్వానించాడని భావిం చింది. అందుచేతనే ఆ అమాయక యువకునిమీద కోపం ఇనుమడించింది.

ఆ తరవాత లావణ్య మొండిపట్టుబట్టి తండ్రికి వివా హం చేయించింది. అవనీశ తన నిలవధనంలో సగం లావణ్యకు ప్రత్యేకించాడు. కాని అతని వివాహమయిన తరవాత తండ్రి ధనం చిల్లిగవ్వయినా ముట్టనని, తన సంపాదనమీదనే జీవి

స్తాననీ తెలియజేసింది. అవనీశకు చాలా బాధ కలిగింది. "నాకీ వివాహం వద్దు అంటూంటే నువే పట్టుబట్టి చేశావు. లావణ్యా! యిపుడు సన్నీవిధంగా బహిష్కరించడ మెందుకు?" అని తన అసమ్మతిని అవనీశ వెల్లడించాడు.

"మన బాంధవ్యం చెడిపోకుండా వుండేందుకే నేనిలా చేస్తున్నాను. నాన్నా! నువు మరేం చింతించకు నా తోవన నన్ను హాయిగా బతకనీ ఆశీర్వదించు!" అని జవాబు చెప్పింది లావణ్య..

ఉద్యోగం సంపాదించి సురమ చదువు బాధ్యతనుస్వీకరించింది. యతి చదువు బాధ్యతనుకూడా తేలికగా వహిం చేదేగాని స్త్రీ దగ్గిర చదువుకోవడం నామర్దా అనే భావంతో అతనే చదువుకోవడానికి నిరాకరించాడు.

నిత్యక్రమ పద్ధతిలో జీవితం సవ్యంగానే జరిగిపోతోంది. తీరుబడి వేళలందు ఆమె ఆంగ్ల సాహిత్యం ప్రాచీన కాలం నుంచి బెర్నాడ్‌షా కాలంవరకు, ముఖ్యంగా గ్రోటే, గిబ్బన్, గిల్బర్ట్, ముర్రేల రచనల సహాయంతో గ్రీకు రోమన్ చరిత్ర చదువుతూ కాలంగడుపుతోంది. ఆమె ప్రశాంతహృదయంలో అశాంతి ప్రవేశించి కలతపెట్టకపోలేదు. కాని అంతకంటె గట్టి అనర్థకం ప్రవేశించడానికి ఆమె జీవితంలో స్థానంలేదు. ఇపుడు రోడ్డు మధ్యన కారులో ఏమాత్రం హెచ్చరిక చేయకుండా అనర్థకం ఆమెను చుట్టుముట్టింది. హఠాత్తుగా గ్రీకు రోమన్ చరిత్ర దాని బృహత్తర విలువను గోల్పోయింది. తక్షణ వర్తమానకాలంలోని ఒక తీవ్రక్షణం తక్కినవాటి నన్నింటినీ తోసిపుచ్చి ఆమెను తట్టి, "మేలుకో," అని మేల్కొ

ల్పింది. ఒక్క క్షణంలో లావణ్యమేల్కొన్నది. చివరకు ఎలా గయితేనేం లావణ్య తనను తాను తెలుసుకుంది. ఈ తెలుసుకోవడం విజ్ఞానంవల్లగాక బాధవల్ల జరిగింది.

# పరిచయం

భూతకాల జీర్ణావశేషాలనుంచి వర్తమానానికి మరలుదాం.

లావణ్య అమితను చదువులగదిలో కూర్చోవలసిందని చెప్పి అతనిరాకనుయోగమాయకు తెలియజేయడానికివెళ్ళింది. అమిత ఆ గదిలో తామరపువ్వులో తేనెటీగ కూర్చున్నట్లు కూర్చున్నాడు. ఏ వేపు తిరిగినా మధుర ఆనందంతో హృదయాన్ని నింపే ఒక సూక్ష్మ స్పర్శాసుఖం అనుభవించసాగాడు. అలమారాలో మేజాబల్లమీద సాహిత్యాభిరుచిని వెల్లడించే ఇంగ్లీషు గ్రంథాలు అతని కంటబడినాయి. ఆ గ్రంథాలన్నీ జీవంతో తొణికిసలాడుతున్నట్లు అతనికి అనిపించింది. అవి లావణ్య గ్రంథాలు. లావణ్య చదివిన గ్రంథాలు. ఆమెకళ్ళు ఆ గ్రంథాల పుటలను తిప్పినాయి. ఆమె ఆలోచనలురాత్రింబవళ్ళు వాటిమీదవిహరించాయి. ఆమె నేత్రాలు ఆతురతతో ఆ పుటలలోని పంక్తులను చాలా తిలకించాయి. అన్య మనస్కయయిన సమయాలలో అవి ఆమె ఒడిలో విశ్రమించేవి. మేజాబల్లమీది డాన్ కవితాసంపుటి కంటబడేసరికి తేరిపార జూశాడు. ఆక్స్‌ఫర్డులో చదివేరోజులలో డాన్, అతని సమకాలికుల రచనలను సవిమర్శకంగా పరిశీలించాడు. ఇప్పుడు

అదృష్టవశాత్తు ఆ కవిత్వమే వారి అనురాగానికి కూడలి అయింది

చాలా కాలంపాటు రాత్రింబవళ్ళు నిరుత్సాహం మూలంగా అమిత జీవితం అట్టలు చినిగిపోయేవరకు సంవత్సరం సంవత్సరం బడిపంతులు ఉపయోగించే పాఠ్యగ్రంథం లాగా, మందకొడిగా, రంజనా రహితంగా జరిగిపోతోంది. రేపేమి జరుగుతుందోననే కుతూహలం కలిగేదికాదు. ఏ రోజునా నిండుమనసుతో స్వాగత మివ్వడానికి కారణం కనిపించేదికాదు. కాని ఇప్పుడు ఒక్క క్షణంలో ఇంకోనూత్న గ్రహం మీదికి ఎగిరిపడినట్లు తోచింది. అక్కడ వస్తువులకు బలువు తక్కువ. పాదాలు భూమిమీద తేలియాడుతున్నట్టనిపించింది. ప్రతిక్షణం అంచింతనీయతను చేరుకోవడానికి ఆతురతతో ఆకర్షిస్తోంది. శరీరం వాయులాలనకు లోనయి వేణువుగా మారాలని కాంక్షిస్తోంది. సూర్యకాంతి అతని రక్తంలో ప్రవేశించి వృక్షరసంలాగానే పారవశ్య పుష్పాలతో నింపింది. అంతకాలం వరకు అతని మనసును కప్పిన అమలిన అచ్ఛాదన తొలగిపోయింది. సాధారణ వస్తువులలో అసాధారణత గోచరించింది. అందువల్ల యోగమాయ మెల్లగా ఆ గదిలో ప్రవేశించగానే ఈ సాధారణ సంఘటన అమితకు ఆశ్చర్యం గొలిపింది. "యిది ఆగమనంకాదు. ఆవిష్కరణ!" అని అమిత తనలో తాను వితర్కించుకున్నాడు.

ఆమె వయసు నలభయి. వయసు ఆమెను క్షీణింపజేయలేదు. పైగా వయసు ఆమెకు ఒకానొక గంభీర పరిశుద్ధతను ప్రసాదించింది. ఆమె శరీరవర్ణం చక్కన, ఉజ్వలం.

హిందూ విధవల ఆచారం ప్రకారం ముండనం చేయించిన శిరం ప్రశాంత మాతృభావంతో నిండిన పరిపూర్ణ ప్రసన్న నేత్రాలు. మృదుప్రశాంత మందహాసం. తలమీదుగా శరీర మంతటినీ కప్పిన తెల్లని ముతకచీర ఆమె ధరించింది. ఆమె సుందర నిర్మల పాదాలు బోసిగా ఉన్నాయి. గౌరవ పురస్సరంగా అమిత ఆమె పాదాలను తాకి నమస్కరించి నపుడు అతని రక్తనాళాలలో దేవీ ఆశీర్వచన ధార ప్రవహిస్తున్నట్టు అనిపించింది.

పరిచయాల అనంతరం యోగమాయ, "మీ బాబాయి అమరేశ్ మాజిల్లాలో కంతటికీగొప్పవకీలు. ఒకసారి ఒకపాడు వ్యాజం మూలంగా మేము సర్వనాశనమయే పరిస్థితివచ్చింది. అప్పుడు మీ బాబాయి మమ్మలను కాపాడాను. నన్ను వదినా అని పిలిచేవాడు," అంది.

"నేను ఆయన అన్నకుమారుడనేగాని అయోగ్యుడను. మా బాబాయి మిమ్మల్ని నష్టపడకుండా కాపాడాడు. కాని నేను మిమ్మల్ని నష్టపర్చడానికి వచ్చాను. ఆయనకు మీరు లాభపడ్డ వదినగారివి. యిక నాకు మీరు నష్టపడే పిన్నివి," అన్నాడు అమిత.

"మీ అమ్మవుందా?" అని అడిగింది యోగమాయ.

"ఆఁ వుండేది. పిన్నికూడా వుంటే బాగుంటుంది," అన్నాడు అమిత.

"పిన్ని లేదని విచారం యెందుకు, నాయనా!" అని ప్రశ్నించింది యోగమాయ.

"యోచించండి. యివాళగనక మా అమ్మ కారును ఢీకొట్టి నాశనం చేసినట్లయితే యేవిటీ కోతిచేష్టలని అంతూ పంతూ లేకుండా చివాట్లు పెట్టేది. ఆ కారేగనక పిన్నిదయితే నా చేతకాని తనానికి నవ్వుకొని బాల్యచేష్టగా భావించితోసి పుచ్చేది," అన్నాడు అమిత

దానిమీద యోగమాయ మందహాసంచేసి, "అలా గయితే సరే ఆ కారు పిన్నిదే ననుకో," అంది.

అమిత దిగ్గునలేచి యోగమాయ పాదాలు తాకి నమస్కరించి, "అందుచేతనే పూర్వజన్మ కర్మఫలంలో విశ్వాసం వుంచవలసివస్తోంది. నాకు భగవంతుడు తల్లిని ప్రసాదించాడు. అందుకనే పిన్నికావాలని తపస్సు చేయలేదు. కరుణ నాశనం చేయడం సత్కర్మ అనలేం. అయినా భగవంతుని వరంలాగ నాకు నా జీవితంలో క్షణంలో పిన్ని సాక్షాత్కరించింది. ఈ అద్భుత సంఘటన వెనక యెన్ని యుగాల సన్నాహంవుందో కొంచెం యోచించు!" అన్నాడు అమిత.

"యెవరిది ఖర్మఫలం? నీదా? నాదా? ఈ మోటారు మరమ్మతుచేసేపనివానిదా?" అనిఅడిగింది యోగమాయ చిరునవ్వు నవ్వుతూ.

ఒత్తుక్రాపులోకి చేతివ్రేళ్ళు పోనిచ్చి, అమిత, "చిక్కు ప్రశ్న! యే ఒక వ్యక్తి కర్మకాదు. యీ విశాల విశ్వమంతా యుగయుగాలనుంచి నక్షత్ర నక్షత్రం కలిసి యీ శుక్రవారం ఉదయం సరిగ్గా తొమ్మిదిగంటల నలభయి యెనిమిది నిమిషాలకు రెండు మోటార్లు కొట్టుకునేటట్టుచేయాలని కుట్రపన్నింది. యిక ఆ తరవాత!" అని జవాబిచ్చాడు.

యోగమాయ లావణ్యవంక ఓరచూపు చూసి మంద హాసం చేసింది అమిత సంగతి ఎక్కువగా తెలుసుకోకుండానే వారిద్దరికీ వివాహం చేయాలని నిశ్చయించుకుంది. ఆ ఉద్దేశం తోనే, "మీ రిద్దరూ యిక్కడ కూర్చుని మాట్లాడుకుం టూండండి. నేను వెళ్ళి భోజన యేర్పాట్లు చేసివస్తాను," అంది.

అమితకు జోరుగా మాట్లాడే శక్తి ఉంది. వెనువెంటనే "పిన్ని మనిద్దరినీ మాట్లాడుకుంటూండమని ఆజ్ఞాపించింది. పరి చయం పేరుతో ప్రారంభ మవుతుందికదా! అందుచేత పేరును ముందుగా నిర్ణయించుకుందాం. నీకు నాపేరు తెలుసు ననుకుంటా. ఆంగ్ల భాషలో దీనినే 'ప్రాపర్ నౌన్' అంటారు," అన్నాడు

"నీ పేరు అమితబాబు అనిమాత్రం తెలుసు," అంది లావణ్య.

"కాని అన్ని స్థానాలలోనూ కాదు," అన్నాడు అమిత.

లావణ్య మందహాసం చేసి, "స్థానాలు అనేకం వుండ వచ్చు. కాని అధికారినామం ఒకటే వుండాలి," అంది.

"నువ్వు చెప్పింది యీ కాలానికి పనికిరాదు. దేశకాల పాత్రలు మారుతూంటాయి. పేరు మాత్రం మారదను కోవడం అశాస్త్రీయం. నాకు తారతమ్య సిద్ధాంతమును ప్రచారంచేసి పేరు సంపాదించాలని నిశ్చయించుకున్నాను. అయితే ప్రారంభంలో నీ పెదవులవెంట 'అమితబాబు' అనే పలుకు రారాదని నా కోరిక."

"అయితే ఇంగ్లీషు పద్ధతిని మిష్టర్ రాయ్ అనాలా?"

"అది దూర సముద్రాంతరాలనుంచి వచ్చిన పేరు. పేరు పొడుగును కొలువాలంటే అది చెవినుంచి హృదయానికి ప్రయాణం చేయడానికి యెంతకాలం పడుతుందో తెలుసుకోవాలి."

"అలా అయితే అంత వేగంగా పరుగెత్తే దాని పేరు చెప్పు వింటాను."

"వేగం హెచ్చించాలంటే బరువు తగ్గించాలి. అమిత బాబు నుంచి 'బాబు' అనేమాట కొట్టిపారేయి."

"అదేమంత తేలికగాదు, కొంతకాలం పట్టుతుంది"

"అన్నింటికీ సమంగా కాలం పట్టకూడదు యీ విశ్వంలో ఒకేవేళ చూపే గడియారం అంటూ ఒకటీలేదు. జేబుగడియారం జేబుజేబును భేదిస్తూనే వుంటుంది. యిది ఐన్‌స్టీన్ సిద్ధాంతం."

లావణ్యలేచి, "నీళ్లు చల్లారిపోతున్నాయి. వెళ్ళిస్నానం చేయండి," అంది.

"నువ్వు యింకా కాసేపు యిక్కడ వుండి నాతో మాట్లాడుతూంటే నీళ్లు చల్లారిపోయినా పరవాలేదు. చన్నీళ్ళ స్నానం చేస్తాను."

"క్షమించండి. వ్యవధిలేదు. తొందరపని వుంది," అని చెప్పి లావణ్య వెళ్ళిపోయింది.

అమిత వెనువెంటనే స్నానానికి లేవలేదు. ఆమె తీయని పెదవులమధ్య మందహాసంలో మాటలు యెలా రూపొందినదీ జ్ఞాపకం చేసుకుంటూ ఆలోచనలో మునిగిపో

యాను. అమిత అనేకమంది సౌందర్యవతులను చూశాడు. వారి సౌందర్యం పున్నమిరాత్రిలాగా ప్రకాశవంత మయిందేగాని అస్పష్టం. కాని లావణ్యా సౌందర్యం ప్రాతఃకాలంలాంటిది. అస్పష్టత భ్రాంతి లేనిది. ప్రతిభతో ప్రకాశిస్తోంది. ఆమెను సృజించేటప్పుడు విధాత కొంత పురుషత్వం కలిపినట్టున్నాడు. ఆమెను చూచితే ఆమెకు సంవేదనా శక్తియేగాక చింతనా శక్తి కూడా కలదని తెలుస్తుంది. ఇంతకీ అమితను అంతగా ఆకర్షించినదేమిటి? అమితకు ప్రతిభ ఉంది, కాని ఓర్పు లేదు. ఆలోచన ఉందికాని ధైర్యం లేదు. అతను చాలా చదువు కున్నవాడు బాగా తెలిసినవాడు. కాని శాంతం అలవర్చుకో లేక పోయాడు. ఉద్రిక్త సంతృప్తివల్ల గాక ప్రశాంత నిశ్చల గంభీర హృదయంలో నుంచి జనించిన నిర్మల రూపం ఆమె ముఖంలో అతనికి గోచరించింది.

## అన్యోన్యత

నలుగురితో కలిసి మెలిసి తిరగడం అమిత స్వభావం. ప్రకృతి సౌందర్యంతో ఎక్కువసేపు ఆడుకోలేడు. మాట్లా డడం అతనికి అవసరం. అందుకు అలవాటు పడిపోయాడు. చెట్లతో పర్వతాలతో ఎవరూ పరియాచకాలాడ లేరు. వాటితో కొంటెగా వ్యవహరించడం భౌతిక వినాశనాన్ని ఆహ్వానించడమే. అవి నియమబద్ధంగా జీవిస్తాయి. ఇతరులు నియమబద్ధంగా జీవించాలనిఆశిస్తాయి. ఒక్కమాటలో చెప్పా లంటే వాటికి హాస్యం తెలియదు. అందుచేత నగరం వెలు

పల విహరించినప్పుడల్లా తోచేదికాదు. కాని ఇప్పుడు ఒక విచిత్రం జరిగింది. పిల్లాంగు కొండలు అతనిని పరమానందంతో నింపివేసినాయి. స్వభావ విరుద్ధంగా అతను సూర్యోదయానికి పూర్వమే మేల్కొని కిటికీగుండా చూశాడు. కొండల అవతల సూర్యుడు తన కుంచెతో, దేవదారు చెట్ల అంచుల వెనక పలచని మబ్బుపొరలమీద పొడుగుగా బంగారు రంగు రంగు రేఖలు గీస్తున్నాడు. సూర్యకాంతి స్పర్శతో కేరింతలాడే రంగులను మౌనంగా తేరిపారజూడడం తప్ప మరేం చేయలేకపోయాడు.

కప్పు టీ ఒక్క గుక్కలో తాగివేసి బయలుదేరాడు. రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. నాచుపట్టిన ఒక పురాతన దేవదారు వృక్షంకింద వాసనగొట్టే పత్రశయ్యమీద కాళ్ళు చాచుకుని పండుకుని సిగరెట్టు వెలిగించాడు. పరధ్యానంలో దానిని రెండు వేళ్ళ సందునా పెట్టుకున్నాడేగాని పీల్చలేదు. ఆ అడవి యోగమాయ ఇంటిదోవలో ఉంది. భోజనానికి కూర్చునే ముందు వంటగదిలోనుంచి వచ్చే సౌరభమును అనుభవించినట్టే ఆ స్థలంనుంచే యోగమాయ గృహసౌరభమును అనుభవించసాగాడు. వెళ్ళి కప్పు టీ అడిగే గంట ఎప్పుడవుతుందా అని నిరీక్షించసాగాడు. మొట్టమొదటలో సాయంకాలం మాత్రమే యోగమాయ ఇంటికి వెళుతూండేవాడు: అమితంగల సాహిత్యాభిరుచి మూలంగా ఎప్పుడు పడితే అప్పుడు రమ్మని యోగమాయ ఆహ్వానించింది. మొదటి రెండు మూడు తడవులూ యోగమాయ కూడా సాహిత్య చర్చలలో కొంత ఉత్సాహం ప్రదర్శించింది. కాని అందువల్ల

వారి ఉత్సాహానికి భంగం కలిగిస్తున్నానని గ్రహించింది. ముగ్గురు మూక ఇద్దరు జత అని అర్థం చేసుకోవడం కష్టం కాదు ఆనాటి నుంచి ఆమె గైరు హాజరయే కారణాలు హెచ్చినాయి. అవి అనివార్యమయినవి కావు యాదృచ్ఛిక మయినవి కావు ఇచ్ఛాపూర్వకమయినవి అమిత లావణ్యల సాహిత్యానురాగం వెనక ఇంకా ప్రగాఢమయిన అనురాగం ఉందని యోగమాయ పసికట్టింది. యోగమాయకు వయసు మళ్ళినా ఆమె దృష్టి తీక్షణమని మనసు కోమలమని అమిత కూడా గ్రహించాడు అందువల్ల లావణ్యతో ఒంటరిగా బాతాఖానీ కొట్టాలనే ఉత్సాహం అమితకు ఇనుమడించింది. నిర్దిష్ట కాలం పొడిగించడానికి యతిశంకర్ ఉదయం ఒక గంట సాయంకాలం రెండు గంటలు ఆంగ్ల సాహిత్యం బోధించడానికి పూనుకున్నాడు. ఈ కర్తవ్య నిర్వహణలో అమిత పట్టుదల మూలంగా అనివార్యంగా ఉదయం మొదలుపెడితే మధ్యాహ్నం అయేది. బోధన బాతాఖానీగా పరిణమించేది. మర్యాదకోసం భోజనానికి యోగమాయ ఆహ్వానం అంగీకరించవలసి వచ్చేది ఈ విధంగా సంఘ విహిత కర్తవ్యపరిధి గంటగంటకు విస్తరించుకో జొచ్చింది.

యతిశంకర్‌కు చదువుచెప్పడం ఉదయం ఎనిమిదిగంటలకు. అమితకు ఆ సమయం అసమయం. మాతృగర్భంలో పది నెలలు నివసించిన జీవి నిద్రవిషయంలో పశుపక్ష్యాదులను అనుసరించడం తగదని అమిత చెపుతూండేవాడు. ఇప్పటివరకు అమిత నిశాసమయాలు ఉదయ సమయాలను అక్రమించుకొనేవి. అలాఅక్రమించుకున్న సమయంనిషిద్ధంకాబట్టి నిద్రకు

ఎక్కువ ప్రీతిదాయక మయినదని అంటూండేవాడు. కాని ఈ రోజుల్లో పెందలకడే నిద్ర లేవాలనే ఆ పరతువల్ల కలత లేని నిద్రపట్టేదికాదు. లేవవలసిన వేళకు ముందే లేచేవాడు. ఆలస్యమవుతుందనే భయంకొద్దీ పక్కమీదఊరికినే పండుకునే వాడుకాదు అప్పుడప్పుడు గడియారం ముల్లును ముందుకుజరిపే వాడు. కాని పట్టుబడతామనే భీతివల్ల మాటిమాటికీ వేళను దొంగిలించడం సాధ్యపడేది కాదు. ఈ రోజున గడియారం వంక చూచాడు ఇంకా ఏడుగంటలు కాలేదు. గడియారం ఆగిపోయిందా? చెవి దగ్గర పెట్టుకున్నాడు. టిక్కుటిక్కు మన్నది.

ఇంతలో కుడిచేతిలో గొడుగు ఆడించుకుంటూ లావణ్య రోడ్డు దిగువకు వస్తూండడం చూసి అదిరిపోయాడు. ఆమె తెల్లని చీర కట్టింది. త్రిభుజాకారంగా మడచిన నల్లని జాలరు అంచు శాలువా ఆమె భుజాలమీద వేసుకుంది. తనను లావణ్య అర్ధదృష్టితో చూసిందని అమిత గ్రహించాడు. కాని పూర్ణదృష్టితో గుర్తుపట్టిందనే యధార్ధవిషయం అంగీకరించలేదు. ఆమె మలుపును చేరుకునేసరికి ఇక ఉండబట్టలేక ఆమె వద్దకు పరుగెత్తాడు.

"నన్ను తప్పించుకుపోలేవని నీకు బాగా తెలుసు. అయినా నన్ను పరుగెత్తించావు. దూరం నడవడం అసౌఖ్యమని నీకు తెలియదూ!" అన్నాడు అమిత.

"యెలా?"

"వెనకబడ్డ దురదృష్టవంతుడు గొంతెత్తి పెద్దగా కేక పెడుతూ పిలవవలసి వుంటుంది. యేమని కేకపెట్టడం? యెలా

పిలవాలి? దేవతల విషయంలో మంచిపద్ధతివుంది. వారినామం జపించి ప్రసన్నం చేసుకోవచ్చు. దుర్గా దుర్గా అంటూ పెద్దగా అరిచినా దశభుజాలదుర్గ సంతృప్తి చెందదు. మీ వంటి వారి విషయంలో కష్టం యెక్కువ.”

“అలా అయితే పిలవడమే మానివేయవచ్చు.”

“నువ్వు దగ్గరగావుంటేనే సాధ్యపడుతుంది అందువల్ల నా నుంచి దూరం వెళ్ళవద్దు అంటున్నా. పిలవాలనే కాంక్ష వుండీ పిలవలేక పోవడంకంటె విషాదం యేముంది?”

“యెందుకని? మీరు యింగ్లీషువారి పద్ధతికి అలవాటు పడ్డారనుకుంటాను!”

“మిస్ దత్త్! టీ తాగేటప్పుడు అలాపిలవడం తగి పోతుంది. కాని చూడు. నేటి వుదయ ప్రథమ కాంతిలో భూమ్యాకాశాలు కలుసుకున్నాయి. ఆ సంయోగోత్సవం శోభాయమానంగా జరిగి స్వర్గ మర్త్యలోకాలు ఏకసృష్టిగా రూపొందాయి. పృథ్వినుంచి స్వర్గానికి, స్వర్గంనుంచి పృథ్వికి పిలుపు ప్రతిధ్వనించడం వినబడడం లేదా? అటువంటి నామ కరణ సుముహూర్తం మానవజీవితంలోమాత్రం రాదా? యీ ముహూర్తంలో మనసారా గొంతెత్తి నిను పిలిచాననుకో. ఈ పిలుపుఅడవినుంచిఅడవికి ప్రతిధ్వనించి ఆకాశంలోని రంగు రంగుల మబ్బును చేరుకుంటుంది. అచ్చటిపర్వతం ఆపిలుపునువిని దీర్ఘంగా యోచిస్తుంది. ఆ నామం మిస్ దత్త్ అని నువ్వు వూహించగలవా?”

"నామకరణం చేయడానికి చాలా కాలం పడుతుంది. యింతలో అలాఅలా తిరిగి వస్తాను," అంది లావణ్య ఆ ప్రస్తావన తప్పించడానికి.

"నడక నేర్చుకోవడానికి మానవుడికి చాలా కాలం పడుతుంది," అంటూ మొదలుపెట్టాడు అమిత ఆమె పక్కనే నడుస్తూ, "నా విషయం వేరు. జీవితంలో ఆలస్యంగా ఇక్కడికి వచ్చిన తరవాతనే నేను కూర్చోవడం నేర్చుకున్నాను. 'తిరిగే చక్రానికి దుమ్ము అంటుకోదు' అని ఇంగ్లీషులో సామెత వుంది. ఆ సామెతను మనసులో పెట్టుకుని యింకా చీకటి వుండగానే నేనీదోవపక్కకువచ్చికూర్చున్నాను. అందువల్ల అరుణోదయ కాంతిని చూడగలిగాను."

"ఆకుపచ్చ యీకల ఆ పక్షి పేరేమిటో తెలుసునా?" అని లావణ్య అడిగింది, సంభాషణను వేరుమార్గం పట్టించడానికి.

"ప్రపంచంలో పక్షులు వుంటాయనే విషయం యిప్పటి వరకు నేను సామాన్య విషయంగానే భావిస్తూ వచ్చాను. దాని విశిష్టతను తెలుసుకునే అవకాశం కలగనే లేదు. నేను యిక్కడకి వచ్చిన తరవాత అద్భుతం జరిగింది. యీ ప్రపంచంలో పక్షులు వుండడమే కాదు, పాడతాయని కూడా గ్రహించాను."

"బలే! ఆశ్చర్యంగా వుందే!" అంది లావణ్యనవ్వుతూ.

"నవ్వుతున్నావా? నేను గంభీరంగా మాట్లాడుతున్నా నా మాటలు గంభీరంగా ధ్వనించవు. అదిపిచ్చి అలవాటువల్ల వచ్చినదోషం. నా జన్మలగ్నాధిపతి చంద్రుడు. మొంతకటిక

చీకటి రాత్రియందయినా అస్తమించే ముందు ఒకక్షణం మందహాసంచేసి తీరతాడు,'' అన్నాడు అమిత.

"నీ మాటలు వింటే పక్షులు కూడా నవ్వుతాయి. నన్ను నిందించకు,'' అంది లావణ్య.

"మొదటలో నా మాటలు అర్ధంగాక జనం నవ్వుతారు. అర్ధమయిన తరవాత వారు ఆగి యోచిస్తారు. నేనీ రోజున పక్షులను కొత్తగా కనుగొన్నానంటే అంతా నవ్వుతారు అయితే అందులోని అంతరార్థం నేను ప్రతిదానినీ, నన్నుసైతం కొత్తగా కనుగొన్నాను. యిటువంటి యదార్ధ విషయానికి యెవరు నవ్వలేరు. అదీ సంగతి! నా మాటలు ఒకటే అయినప్పటికీ నువ్వు మౌనంగానే వున్నావు ''

లావణ్య నవ్వి అన్నది. "నువ్వు మరీ పాతవాడివికావు. మరీ కొత్తవాడివికావు అటువంటపుడు ఇంకా కొత్తేమిటి?''

"ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం ఆషామాషీ యేం కాదు. గంభీరంగా చెప్పాలి. నాలో కనిపించే కొత్తదనం యుగయుగాల నుంచి వస్తున్న పాతే. అరుణోదయకాంతి లాగా, కొత్తగా వికసించిన కలువపూవులాగా పాతదే. కాని కొత్తగా కనుగొన్నట్టు తోస్తూంటుంది. అంతే.''

లావణ్య మందహాసం చేసి వూరుకుంది.

"ఈ నీ మందహాసం కన్నపుదొంగమీాద పడవేసిన పోలీసు లాంతరు కాంతిలాగా వుంది. యీ వాక్యం నువెంతగానో మెచ్చుకునే కవి రచనలోనుంచి నేను దొంగిలించానని యీ పాటికి గుర్తించే వుంటావు. అందుకని దయ యుంచి నాకు గ్రంథచౌర్యం అంటకట్టకు. ఒకొక్కపుడు

మానవుని స్వత్వం శంకరాచార్యులుగామారి, 'నేను వ్రాశాను,' 'అతను వ్రాశాడు' అనే వాటిభేదం మాయ అని స్థిరీకరిస్తుంది. యీ హృదయం ఇక్కడకూర్చుని క్షణంలో 'ఈ నే నెక్కడ రాయడానికి సాధ్యపడేది నాకు పరిచయ మయిన సాహిత్యం నుంచి యేరుదాం' అని నాలో నేను అనుకున్నాను. యింకో కవి దానిని వ్రాయడానికి సాహసించే వాడు కాదు."

"మరి నువ్వు అలా యేరగలిగావా?" అని లావణ్య ప్రశ్నించకుండా ఉండలేకపోయింది.

"ఆఁ యేరగలిగాను."

లావణ్య జిజ్ఞాసను అణుచుకోలేక "ఏదా పద్యపాదం?" అని అడిగింది.

"దేవునియాన మాట్లాడకు. నను ప్రేమించనీ."

లావణ్య హృదయం కంపించిపోయింది. చాలా సేపు తరవాత అమిత, "ఇది యెవరు రచించిందో నీకు తెలుసుగా?" అన్నాడు.

తెలుసునని సూచించడానికి లావణ్య తలకొద్దిగా ఒక పక్కకు వంచింది. అమిత ఆగకుండా, మొన్న నీ మేజాబల్ల మీద డోన్ కవితా సంపుటి కనిపించింది. లేకపోతే యీ పద్యపాదం నాకు స్ఫురించేది కాదు," అన్నాడు.

"నీకు కనిపించిందా?"

"మరేమిటి? దుకాణాలలో పుస్తకాలు కనిపిస్తాయి. కాని నీ బల్లమీద మాత్రమే అవి బహిర్గత మవుతాయి. బహిరంగ గ్రంథాలయాలలో బల్లలమీద పుస్తకాలు

వుంటాయి. కాని బల్లలు వాటికి ఆశ్రయ మిస్తుంటాయి. మొన్న డోనీ పద్యపాదం నా హృదయాన్ని కంపింపజేయు డంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. భాగ్యవంతుని కర్మ కాండల సంతర్పణకు భిక్షుకులను పోగుచేసినట్టు యితర కవులు తమ గృహద్వారాలవద్ద జనాన్ని పోగుచేస్తారు కాని డోనీ కవిత్వం ఏకాంత ప్రదేశంలో జంట ఒకరి పక్కన ఒకరు దగ్గరగా కూర్చోవడానికి మాత్రమే స్థలం వుంటుంది. 'దేవు నాన! మాట్లాడకు నను ప్రేమించనీ" అనే నా హృదయ వ్రదయ స్వాగతాన్ని స్పష్టంగా వినగలడం ఆశ్చర్యమేమీ కాదు."

అమిత ఆ పద్యాన్ని బెంగాలీలోకి అనువదించి వినిపిం చాడు. లావణ్య ఆశ్చర్యపోయింది.

"మీరు బెంగాలీలో కవిత్వంకూడా రాస్తూంటారా?"

"యీ క్షణంనుంచి రాస్తానని భయం వేస్తోంది పాత అమితరాయ్ తెలుసుకోలేని ఏవినాశనం కొత్త అమితరాయ్ తెచ్చిపెడతాడో! అతను నెను వెంటనే యుద్ధానికి సాహసించ వచ్చు"

"యుద్ధం యెవరిమీద?"

"యెవరిమీదో నాకే తెలీదు. యీ తక్షణం నేను కళ్ళుమూసుకొని యే మహత్తర కార్యానికో నా ప్రాణాలు ధారపోయాలనిపిస్తోంది. ఆ తరవాత పశ్చాత్తాప పడవలసి వస్తే చాలా వ్యవధివుంది."

లావణ్య నవ్వి, "ప్రాణాలను ధారపోయదలిస్తే సావ ధానంగా ధారపోయి," అంది.

"యీ హెచ్చరిక అనవసరం. మతకలహాలలో నేను జోక్యం కలుగజేసుకో దలుచుకోలేదు. ముస్లింలను ఆంగ్లేయులను తప్పించుకు తిరుగుతాను. కాని వృద్ధ సనాతన అహింసావాది హారన్ కొడుతూ కారు నడుపుతూ నాకు తారసిల్లితే మాత్రం దారికడ్డంగా నిలబడి 'యుద్ధంచేయి' అని కేక పెడతాను. అజీర్ణ వ్యాధిగ్రస్తులు ఆసుపత్రి కెళ్ళకుండా ఆకలిని సంపాదించుకోవడానికి కొండల దగ్గర గుమిగూడి సిగ్గులేకుండా తిరుగుతూంటారు"

"అతనుగనక మిమ్మల్ని గమనించకుండా ముందుకు సాగిపోతే ఏంజేస్తారు?" అని అడిగింది లావణ్య నవ్వుతూ.

"అప్పుడు రెండు చేతులూ ఆకాశం వేపుచాచి, 'యీ సారికి నిన్ను క్షమిస్తున్నాను. నువ్వు నా సోదరుడవు. మనిద్దరం ఒకే తల్లి భరతమాత బిడ్డలం,' అని అంటాను. హృదయం వికసించి విశాలమయితే మానవుడు యుద్ధమూ చేయగలుగుతాడు క్షమించాగలుగుతాడు. నీకు తెలుసుగా!"

లావణ్య నవ్వింది. "యుద్ధంమాట యెత్తగానే నాకు భయంవేసింది. కానీ నీ క్షమా సిద్ధాంతం ప్రతిపాదించిన తీరు చూస్తే ఆదుర్దా పడనవసరం లేదని తోస్తోంది."

"నా కోరిక ఒకటి మన్నిస్తావా?" అని అమిత అడిగాడు.

"యేమిటది?"

"ఆకలిని సంపాదించుకోవడానికి యిక యివాళటికి నడవ వద్దు"

"సరే యింకా?"

"రంగురంగుల నాచుతో విలసిల్లే ఆ రాతి కిందనుంచి నవ్వుతూ చిన్నగా ప్రవహించే ఆ సెలయేటి దిగువన ఆ చెట్టు కింద కూర్చుందాం, రా!"

లావణ్య చేతిగడియారం చూసి, "వ్యవధి ఏమాత్రం లేదు," అంది.

"లావణ్యాదేవీ! అదే జీవితంలో అతికఠిన విషాద సమస్య. యెడారి ప్రయాణంలో కూజాలో నీరు సగమే వుంటే దోవలో ఆ నీరు ఒలికి ఇసుకపాలు కాకుండా జాగ్రతపడాలి. వ్యవధిఎక్కువగా వున్నవారే కాలనియమాన్ని పాటించగలుగుతారు దేవతల కాలానికి పరిమితి లేదు. అందుకే సూర్యుడు ప్రతిరోజూ ఒకే వేళకు వుదయిస్తాడు, అస్తమిస్తాడు. మన కాలం పరిమితమయింది. కాల నియమం అంటూ కాలాన్ని వృధా చేయడం మనకు మించినది అమరజీవి యెవరయినా నన్ను, 'భూమిమీద నువ్వు సాధించిందేమిటి?' అని ప్రశ్నిస్తే నేను, 'గడియారం ముల్లు మీద దృష్టినిలిపి పని చేశానేగాని కాలాతీతమయిన దానిమీద దృష్టి నిలపడానికి వ్యవధిలేక పోయింది' అని సిగ్గువిడిచి జవాబు చెప్పనా? అందుకే నే నింతగా వాదిస్తున్నాను. నాతో అక్కడికిరా."

తన మాటను ఎవరన్నా కాదంటారేమోననే ఆలోచనే అమితకు లేదు. అందువల్ల ఇతరులు కాదనడం కష్టం. లావణ్య సమ్మతించి, "సరేపదండి," అంది.

దట్టమయిన అడవి ప్రదేశం నుంచి దిగువగా ఖసీ గ్రామానికి దోవ ఉంది. ఒక జలపాతం నుంచి ఒక చిన్న సెలయేరు ప్రజా ప్రయోజనాన్ని విస్మరించి ఆ దోవకు

అడ్డంగా ప్రవహిస్తూ ఆ దారిమీద తన హక్కును స్థాపించు కోవడానికి దోవపొడుగునా గులకరాళ్ళను వదిలింది ఆ స్థలంలో వారిద్దరూ ఒక రాతిమీద కూర్చున్నారు. అక్కడే లోతయినగోయి ఉంది. ఆకుపచ్చని మేలిముసుగు ధరించి బయటకు అడుగు పెట్టడానికిజంకే పరదాస్త్రీలాగా ఆగోతిలో నీరు నిలవవుంది. ఆ ప్రదేశాన్ని ఆవరించిన ఏకాంతతలో మేలిముసుగు తొలగిన దానిలాగా లావణ్య సిగ్గుపడింది. చెంపలు జేవురించాయి. కలవరపాటు బయటపడకుండా దాచు కోవడానికి ఏదోఒకటి మాట్లాడదామనుకుంది మాటలు పెగలలేదు. నిద్రలో గొంతు నులిమి నట్టనిపించే వారిలాగా ఉక్కిరి బిక్కిరయింది

ఇక మౌనాన్ని భగ్నం చేయడం మంచిదని గుర్తించి అమిత, "చూడు, మన భాషలో రెండు శైలు లున్నాయి. ఒకటి గ్రాంధికం. రెండు వ్యవహారికం. వీటికితోడు మూడో రకం కూడా అవసరం సమాజం కోసం వ్యాపారంకోసం కాకుండా ఇలాంటి యేకాంత సాన్నిహిత్యం కోసం పక్షుల పాటలాగా కవుల సంగీతంలో పసిపాపల ఏడ్పులా సునాయాసంగా మన గొంతులలో నుంచి వెలు వడాలి. అటువంటి భావ ప్రకటనకు కావలసిన భాష లోపిం చడంవల్ల పుస్తక విక్రయ శాలలకు పరుగెత్తడం యెంత సిగ్గు చేటు! మనం నవ్వదలచినపుడల్లా దంత వైద్యశాలకు పరు గెత్తవలసివస్తే యేంజరుగుతుందో ఆలోచించు. నిజం చెప్పండి, లావణ్యాదేవి! యిప్పుడు మీకు రాగయుక్తంగా మాట్లాడాలని లేదూ?"

లావణ్య తలవంచుకుని మారుమాటాడ లేదు. అమిత ఆగకుండా "టీ తాగేటప్పుడు సంభాషణలో యుక్తా యుక్తాల విచక్షణ మాటమాటకూ పాటించడం అవసరం. కాని యిక్కడ యుక్తా యుక్తాల ప్రసక్తే లేదు. యిటువంటప్పుడేం చేయాలి? మనశ్శాంతికి పద్యాలు చదవాలి వచనం చాలా సేపు పడుతుంది మనకు అందుకు కావలసిన వ్యవధి లేదు. మీరు సరే అంటే మొదలు పెడతాను," అన్నాడు

సరే అనకేం చేస్తుంది లావణ్య! సిగ్గుతో అతని మాటలు వినబడనట్టు నటిస్తే లజ్జ బయటపడిపోతుంది. ముందుమాటలాగా, అమిత, "రవీంద్రుని కవిత మీకు యిష్టమనుకుంటాను?" అన్నాడు

"అవును."

"నాకిష్టం లేదు. అందుకు నన్ను క్షమించండి. నా కిష్టమయిన కవి ప్రత్యేకత వేరు. అతని రచనలు చాలా గొప్పవి. కొద్దిమంది కూడా చదివి వుండరు. దూషణతో నయినా ఎవరూ అతనిని సత్కరించలేదు. అతని రచనలు కొన్ని చదువుతాను."

"ఎందుకంత భయం?"

"యీ విషయంలో నా అనుభవం బాధాకరమయినది. మన కవిని మనమే దూషిస్తే అతనిని బహిష్కరించినట్టే. మౌనంవహించి విస్మరిస్తే నానాతిట్లు తినవలసివస్తుంది. నా కిష్టమయినది యింకొకరికి యిష్టంకాకపోవచ్చు. అందుకే యీ భూమిమీద యింత రక్తపాతం జరుగుతోంది."

"నేను రక్తపాతం జరుపుతానని భయపడనక్కరలేదు. నా అభిరుచికి మద్దతుకోసం నేను ఇతరుల అభిరుచిని ప్రచారం చేయను," అంది లావణ్య.

"బాగా చెప్పావు. ఇక నిర్భయంగా ప్రారంభిస్తాను. "ఓ అపరిచితుడా! ఎలా తప్పించుకుందువు నా చేతిని పరిచయం కాకమున్నే?

"ఈ విషయం గుర్తుంచుకో! అజ్ఞాతబంధనం! అన్నిటి కంటె పెద్దబంధనం! అజ్ఞాత ప్రపంచంలో నేను ఖైదీని. జ్ఞాతం కాగానే స్వతంత్రం పొందుతాను. దీనినే ముక్తితత్వం అంటారు.

"ఒకానొక అంధక్షణంలో
కలత నిద్రలో
నీ ముఖం గాంచితిని
నీపై దృష్టి నిగిడ్చి ఎక్కడ దాగితిని
ఏ రహస్య ఆత్మ విస్మృతి సీమలో.

"మైమరపులోని అంధకారానికి యేగుహాలోని అంధకారం సాటిరాదు. జీవితంలో లభించని నిధులు ఆత్మ విస్మృతీ లోకంలో కలగా పులగంగా వుంటాయి. అందుకని నిరాశలో వాటిని త్యజించడం సమర్థించుకోరాదు.

"నిను తెలుసుకొనుట
ఏమంత సులభంకాదు
రహస్యంగా చెవిలో తీయనిమాటలు చెప్పినా
అనుమానంతో ఉక్కిరి బిక్కిరి మాటలపై
విజయం సాధిస్తాను

అనుమానంనుంచి, సిగ్గునుంచి
ఆందోళనా సంఘర్షణనుంచి
నిర్దయకాంతిలోకి
గర్వంతో బలంతో
నిను పైకెత్తుతాను

"పరిపూర్ణం నిర్దాక్షిణ్య విజయం! ఎంత మహత్తర శక్తి! యీ రచనలోని పురుషశక్తి గమనించు!

"కిన్నిట స్నానమాడి మేల్కాంతువు నువ్వు
క్షణంలో తెలుసుకొందువు నిను నువ్వు
బంధనం విచ్ఛిన్న మవుతుంది
నీకు స్వాతంత్ర్య మివ్వడంలో నాకూ
స్వాతంత్ర్యం లభిస్తుంది.

"నీ అభిమాన రచయితలో యీ మాదిరి ధోరణి కనిపించదు. సూర్యకుటుంబంలోని అగ్నితుఫాను లాంటిదిది. యిది సామాన్య గీతం మాత్రమే కాదు. కఠిన, నిర్దాక్షిణ్య జీవిత సారం."

లావణ్యమీద దృష్టి నిగిడ్చి, అమిత తిరిగీ మొదలు పెట్టాడు.

"ఓ అపరిచితుడా!
పగలుగడిచింది, సందెపడుతుంది, కాలంఆగదు,
తీవ్రంగా ఆకస్మికంగా ఒకేఒక ఊపుతో
బంధనాలను తెంచివేయుము
నీ అజ్ఞాతాగ్ని శిఖను ప్రజ్వరిల్లనిమ్ము
అందులో నా జీవితమర్పింతు సమిధగా!"

కవితా పఠనం పూర్తి కాకముందే అమిత లావణ్య చేయిపట్టుకున్నాడు. ఆమె చేతిని తీసివేయలేదు. అతని ముఖంలోకి చూసి మౌనం వహించింది. మాటలతో అవసర మేమిటి? లావణ్య గడియారం చూడడం మరిచేపోయింది.

## పెళ్ళి రాయబారం

అమిత యోగమాయ దగ్గరకు వెళ్ళి, "పిన్నీ! నేను పెళ్ళిరాయబారం పనిమీద వచ్చాను. దయయుంచి నా మాట వృధా చేసి పంపవద్దు," అన్నాడు.

"నాకు నచ్చితేసరే. ముందు పేరు, వూరు, రూపు రేఖలో వర్ణించి చెప్పు."

"అభ్యర్థి విలువ పేరునుబట్టి కాదు."

"అలాంటప్పుడు పెళ్ళి రాయబారి తన యీనాములో కొంతభాగం వదులుకోవలసి వస్తుంది."

"అన్యాయం! పేరుగొప్ప వూరు దిబ్బ అని వినలా! బయటగొప్ప పేరుగలవారు జీవితం వైభవంగా గడపడానికి కాలం వెచ్చిస్తారేగాని సుఖపడడానికి కాదు. అటువంటి వారు తమ భార్యలకోసం తమ కాలంలో కొద్దిభాగం వినియోగిస్తారు. యిది వివాహ విధికి తగినంత కాదు. గొప్ప వారి వివాహం పాక్షిక వివాహం. బహుభార్యాత్వంలాగా నింద్యమయింది."

"సరే. పేరు బాగుందనుకుందాం. మరిరూపురేఖలు?"

"అతిశయోక్తులకు దిగుతానేమోనని భయం. అందు కని ఆ విషయం విప్పిచెప్పను."

"అతిశయోక్తి మీ వ్యాపార లక్షణమనుకుంటా."

"పెళ్ళికొడుకుని యెంచుకునేటప్పుడు రెండు విషయాలు ఆలోచించాలి. పేరు యింటి తాహతుకు మించిపోరాదు. రూపురేఖలు పెళ్ళికూతురు రూపురేఖలను మించిపోరాదు.

"సరే. పేరు రూపురేఖలు వదిలివేద్దాం. తక్కిన విషయాల మాటేమిటి?"

"తక్కినవన్నిటినీ కలిపి యోగ్యత అంటారు. అతను యోగ్యత లేనివాడు కాడు."

"మరి తెలివి తేటలు!"

"తనకు తెలివితేటలు గలవని అవతలి వారిని నమ్మించేటంత తెలివి తేటలున్నాయి"

"చదువు?"

"న్యూటన్ చదువులాంటిదే విజ్ఞాన సముద్రతీరంలో గులకరాళ్ళను యేరుతున్నానని మాత్రమే అతనికి తెలుసు. కాని న్యూటన్‌లాగా పదిమందిలో ఈ మాట చెప్పడానికి జంకుతాడు. చెపితే నిజమనుకుంటారని భయం."

"పెళ్ళికుమారుని యోగ్యతల జాబితా బాగానే వున్నట్టుంది."

"అన్నపూర్ణ ప్రపూర్ణతను చాటడానికి శివుడు తాను బికారినని చెప్పుకున్నాడు. పైగా అలా చెప్పుకోవడానికి సిగ్గుపడలేదు."

"అలా అయితే యింకా కొంచెం స్పష్టంగా చెప్పు."

"పేరుపొందిన కుటుంబం. పెళ్ళికుమారుని పేరు అమిత రాయ్. నవ్వుతావెందుకు పిన్నీ? యిదంతా హాస్యానికి చెప్తున్నాననుకుంటున్నావా?"

"అవును నాయనా! చివరకు యిదంతా హాస్యంగా తయారవుతుందేమోనని నా భయం"

"అటువంటి అనుమానం దోషారోపణే!"

"నవ్వుతూ తేలికగా తన లోకమును నిలబెట్టుకోవడం యేమంత తేలిక కాదు"

"పిన్నీ! దేవతలకు మాత్రమే ఆ శక్తి వుంది. అందుకనే వారికి పెళ్ళి యోగ్యత లేదు ఈ విషయం దమయంతికి బాగా తెలుసు."

"మా లావణ్య అంటే నీకు బాగా యిష్టమేనా?"

"యేం పరీక్ష పెడతావో పెట్టుకో."

"ఆమె నీదనే నిశ్చయంలోనే ఆ పరీక్ష వుంది."

"దయయుంచి యింకా పూర్తిగా వివరించు."

"చవకగా వచ్చినా రత్నం విలువను తెలుసుకొనగలిగినవానినే నేను రత్నాల వర్తకుడంటాను."

"పిన్నీ! నీవీ విషయమంతా అతి సున్నితం చేసేశావు. చిన్న కథలోని మన సత్వపుటంచుకు పదును పెట్టుగావుంది. విషయం స్పష్టంగా తెలుస్తోంది. యీ మానవ ప్రపంచంలో మామూలుగా జరిగేటట్టే ఒక పెద్దమనిషి ఒక యువతి వివాహమాడాలని పిచ్చిగా కోరుతున్నాడు. మంచి చెడ్డలను బేరీజువేస్తే కుర్రాడు పరవాలేదు. యిక యువతి విషయం చెప్పనక్కరలేదు. మామూలుగా యిలాంటి సందర్భాలలో

పిన్నిబోటివారికి ఆనందం వేడుకలు కావలసినంత కలుగు తుంది."

"నువేం భయపడనక్కర్లేదు నాయనా! వేడుకలు ప్రారంభమవుతాయి. లావణ్య నీకు లభించిందనుకో ఆమె నీ దయిన తరవాత కూడా నీ వామెను యిప్పటిలాగానే వాంఛిస్తుంటే లావణ్యలాంటి యువతికి నువ్వు తగినవాడవని తలుస్తాను."

"నేను అతిఅధునాతనుడననుకుంటూంటే, నన్నే అదరగొట్టేస్తున్నావే!"

"అయితే నీకు అధునాతన లక్షణాలేమికనిపించాయి?"

"యిరవయో శతాబ్దంలో పిన్నిలాంటివారు కూడా పిల్లకు వివాహం చేయడానికి భయపడుతున్నారు."

"గతశతాబ్దంలో పిన్నిలాంటివారు ఆటవస్తువులకు లాగా పెళ్ళిళ్ళు చేసేవారు. నేటి పెళ్ళికొడుకుకు పిన్నిలాంటి వారి వేడుకకోసం ఆటబొమ్మలను సమకూర్చిపెట్టే ఆసక్తి లేదు."

"మరేం భయపడనక్కర్లేదు. అది యెన్నటికీ సాధ్యం కాదు. తినేదానినిబట్టే ఆకలి పెరుగుతుంది యీ సత్యానికి వుదాహరణ యీ భూమిమీద అమితరాయ్ అవతరించిన యేకైక వుద్దేశం లావణ్యను వివాహ మాడడమె. అలాకాక పోతే జీవంలేని నా మోటారుకారు, ఒక అసమయంలో, ఒక అస్థలంలో అటువంటి అద్భుత సంఘటన జరిగేటట్టు చేస్తుందా?"

"నాయనా! నీ మాటలు పెళ్ళి యీడు వచ్చిన వాని మాటలులాగా కనిపించడంలేదు. చివరకీ వివాహం చిన్న పిల్లల ఆటగా పరిణమిస్తుందేమోనని భయపడుతున్నాను."

"పిన్నీ! నా మనసుకు దాని విశిష్ట గురుత్వం వుంది. అందువల్ల నా హృదయంలోనుంచివచ్చే బరువయినమాటలు నా నాలుకమీాదనే తేలికగా వుంటాయి. అంతమాత్రంచేత వాటి బరువు తగ్గదు."

యోగమాయ భోజన ఏర్పాట్లు చూడడానికివెళ్ళింది. అమిత గదులన్నీ గాలించాడుగాని చూడదలచినది. కనిపించ లేదు. యతిశంకర్ తారసిల్లాడు. ఆ రోజున అతనితో కలిసి ఆంటనీ అండ్ క్లియోపాత్రా నాటకం చదవవలసి ఉందని అపుడు జ్ఞాపకం వచ్చింది. అమిత మొహంకేసి చూసేసరికి అతనిమీాద జాలివహించి ఆ రోజుకు శెలవు పెట్టడం తక్షణ కర్తవ్యమని అతనికి తోచింది. "అమితతాత! మెగువ పిల్లాంగుమీాద తిరగడానికి యివాళ శెలవుయియ్యి" అని అడిగాడు.

అమిత అతిగా సంతోషించి, "పాఠాలకు శెలవు పెట్టడం యెలానో తెలియనివారు వాటిని జీర్ణం చేసుకోలేరు. యింతకీ శెలవు అడగడానికి అంతభయపడతా వెందుకు?"

"రేపు ఆదివారం. యెలాగో శెలవు మీారేమైనా అనుకుంటారేమోనని—"

"అబ్బే! మరేం అనుకోను. నాది బడిపంతులు మనస్తత్వంకాదు. నిర్ణీతమయిన శెలవు శెలవుకాదని నావుద్దేశం.

నిర్ణీత మయిన శెలవును అనుభవించడం కట్టివేసిన జంతువును వేటాడినట్టే ఆనందం వుండదు."

శెలవుదినతత్వం విషయంలో అమిత ఇంత ఉత్సాహం చూపడానికి మూలకారణం యతి ఊహించి సంతోషించాడు. "యిటీవల మీ మేధ శెలవుదిన తత్వంలో నిమగ్నమయి వుంది మొన్న దీనిమీద వుపన్యాసం కూడా యిచ్చారు. యిది యిలాగే జరిగితే కొద్దిరోజులలో నేను శెలవు తీసుకోవ డంలో నిపుణుడనయిపోతాను," అన్నాడు.

"మొన్న నేనేం వుపదేశించాను!"

"చేయకూడనిది చేయాలనే కోరిక మానవుని మహా గుణం. ఆ కోరికకలిగితే అలసించడం వుచితంకాదు, అంటూ పుస్తకం మూసివేసి తొందరగా వెళ్ళిపోయాడు. నేను గమ నించలేదుగాని, ఆ కర్తవ్య అవిర్భావ్య కారణం బయటనక్క వుండివుండవచ్చు."

యతిశంకర్ వయసు ఇరవయి సంవత్సరాలలోపు. అమిత మనసులోని ఆందోళన అతని మనసుకుకూడా సోకింది. లావణ్యాను ఎప్పుడూ పంతులమ్మ అనే దృష్టితోనే చూస్తు న్నాడు ఇప్పుడు అమిత అనుభవ దృష్టితో చూసి ఆమె స్త్రీ అని గుర్తించాడు.

అమిత నవ్వాడు. "బజారులో యెక్కువ వెలపలికే వుద్బోధన కూడా వుంది. పనిచేయవలసి నప్పుడు అందుకు తయారుగా వుండాలి. అది అక్బరు ముద్రగల నవరసు లాంటిది. కాని అవతలి పక్కన 'పనిలేనితనం తలయెత్తితే

దాని సవాలును వీరోచితంగా యెదుర్కోనాలి,' అని చెక్క వలసి వుంటుంది."

"మీ వీరత్వం యీ రోజుల్లో కొంచెం అతిగా కని పిస్తోంది."

యతిశంకర్ వీపుతట్టి అమిత అన్నాడు: "నీ జీవిత పంచాంగంలో దుర్గాష్టమి శుభదినం అరుదెంచినపుడు ఆలస్యం చేయకు. దేవీపూజ చెయ్యి. ఆమె పాదపీఠంవద్ద అత్యవసర పనిని బలిపెట్టు. లేకుంటే కొద్దిరోజులలోనే విజయ దశమి వస్తుంది. దేవి అంతర్ధాన మవుతుంది."

యతిశంకర్ వెళ్ళాడు. అకర్తవ్య బుద్ధి కూడా జాగ్రత పడింది. అతని ఉనికిని సమర్థించే ఆమె కూడా ఎక్కడా కని పించలేదు అమిత కూడా బయటకు వెళ్ళాడు

గులాబీ తీగ పూలతో బరువెక్కింది. ఒకవేపున సమృద్ధిగా పొద్దుతిరుగుడు పూలు. ఇంకోవేపున నలుచదరపు కొయ్య కుండీలలో చేమంతిపూలు పటవాలు మైదానం ఎగువ అంచున పొడుగాటి నీలగిరితైలం చెట్టు. ఆ చెట్టు బోదెకు ఆనుకుని కాళ్ళుచాచుకుని కూర్చుంది లావణ్య బూడిదరంగుశాలువకప్పుకునిఉంది ఉదయసూర్యకాంతి ఆమె పాదాలమీద పడుతోంది. ఒడిలోని చేతిరుమాలులో రొట్టెముక్కలు, పగలగొట్టిన అక్రోటుకాయలు చెల్లాచెద రుగా పడివున్నాయి. ఆ ఉదయకాలమంతా పశుపక్ష్యాదులకు ఆహారం వేస్తూ గడుపుదామనుకుందిగాని ఆ సంగతే మరిచే పోయింది. అమితవచ్చి ఆమె పక్కన నిలబడ్డాడు. ఆమె తల ఎత్తి అతనివంక చూసిందేగాని మాట్లాడలేదు. ఆమె

ముఖంలో అస్పష్ట మందహాసం తారాడింది. అమిత ఎదురుగా కూర్చున్నాడు.

"శుభవార్త. పిన్ని అంగీకరించింది"

జవాబు చెప్పకుండా లావణ్య ఆక్రోటుకాయ ముక్క-దగ్గరలోని నిష్ఫల 'పీచ్' చెట్లకేసి విసిరింది. తక్షణమే ఒక ఉడత చెట్లమీదనుంచి దిగివచ్చింది లావణ్య దయాధర్మ భిక్షంకోసం వేచివుండే జీవులలో ఇదొకటి.

"నీకు అభ్యంతరం లేకపోతే నీ పేరును కొంచెం కుంచిస్తాను"

"సరే. అలాగేకానీ."

"నిన్ను 'వన్య' అని పిలుస్తాను."

"వన్య!"

"అబ్బె! అది నిందాస్పదంగా ధ్వనిస్తుంది. అటువంటి పేరు నాకు తగిపోతుంది. నిన్ను వన్యా అని పిలుస్తాను. సరేనా?"

"సరే. కాని మీ పిన్ని ముందు మాత్రం అలా పిలవవద్దు."

"అలాగే పిలవనులే. అటువంటి పేర్లు బీజమంత్రం లాంటివి. యితరుల ముందు వుచ్చరించరానివి. యీ పేరు నా నోటికి నీ చెవికి పరిమితం."

"సరే అలాగే."

"నాకూ అనధికార నామం వుండాలిగదా? బ్రహ్మపుత్ర! యెలాగుంది? హఠాత్తుగా వన్య (వరద) వచ్చిపడి పొంగిపొరలేటట్టు చేస్తుంది."

"నిత్యకృత్యంలో చనువుగా వుంటుంది"

"అవును. దానిని మోయడానికి కూలీని పెట్టుకోవాలి. నువే నాకో పేరు సృష్టించిపెట్టు."

"సరే. నీ పేరును కుంచించి మిత అని పిలుస్తాను."

"భేష్! వైష్ణవకవితలో దీనికి పర్యాయపదం 'బంధు! వన్య!' ఆ పేరుతో అందరి ముందు నన్నెందుకు నువు పిలవ కూడదు? అలా పిలిస్తే హాని యేముంది?"

"ఒక చెవికోసం నిర్దేశించిన నిధి ఒక చెవి నుంచి యింకో చెవికి వ్యాపిస్తే తేలిక అయిపోతుందని భయం."

"అబద్ధం కాదు. యిద్దరిమధ్య ఒకటిగా వున్నది పలువురి మధ్య భిన్నాభిన్న మయిపోతుంది, వన్యా."

"యేమిటి మిత?"

"నీ పేరుమీద నేను కవిత్వంరాస్తే అంత్యప్రాస ఏమి వేస్తానో తెలుసునా? అనన్య!"

"అంటే?"

"అంటే, నీవు నువ్వే! మరేంకాదు."

"అందులో విశేషంగా ఆశ్చర్య పడవలసిందేముంది?"

"అదేమిటి? యెంతో ఆశ్చర్యపడవలసింది వుంది. 'ఆమె పూర్తిగా ఆమే. యితరుల లాంటిది కాదు.' అని అనిపించి ఆశ్చర్యపరిచే వ్యక్తి తారసిల్లడం ఎంతో అదృష్టం వుంటేనే. నా కవితలో యిదే చెపుతాను–

"వన్య! అనన్య!
నీ రూపం బహుధాన్య!"

"నా మీద కవిత్వం రాస్తావా యేమిటి?"

"ఆఁ నన్నెవరాపగలరు?"

"యెందుకంత సాహసం?"

"చెపుతా విను. కిందటిరాత్రి రెండున్నరగంటల వరకు నిద్రపట్టనివాడు పక్కమీద అటూ యిటూ దొర్లినట్టు నేను ఆక్స్‌ఫర్డు కవితా సంపుటి పేజీపేజీ తిరగవేశాను. పూర్వం అడుగడుగుకూ కనిపించిన ప్రేమ కవిత యిపుడు ఒక్కటీ కనిపించలేదు. నేను ప్రేమ కవిత్వం రాయాలని ప్రపంచమంతా నిరీక్షిస్తున్నట్టు స్పష్టమయింది."

ఇలా చెప్పుతూ అమిత లావణ్య ఎడమ చేతిని తన రెండు చేతులతోను పట్టుకున్నాడు. "నా చేతులు పెనవేసుకున్నవి. యిక నేను కలం ఎలాపట్టుకోగలను? హస్తమేళనమే వృత్తమ మేళన. యీ నీ చేతివేళ్ళు నా చేతి వేళ్ళతో ఎలా గుసగుసలాడుతున్నాయో! యింతవరకు యే కవికూడా ఇంత సహజంగా అప్రయత్నంగా రాయలేదు."

"మిత్రా! నిను మెప్పించడం కష్టం. అందుకనే నువంటే నాకు భయం."

"కాని నా విషయం ఆలోచించు. రామచంద్రుడు దృగ్గోచరమయే భౌతికాగ్నితో సీత గుణగణాలను పరీక్షించదలచాడు. పర్యావసానంగా సీతను కోల్పోయాడు. కవిత గుణగణాలనుకూడా అగ్నితో పరీక్షించాలి. ఆ అగ్ని మనసు. మనసులో అగ్ని రగలని వ్యక్తి పరీక్ష యెలా చేయగలుగుతాడు. యితరులు చెప్పిన విధంగా చేయాలి. యితరులు చెప్పేది నీలాపనిందల ప్రలాపం! ఇవాళ నామనసంతా అగ్నితో

జ్వలిస్తోంది. ఆ అగ్ని సహాయంతో పూర్వం నేను చదివిన దంతా తిరిగి చదువుతున్నాను. అందులో యెంత మిగులు తోంది? యెక్కువ కాలి భస్మమయి పోతోంది. కవుల విపణి వీధిలో నిలబడి, 'బిగ్గరగా అరచి డప్పాలు కొట్టకండి. సరయి నది మెల్లగా చెప్పండి,' అని హెచ్చరించవలసి వుంటుంది. దేవునాన మౌనం వహించి నను ప్రేమించనీ."

ఇద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చున్నారు లావణ్య చేతిని అమిత తన చేతితో ఎత్తి మొహంమీదకు పోనిచ్చుకుని, "వన్యా! కొంచెం ఆలోచించు. యీ వుదయం యీ క్షణంలో యీ భూమిమీద యెంతమంది అసంఖ్యాక ప్రజలు కాంక్షిస్తున్నారు వారిలో కొద్దిమందికే వారి కోరిక సిద్ధిస్తోంది. ఆ కొద్దిమందిలో నేనొకడను. యీ ప్రపంచమంత టిలో నువొక్కదానివే యీ పిల్లాంగు కొండమూల, యీ నీలగిరి తైలం చెట్టుకింద అదృష్ట జాతకుడిని చూడగలుగు తున్నావు. యీ ప్రపంచంలో అద్భుత విషయాలు యెవరి దృష్టిని ఆకర్షించకుండా, కాలిబాటన వేళ్ళమీద చప్పుడు చేయకుండా వస్తాయి. కలకత్తాలోని గోల్‌డిఘీ నుంచి నౌకలు లేక చిటగాంగ్ వరకు యే పుల్లయ్యో వెంకయ్యో బిగ్గరగా నినాదాలు చేస్తూ, వుట్టిగాలిలో పిడికిలి వూపుతూ వట్టి రాజ కీయ తూటాలను పేలిస్తే ప్రముఖ వార్తగా ప్రకటిస్తారు. అది అంతేనేమో? యెవరికి తెలుసు?"

"అంతేనేమో యేమిటి?"

"జీవితంలోని వుత్తమకానుకలు మన మార్గాలకు తిరిగీ తిరిగీఅడ్డువచ్చినా, పామరజన తీవ్రదృష్టికి నాశనంకావు, మలి

నంకావు. దాని సంపూర్ణ పరిజ్ఞానం విశ్వ అగాధాలలో ఆడు తూనే వుంటుంది సరేగాని వన్య! నేనదో వాగుతూంటే నువ్వు మాట్లాడకుండా ఆలోచిస్తున్నావు. దేనిగురించి ఆలోచిస్తు న్నావో చెప్పు.''

లావణ్య కిందికి చూపులు బరుపుతూ మౌనంగా కూర్చుంది

''వేతనం యివ్వకుండా నా మాటలను తోసివేసి నట్టుంది నీ మౌనం.''

తలపైకెత్తకుండా లావణ్య ఇలా జవాబు చెప్పింది. ''నీ మాటలు వింటూంటే భయం నన్ను ఆవరించివేస్తోంది.''

''భయం దేనికి?''

''నా నుంచి నువేమి కోరుతున్నావో, నువు కోరే దానిలో నేనెంత యివ్వగలనో అర్థంకాక.''

''కానుక విలువయిందని అనుకోకుండానే నువు యివ్వ గలవు గనక.''

''మీా పిన్ని సమ్మతించిందనే నువు చెప్పగానే భయ్యం నన్ను పట్టుకుంది. పట్టుబడి బయట పడతామనే భయం!''

''పట్టుబడాలసిందే!''

''మిత్రా! నీ అభిరుచులు, నీ తెలివితేటలు నా అభిరుచు లను, తెలివి తేటలను మించినవి. ఒక రోడ్డుమీాద నీతో నేను నడిస్తే ఒకరోజున నేను వెనకబడిపోతాను. అపుడు నువ్వు వెనుదిరిగి నన్ను సాగిరమ్మని సంజ్ఞ కూడా చేయవు. అపుడు నేను నిన్ను నిందించనుకూడా — ఊహుఁ అడ్డురాకు నేచెప్పేది ముందు విను. నిను వేడుకుంటా, నన్ను వివాహమాడాలని

కోరుకోవద్దు వివాహం తరవాత వివాహ బంధనం వదులు చేయాలనుకుంటే యింకా చిక్కులో పడుతుంది నీ నుంచి నేను పొందినది నాకుచాలు. నాజీవితాంతంవరకు సరిపోతుంది. నిన్ను నీవు మోసగించుకోవద్దు."

"నేటి ఔదార్యంలోకి రేపటి లోభ పిశాచాన్ని యెందుకు ప్రవేశ పెడతావు? వన్యా!"

"మిత్రా! నిజం చెప్పగల శక్తిని నీవు నాకు ప్రసాదించావు నేడు నే చెప్పేదానికి నీ హృదయమే సాక్షి. అణుమాత్ర సందేహమయినా నేటి ఆనందాన్ని భగ్నం చేస్తుందని నువు యదార్థాన్ని అంగీకరించడం లేదు నువు గృహస్థు జీవివి కావు. నీ భావ తృష్ణను తీర్చేదానికోసం అన్వేషిస్తూంటావు. అందుకే నువు ఒక సాహిత్యాన్నుంచి ఒక సాహిత్యానికి పరుగెత్తుతుంటావు అందుకే నా దగ్గరకు వచ్చావు నిజం చెప్పనా? నీ హృదయం మారుమూలల్లో నువు ఎపుడూ చెపుతున్నట్టుగానే, వివాహం క్షుద్రమయిందని నీ భావన. అది అతిమర్యాద. శాస్త్రాలు చదువుతూ మెత్తని పరుపులమీద దొర్లుతూ భార్యలను తమ వస్తువులుగా చరాస్తిగా భావించేవారి భోగ వస్తువ."

"వన్యా! ఆశ్చర్యంగొలిపే కఠిన విషయాలను అంత సుతి మెత్తగా ఎలా చెప్పగలుగుతున్నావో ఆశ్చర్యంగా వుంది!"

"మిత్రా! ప్రేమబలంతో కఠినంగా ప్రవర్తించగలనా? నేను నిన్ను ఆకర్షిస్తున్నా నిను మోసంచేయలేను. నువు నువుగానేఉండి, నీ అభిరుచి అనుమతించినంతవరకే నన్ను ప్రీతితో

చూడు. బాధ్యత పైన వేసుకోవద్దు. అప్పుడు నేను సుఖంగా వుంటాను."

"సరే, యిక నేను చెప్పదలచినది చెప్పనీ, వన్యా! నా శీలమును ఎంత అద్భుతంగా వర్ణించావు! దానిమీద నేను తర్కించను. కాని ఒక విషయంలో మాత్రం పొర బడ్డావు. మానవుని శీలం మారుతూ వుంటుంది. పెంపుడు జంతువులాగా గొలుసుతో కట్టిన స్థానువు ఆకారంగా కని పిస్తాడు. కాని అదృష్టవశాత్తు గొలుసు హఠాత్తుగా తెగి పోతే అడవిలోకి పరుగెత్తుతాడు. అప్పుడు వేరు విధంగా గోచ రిస్తాడు."

"యీ రోజున నువు వారిలో యెవరివి?"

"యీ రోజు నేను నా మామూలు స్వత్వానికి భిన్న మయిన వాడిని యింతకు ముందు నేను అనేకమంది యువ తులను సమాజసాంగత్యంకోసం చదును చేసిన నదీతీరాలమీద వ్యుత్పన్న అభిరుచీ దీపపు మసక కాంతిలో తెలియకుండానే కలుసు కున్నాను. వన్య! నిన్ను కలుసుకోవడంలాంటి దేనా? చెప్పు?"

లావణ్య మాట్లాడ లేదు.

"రెండు నక్షత్రాలు సురక్షిత గౌరవప్రదదూరం నుంచి ఒకదానికొకటి సలాం చేస్తూ ఒక దానిచుట్టూ ఒకటి తిరుగు తుంటాయి. హృదయాలు కలుసుకోకుండా ఒకేఒక విధంగా తిరిగేటట్టు చేసే గురుత్వ సూత్రం యోగ్యమయినదే, నిరుప ద్రవ మయినది. హెచ్చరించకుండానే వినాశకర ఆఘాతం తగులుతుంది. వాటి రెండు ప్రత్యేక దీపాలు ఆరిపోతాయి.

అవి రెండు ఒకేఒక అగ్నిగుండంలో ఒకదాని నొకటి ఢీకొని పేలిపోతాయి. అటువంటి అగ్నిలో అమితరాయ్ మారి పోయాడు. అటువంటిదే మానవ చరిత్ర. నిరంతర ప్రవాహం లాగా గోచరిస్తుంది గాని నిజానికి అది సంఘటనల మాల. అటువంటి ఆఘాత పరంపరల సంయోగంలో అటువంటి సంచలనాల త్వరితగతి లయలు ఒకొక్క యుగాన్ని ముందుకు తోస్తుంటే సృష్టిముందుకు సాగిపోతూంటుంది."

లావణ్య కనులు చెమ్మగిల్లాయి. అయినప్పటికీ అమిత మనోస్థితి సాహిత్యమని, ఒకొక్క అనుభవం మాటల కెర టాలను అతని నాలుకమీదకు దొర్లిస్తుందని ఆమె మరిచే పోలేకపోయింది. అది అతని జీవిత ఫలం ఆనందప్రదాయని. అందుకనే అతనికి ఆమె అవసరం. అతని మనసును కుంగ దీస్తూ ప్రకటితముకాక గడ్డకట్టిన ఆలోచనల భారమును కరి గించడానికి కావలసిన వేడిమిని ఆమె అందజేస్తుంది చాలా సేపు మౌనం తరువాత హఠాత్తుగా లావణ్య, "తాజమహల్ నిర్మాణం పూర్తిఅయినరోజున షాజహాన్ ముంతాజ్ మృతికి సంతోషించి వుంటాడనే భావిస్తావా? మితా! అతని స్వప్నానికి అమరత్వం సిద్ధించేందుకు ఆమెమృతిఅనివార్యం ఆమె మృతి ఆమె ప్రేమకు వుత్తమ కానుక. తాజమహల్ షాజహాను దుఃఖంకాక ఆనందం రూపొందించి," అంది.

"నీ మాటలు క్షణక్షణం నాకు ఆశ్చర్యం కలిగిస్తు న్నాయి. నువు కవయిత్రివి. అనుమానంలేదు," అన్నాడు అమిత.

"నేను కవయిత్రిని అవాలని కాంక్షించడం లేదు."

"ఎందుకని?"

"మాటల దీపం వెలిగించడానికి నా జీవితపు వేడిమిని వుపయోగించడానికి నామనసు అంగీకరించడంలేదు. ఉత్సవాల కోసం జీవితపు చావడిని అలంకరించ ఆదేశితులయిన వారికే మాటలు. కాని జీవితపు వేడిమి జీవిత కార్యాచరణకోసం వినియోగిస్తాను"

"నువ్వు మాటలనే నిరాకరిస్తున్నావు నీ మాటలునన్ను యెలా మేల్కొలిపినవో తెలియదా? నీ మాటలలో ఎంతశక్తి వుందో ఎలా వూహించగలవు? మరోసారి నేను సివారణ చక్రవర్తిని ఆహ్వానించవలసి వుంది. పదే పదే అతని పేరు పేర్కొనడం నీకు విసుగు కలిగించి వుండవచ్చు. కాని నేనేం చేయగలను? నా హృదయ భాషను సంరక్షించేది అతను. నివారణ యింకా ముసలివాడు కాలేదు. అతనికి పనిభారం ఎక్కువకాలేదు ఎప్పుడు కవిత్వం రచించినా అది అతని ప్రధమ కవిత్వమే. మొన్న అతని వ్రాతప్రతులు తిరగ వేస్తుంటే అతని యిటీవలి రచన కనిపించింది. జలపాతంమీద కవిత. యీ షిల్లాంగు కొండలలో నేను నా జలపాతమును కనుగొన్నానని అతని కెలా తెలిసిందో ఆశ్చర్యంగా వుంది. ఆతను రాశాడు:

జలపాతమా! నీ స్ఫటికాచ్ఛ నీటి
పారదర్శిక ప్రవాహంలో
సూర్యుడు నక్షత్రాలు తమ ప్రతిబింబాలు
చూసుకుంటాయి.

"నేనే యిది వ్రాసివుంటే నిన్ను ఇంకా పరిస్ఫుటంగా నిను వర్ణించి వుండను. నీ మనసు అంత పారదర్శకమేమో ఆకాశకాంతి అందులో ప్రతిబింబిస్తుంది. విశ్రాంతిగా కూర్చున్నపుడు, రోడ్డుమీద నడుస్తున్నపుడు నీ ముఖంలో నీ చిరునవ్వులో, నీ మాటలలో నీ సర్వస్వంలో ప్రకాశిస్తుండడం చూచాను.

ఈ రోజు నాకీ నీడ
ఊగుతూ వాటి అంచుల క్రీడించనీ
నీ దరహాస సంగీతం
ఆ కీనీడలో కలిపెదవా?
అనంతంలోని నీ స్వరం
దానికి ప్రసాదించు

"నీవే ఆ జలపాతానివి. జీవిత ప్రవాహంతో పాటు సాగిపోతూండడమేగాక సాగిపోతూ మాట్లాడతావు. నీ గంతులలో నీ చిందులలో నీపాదాలు సోకిన కఠిన శిలలు సంగీతం ఆలపిస్తాయి.

నా కీనీడ దరహాసం
ఒకేఒక ప్రతిరూపంలో కలిసిపోయాయి.
అదిగో చూడు, నా హృదయం
కవితాకాశంలో చిక్కుకుంది
అడుగడుగునా క్షణ క్షణం
నీ తేజోరేఖ నా హృదికి
వాణిని ప్రసాదించింది
ఓ జలపాతమా!

నేడు నేను నాలో వాణీరూపంగాంచు
తున్నాను
నీ స్పర్శమాత్రాన నా హృదయం
మేల్కొనును
నన్ను నే తెలుసుకొందును"

క్షీణ మందహాసం చేస్తూ లావణ్య అన్నది: "నా తేజస్సు. నా సంగీతం యెలావున్నా నీకీ నీడ మాత్రం కీనీడగానే వుంటుంది. దానిని పట్టుకోవడం నా శక్తికి మించినది."

"నా తాలూకు వాణీరూపం ఒక్కటీ ఎప్పటికయినా" నిలుస్తుంది ఒక రోజున గుర్తిస్తావు."

"యెక్కడ! నివారణ చక్రవర్తి వ్రాతప్రతిలోనా! అంటూ నవ్వింది లావణ్య.

"అవును. నా హృదయం అగాధాలలో ప్రవహించే సెలయేరు నివారణ చక్రవర్తి జలయంత్రం ద్వారా బయటకు ప్రవహిస్తాడు."

"అలాఅయితే నివారణ చక్రవర్తి జలయంత్రంలో మాత్రమే నీ హృదయం ఒకరోజున కనిపిస్తుందికాబోలు."

ఆ సమయానికి నౌకరువచ్చి భోజనం తయారయిందని తెలియజేశాడు.

అమిత నడుస్తూ ఇలా ఆలోచించసాగాడు:

"లావణ్య ప్రతిదానినీ బుద్ధి దృష్టితో విశ్లేషించాలని కోరుతుంది. సహజంగా మోసగించడానికి వీలయినరంగంలోనే ఆమె తనను తాను మోసగించుకోలేకపోతుంది. ఆమె చెప్పినది కాదనలేకపోతున్నాను. పురుషులు తమ ఆంతర చైతన్య

సన్నిహిత సిద్ధికి బహిర్ద్వారాన్ని కనుగొనాలి. కొంతమంది దానిని జీవితంలో కొంతమంది సృజనాత్మక రచనలో— ఒకొకప్పుడు జీవితాన్ని స్పృశిస్తూ, ఒకొకప్పుడు జీవితంనుంచి వెనకబడుతూ నిరంతం తీరాన్ని స్పృశిస్తూ వెనక్కు మరలే నదిలాగా కనుగొంటారు. నేను జీవితంనుంచి వెనకబడి సాహిత్య సృష్టి ప్రవాహంవెంట కొట్టుకొని పోవలసిందేనా? యిదేనా స్త్రీ పురుషులకు భేదం! మానవుడు తన శక్తిని సృజనాత్మక కార్యకలాపంలో సఫలీకృతం చేసుకోవాలా? సృజనాత్మక ప్రేరణ తన పురోభివృద్ధికి అడుగడుగునా తనను తాను మోసగించుకోవడమేనా? యిక స్త్రీ తన శక్తులను పాతను భద్రపరిచి రక్షిస్తు నూతన సృష్టిని నిరోధించవలసిందేనా? సృష్టి తనదారికి అడ్డువచ్చే రక్షణసాధనపట్ల నిర్దయ వహిస్తుంది. యీ రెండూ యెక్కడో అక్కడ సంఘర్షణపడి తీరవలసిందేనా? వాటి అతి సన్నిహిత సంయోగం మహా శతృత్వసారం. అందుచేత మన అత్యుత్తమసిద్ధి సంయోగంలో గాక స్వేచ్ఛలో వుంటుందని తోస్తోంది."

ఈ ఆలోచనలు అమితకు బాధాకరంగా ఉన్నా అతని మనసు వాటిని విడనాడలేదు.

## లావణ్యావాదన

"అమ్మాయి లావణ్యా! సరిగా అర్థం చేసుకున్నావని నమ్మకమేనా?" అని అడిగింది యోగమాయ.

"సరిగానే అర్థం చేసుకున్నాను, అమ్మా!"

"అమిత స్వభావం చంచలం. నిజమే. అందుకనే అతనంటే నా కెంతో యిష్టం. సమస్తమూ తన చేయి జారిపోతుందని యెంత బాధపడుతున్నాడో కనిపించడం లేదూ!"

"సర్వమూ అతని అధీనంలో వుండి చేతినుంచి జారిపోతే నిజానికి అది అతనికి దురదృష్టంగానే పరిణమిస్తుంది. చేతికి అందేది అందకుండా పోవడం, అందితే అందిన తక్షణమే కోల్పోవడం అతని స్వత్వ సూత్రం. అందిన దానిని నిలబెట్టుకోవడం అతని స్వభావానికే విరుద్ధం

"నిజం చెప్పాలంటే నాకు అతని బాధ్యతారహితమయిన చిలిపి చేష్టలే నాకెక్కువ యిష్టం."

"అది మాతృధర్మం. చిలిపిచేష్టల ఆఘాతాలను భరించేది తల్లే. అందులోని వేడుకకు పిల్లవాడు ఆనందిస్తాడు. ఆ భారమునువహించమని నన్ను అడుగుతావేం? భరించలేనివారి మీద భారం మోపడ మెందుకు?"

"లావణ్యా! పూర్వం చంచలంగా వుపద్రవంగా వుండే అతని మనసు ఇటీవల వుపశమించింది. నువు గమనించలేదా? ఆ దృశ్యం మనసును కరగించి వేస్తోంది. నువేమన్నా అతడు నిన్ను ప్రేమిస్తున్నాడు."

"అవును ప్రేమిస్తున్నాడు."

"అయితే యిక విచార మెందుకు?"

"అమ్మా! అతని స్వభావంతో నేను చెలగాటమాడలేను."

"లావణ్యా! ప్రేమ చెలగాటమును కొంతవరకు ఆహ్వానిస్తుంది. కొంతవరకు ఆచరిస్తుంది. యిదే నాకు తెలిసింది."

"అమ్మా! అటువంటి చెలగాటానికి హద్దులంటూ వున్నాయి. స్వభావమును అణచివేసినప్పుడు అది తనకే మించి పోతుంది సాహిత్యంలో ప్రేమను గురించి నేను చదివినకొద్దీ ఒండొరుల వ్యక్తిత్వ యదార్థాన్ని అంగీకరించడంతో సంతృప్తి చెందక, తన యిష్టాయిష్టాలను రెండవ వారిమీద రుద్దాలని తన కాంక్షా ప్రతిరూపంగా రెండవవారిని రూపొం దించాలని యత్నించడంలోనే ప్రేమ విఫలమవుతుందని విశ్వాసం యెక్కువవుతోంది."

"ఆ మాటకొస్తే, కొంతవరకు ఒకరినొకరు రూపొం దించుకోకుండా సంసారం చేయడం సాధ్యం కాదు. ప్రేమ వున్నచోట అలా రూపొందించడం సులభం. ప్రేమలేని చోట నిర్బంధం విషాదం తెచ్చిపెడుతుంది."

"కుటుంబ జీవితంకోసం పుట్టిన పురుషుని విషయం కాదు. అతనుబంకమట్టివంటివాడు. నిత్యపరిస్థితులప్రభావంవల్ల తనంతటతానే రూపొందుతాడు. కాని స్వభావ సిద్ధంగా బంక మట్టివంటివాడు కాకపోతే తన వ్యక్తిత్వమును వదలుకోలేడు. స్త్రీ గనక దీనిని గుర్తించక యెంత యెక్కువగా వాంఛించితే అంత యెక్కువ కోల్పోతుంది. పురుషుడు దీనిని గుర్తించక యెంత యెక్కువ గుంజుకుంటే అంతగా తన నిజ హృదయ సహవాసిని కోల్పోతాడు. మనం 'సంపాదన' అనుకునేది చేతికి బేడీల సంపాదన లాంటిదనే నా నమ్మకం."

"యింతకీ నీకేం చేయాలనివుందో చెప్పు, లావణ్యా!"

"పెళ్ళి చేసుకుని అసౌఖ్యం తెచ్చిపెట్టాలని నాకులేదు. వివాహం అందరికీ సరిపడదు. అమ్మా! సులభంగా మెచ్చని

మన స్తత్వంగలవారు వ్యక్తిని ముక్కలు ముక్కలుగా నరికి ఒక ముక్కను స్వీకరించి ఇంకో ముక్కను పరిత్యజిస్తారు. ఒకసారి పెళ్ళివలలో చిక్కుకుంటే స్త్రీ పురుషులు అతి సన్నిహితు లవుతారు. వారిద్దరి మధ్య ఖాళీ అంటూ ఉండదు. ఒకరొకరితో కలిసి అవతలి వారి వలెనే, అతి సమీపంలో పనిచేయాలి. స్వప్నములో ఒక భాగాన్నయినా దాచుకునే మార్గం వుండదు. నీకు తెలియని దేముంది, అమ్మా!"

"నిన్ను నువే తెలుసుకోలేకుండా వున్నావు, లావణ్యా నీ మాటలు యెవరూ కాదనలేరు"

"కాని అతను నన్ను వాంఛించడం లేదు. నిత్యమూ యింటిలో కనిపించే నన్ను గమనించినట్టే కనిపించడు అతని మనసును నేను స్పృశించగానే నిరంతర పద ప్రవాహం పొంగుతుంది. మాటలతో నన్ను తిరిగి రూపొందించాలనే అతని యత్నం. మనసు అలసి పోయినపుడు, మాటలు అందనపుడు, అతను రూపొందించని ఈ సామాన్య యువతిని ఆ శూన్యంలో ఆవిష్కరిస్తాడు. పెళ్ళి అంటే సమ్మతి. అప్పుడు, కుమ్మరి చక్రంమీద రూపొందించే అవకాశం వుండదు."

"నీ లాంటి యువతిని అమిత చేసుకోలేడా?"

"ప్రకృతిమారితే నన్నే చేసుకోవచ్చు. కాని అతని ప్రకృతి యెందుకు మారాలి! మారడం నా కిష్టం లేదు."

"అయితే నువేం చేయాలనుకుంటున్నావు?"

"సాధ్యమయినంతకాలం అతని మాటలలో అతనిభావ క్రీడలో కలిసి స్వప్నంలా వుండగోరుతున్నాను. నిజానికి దానిని

స్వేచ్ఛమని యెందుకు అనాలి? అది ఏకైక పునర్జన్మ. ఏకైక ప్రపంచంలో ఏకైక స్వత్వ ఆవిష్కరణ! అది కొద్దిసేపు విహరించడానికి కాయలోనుంచి బయటకు వచ్చిన రంగు రంగుల సీతాకోక చిలుక అయితేనేం! హానిఏముంది? ఈ ప్రపంచంలో యితర వస్తువులకంటె అతి తక్కువ యదార్థ మయిందా? సూర్యునితోపాటు జనించి సూర్యునితోపాటు అస్తమిస్తేనేం? జనన అస్తమయాల మధ్యకాలం వృధాకాకుండా వుండడమె ముఖ్యం"

"సరే బాగుంది. అమితకు నువ్వు క్షణభంగుర రూపం కావచ్చు. మరి నీ సంగతేమిటి? యెన్నటికీ పెళ్ళి చేసుకోవా? నీకు కూడా అమిత క్షణభంగుర రూపమేనా?"

లావణ్య మౌనంగా కూర్చుంది. మాటాడలేదు. యోగమాయ ఆగకుండా, "నువ్వు వాదిస్తుంటే నువ్వు ఎక్కువగా చదువు కున్నావని తోస్తోంది. నేను నీ లాగా యోచించనూలేను, మాట్లాడనూలేను. బహుశా నీలాగా సాహసం చేయనూ లేను. నీ తర్కంలోని బీటలలోనుంచి కూడా నిన్ను తెలుసుకో గలుగుతున్నాను. మొన్న అర్థ రాత్రివేళ నీ గదిలో దీపం వెలుగుతూండడంచూసి లోపలకు వచ్చాను. నువ్వు మేజా బల్లమీదకు తలవంచి, మొహం చేతులతో కప్పుకుని యేడుస్తుండడం గమనించాను. అపుడు వేదాంతం వంటబట్టిన కన్యవుకావు. నిన్ను ఓదారుద్దామని ఒక క్షణం అనుకున్నాను. యేడవవలసి వచ్చినరోజున రోజూ ప్రతియువతీ యేడవడం మంచిదిగాని అణచుకోవడం మంచిది కాదని భావించాను. నువ్వు మనసారా ప్రేమించాలని కోరుతు

న్నావేగాని మనసులో ప్రేమను సృష్టించుకోవాలని కోరడం లేదని నాకు తెలుసు. భక్తితో నీ హృదయాన్ని ఆత్మను సమర్పించకపోతే బతికడమెలా? అందుచేత అతను నీ సమీపంలో వుండి తీరాలి. వివాహం చేసుకోనని తొందరపడి శపథం పట్టవద్దు. నీది మొండిపట్టుదల నాకు భయం గొలుపు తోంది. ఒకసారి నువ్వు ఒక నిశ్చయానికివస్తే నిను మార్చడం యెవరితరమూ కాదు," అన్నది.

లావణ్య ఏమీ మాట్లాడలేదు. తలవంచుకుని అనవసరంగా చీరచెరగును ఒడిలో మడుస్తూ నొక్కుతూ కూర్చుంది. యోగమాయ, "నిన్ను కనిపెట్టి చూస్తూంటే చదువు యోచన యెక్కువయి నీ బోటివారి మనసు అతిసున్నితంగా తయారయిందని అనిపిస్తోంది. మీలో మీరు మన ప్రపంచానికి అనుగుణంగాని ఒక భావప్రపంచమునుసృష్టించుకున్నారు. రక్తమాంసాలు లేనట్టుగా శారీరక ఘనజవనికను చీల్చుకుని పోయే భావ కిరణాలు లేకుండా మీరు మనలేరు. మా కాలంలో అటువంటి కిరణాల సంగతే మాకు తెలియదు. కాని మా మోటు భావాలే మా జీవిత సుఖదుఃఖాలను సరిపోయేవి. అయినా సమస్యలకు కొదువ వుండేదికాదు. కాని యీ రోజులలో మీరు సమస్యలను పెంచివేసుకున్నారు. అందుకే నేడు సాధారణ మయిందంటూ యేదీలేదు," అంది.

లావణ్య మందహాసం చేసింది. మొన్ననే అమిత యోగమాయకు అదృశ్య కిరణాలను గురించి వివరించి చెప్పాడు. అందుకనే యీ తార్కిక ధోరణి ఆమె మనసులో నిలిచింది అదికూడా అతిసున్నితం. యోగమాయ తల్లి ఈ

విధంగా అర్థం చేసుకోలేకపోయేది. లావణ్య "అమ్మా! కాల గతిని మానవుని మనసు స్పష్టంగా తెలుసుకోగలిగితే దాని ఆఘాతాలకు తట్టుకో గలుగుతుంది. అంధకారం అస్పష్ట మయినది కాబట్టే దాని వేదన సహించరానిది," అంది.

"మీ రిద్దరూ కలుసుకోకుండా వుంటే బాగుండి పోయేదని యిప్పుడు నాకు అనిపిస్తోంది," అంది యోగ మాయ.

"అబ్బే! అలా అనకు. యింతకంటె వేరు విధంగా జరిగివుంటే బాగుండేదని నే ఎన్నడూ వూహించలేను. నా మనసు పూర్తిగా ఎండిపోయిందని పుస్తకాలు చదువుతూ పరీక్షలలో నెగ్గుతూ జీవితం గడపాలని వ్రాసిపెట్టి ఉందనీ ఒకపుడు నమ్మాను. నేనూ ప్రేమించగలనని ఇపుడు తెలుసు కున్నాను. అసంభవం సంభవమవడమే గొప్ప విశేషం. పూర్వం నేను కీసీడనని భావించాను. కాని యిపుడు నేను సత్య రూపిణిని. యింతకంటె మరేం కావాలి? కాని అమ్మా! పెళ్ళిచేసుకో వలసిందని మాత్రం చెప్పకు."

ఇలా చెపుతూ లావణ్య కుర్చీలో నుంచి కిందకు జారి యోగమాయ ఒడిలో మొహంపెట్టి ఏడవసాగింది

## గృహ పరివర్తన

అమిత పదిరోజులలో కలకత్తా తిరిగివస్తాడని అంతా గట్టిగా నమ్మారు. షిల్లాంగులో అమిత వారం రోజులు కూడా నిలవలేడని నరేన్‌మిత్రా పెద్దగా పందెం

కట్టాను. కాని నెల గడిచింది, రెండు నెలలు గడిచాయి. కాని అతను తిరిగివచ్చేజాడ కనిపించలేదు. పిల్లాంగులోని ఇంటి అద్దెగడువు ముగిసింది. రంగాపూరునుంచి ఒక జమీందారు వచ్చి దానిని స్వాధీనంచేసుకున్నాడు. వెతకగా వెతకగా యోగ మాయ ఇంటిదగ్గర ఒక కుటీరందొరికింది. ఒకప్పుడు అందులో ఒక గొడ్లకాపరి తోటమాలీ నివసించాడు. తరవాత ఒక గుమాస్తా ప్రవేశించి దానికి బీదరికపు మర్యాద చిహ్నాలను నెలకొల్పాడు. ఆ గుమాస్తా చనిపోయాడు. అతని భార్య ఆ కుటీరాన్ని అద్దెకు ఇచ్చింది. ద్వారాలు కిటికీల కొరతవల్ల అందులో వేడిమి, ఎండ, గాలి ప్రవేశించలేవు వర్షం కురిసిన రోజునమాత్రం నీరు అసంఖ్యాక నిగూఢ భద్రద్వారాల గుండా అతి సమృద్ధిగా ప్రవేశిస్తుంది.

ఒకరోజున ఆ గది స్థితిచూసి యోగమాయ అదిరి పోయింది.

"యే కఠోరదీక్ష పూనావు, నాయనా!" అని అడిగింది యోగమాయ.

"ఉమ ఆహారం మానివేసి తపస్సు చేసింది. చివరకు ఆకులు అలము తినడంకూడా మానివేసింది. యిక నేనో మంచం, పరుపు, మేజా, ఒకటొకటిగా వదలివేసే తపస్సు చేస్తున్నాను. యిక యీ శూన్యకుడ్యాలు మాత్రమే మిగిలి నాయి. ఆమె తపస్సు హిమాలయ పర్వతాలలో. నా తపస్సు పిల్లాంగు కొండలలో. అక్కడే పెళ్ళికూతురు పెళ్ళికొడుకు కోసం తపస్సు. యిక్కడ పెళ్ళికొడుకు పెళ్ళికూతురు కోసం తపస్సు అక్కడ నారదుడు పెళ్ళిరాయబారి. యిక్కడవిన్ని.

కాళిదాసు గనక రాకపోతే అతని పనిని నా చేతనయినంత వరకు నేనే చేయాలి.''

ఇలా చెపుతూ అమిత నవ్వాడు. కాని అతని మాటలు యోగమాయకు దుఃఖం కలిగించాయి. తన యింటికి రమ్మని ఆహ్వానిద్దామని తలపోసిందిగాని ఆ భావాన్ని అణచుకుంది. "విధివిలాస నాటకంలో మన జోక్యం అసాధ్యమయిన చిక్కులు యెక్కువవుతాయి,'' అనుకుంది. అతనిని ఆహ్వా నించకుండా తన ఇంటినుంచి కొన్నివస్తువులు తెచ్చిఇచ్చింది. ఈ అభాగ్యునిమీద ఆమెకు కరుణఇనుమడించింది. "లావణ్యా! నీ మనసును రాయి చేసుకుంటావా!'' అని మాటిమాటికీ అధిక్షేపించ జొచ్చింది.

ఒకరోజున వాన కుంభవృష్టిగా కురిసింది. అమిత ఎలా ఉన్నాడో తెలుసుకుందామని యోగమాయ కిందకు దిగివచ్చింది. అల్లల్లాడుతున్న కుర్చీకింద దుప్పటి పరచుకొని కూర్చుని అమిత ఇంగ్లీషు పుస్తకం దీక్షగా చదువుతూండడం చూసింది అతని గదిని అనుచితంగా వాన నీరు ముంచెత్తి వేసింది. అమిత మేజాబల్లను గుహలాగా కట్టుదిట్టంచేసి దాని కింద కాళ్ళూ చేతులు పారజాపుకుని పండుకున్నాడు. అతని మనసు యోగమాయ ఇంటికేసి పరుగెత్తిందిగాని శరీరం మనసును అనుసరించలేకపోయింది. కలకత్తాలో అనవసర మయిన వానకోటును ఎక్కువ వెలబెట్టి కొన్నాడు. కాని అవసరమయిన చోటుకు దానినికూడా తీసుకురావడం మరిచే పోయాడు. కూడా గొడుగు తీసుకు వచ్చినమాట నిజమే కాని అతని మనసు పరుగెత్తిన ఇంటిలోనే దానిని వదలివేసి

ఉండవచ్చు. లేదా దేవదారు వృక్షపాదతలంలోనే ఇంకా ఉండి ఉండవచ్చు. గదిలో ప్రవేశిస్తూ యోగమాయ, ఏమిటి సంగతి?" అని అడిగింది.

మేజాబల్ల కిందనుంచి తొందరతొందరగా బయటకు వస్తూ అమిత "యివాళ నా గది సన్నిపాత రోగి అసంబద్ధ ప్రలాపంలాగా వుంది. అయితేనేం దాని స్థితి నా స్థితికంటె మెరుగు," అని జవాబిచ్చాడు.

"అసంబద్ధ ప్రలాపం?"

"యింకో విధంగా చెప్పాలంటే యీ యింటి కప్పు భారతదేశంలాగా వుంది దాని భాగాలు ఒకదానికొకటి అసంబద్ధం. పైనుంచి అత్యాచారం జరిగితే యీ స్థలమంతా కన్నీటి సంక్షోభంతో నిండిపోతుంది. బయటనుంచి రివ్వుమని గాలివీస్తే నిట్టూర్పుల బృందగానం యింటిలో ప్రారంభమవుతుంది. అసమ్మతి సూచకంగా నా శిరస్సుమీద ఒక వేదిక అమర్చుకున్నాను. చెడు పరిపాలన మధ్య నిరుపద్రవమయిన 'హోంరూలు' కు యిది ఉదాహరణ. యిది రాజకీయ సిద్ధాంతానికి దృష్టాంతరం."

"యే మూల సిద్ధాంతం?"

"యే శక్తివంతుడయినా సమక్షంలో లేని యజమాని పాలనకంటె బీదకౌలుదారు కల్పించుకున్న స్వయం సహాయం యెక్కువ ఫలప్రదమయింది."

నేడు యోగమాయ లావణ్యమీద మండిపోతోంది. అమితమీద అప్యాయత హెచ్చినకొద్దీ ఆమె హృదయపీఠం మీద అతనికి ఉన్నతస్థానం ఒసగసాగింది. "అంతవిద్య, అంత

ప్రతిభ, అంత యోగ్యత, అయినా ఏమాత్రం భేషజంలేదు. ఆశ్చర్యకరమయిన భావ ప్రకటనా శక్తి. యిక రూపురేఖ లలో లావణ్యాకంటెమిన్న. గ్రహాలు కుట్రపన్ని అమిత కను లకు ఆమె ఆకర్షణీయంగా కనిపించేటట్లు చేశాయి. అదృష్ట వంతురాలు. రత్నంలాంటివాడిని నానా హింసలూ పెడు తోంది. తానేమో మహారాజపుత్రిలాగా, తనకోసం యోధులు విల్లును విరవ వలసి వున్నట్లు, ఏకారణంలేకుండా పెళ్ళిచేసుకోనంటుంది. యెంత అహంకారం! పాపం! అభాగ్యు రాలు! జీవితం విషాదాంతం కావాలని నొదుట వ్రాసివుంది."

అమితను తన కారులో ఇంటికి తీసుకు వెళ్ళాలని ఒక క్షణం అనుకున్నదిగాని తిరిగీ యోచించి, "కొంచెంసేపు ఆగు బాబూ! యిప్పుడే తిరిగి వస్తాను," అని మాత్రమే అంది.

యోగమాయ ఇంటికి తిరిగి వచ్చేసరికి లావణ్య ఆమె గదిలో సోఫాలో ఆనుకుని పాదాలు శాలువాతో కప్పుకొని గోర్కీ రచించిన అమ్మ అనే నవల చదువుతూ కూర్చుని ఉంది. అంత వెచ్చగా హాయిగా కూర్చుని ఉండడం చూసే సరికి యోగమాయ మనసులో ఆమెమీద కోపంవొచ్చింది.

"రా, బయట కాస్సేపు తిరిగివద్దాం," అంది యోగ మాయ.

"యివాళ బయటకు వెళ్ళాలని లేదు, అమ్మా!"

తన నుంచి తాను తప్పించుకోవడానికి ఆ పుస్తకాన్ని లావణ్య ఆశ్రయించిందని యోగమాయకేం తెలుసు! ఆ మధ్యాహ్నం భోజనానంతరం అమితకోసం ఆదుర్దాతో నిరీ క్షించింది. అతను వస్తాడని ఆమె హృదయం మాటిమాటికీ

చెప్తూనే ఉంది. బయట జోరుగాలి తాకిడికి దేవదారు చెట్లు మధ్య మధ్య అటూ ఇటూ ఊగిసలాడుతున్నాయి. కుంభవృష్టికి ఏర్పడిన పిల్లకాలవలు వాటి అల్పకాల జీవిత మంతా పరుగెత్తవలసి ఉన్నట్టు వగర్చుకుంటూ అతివేగంగా ప్రవహిస్తున్నాయి. సకల బంధనాలు తెంచుకుని, అనుమా నాలను పారద్రోలి అమిత రెండు చేతులూ పట్టుకుని, 'చావు బతుకులలో నేను నీ దాననే' అని చెప్పాలనే ఇచ్ఛ జనించింది ఆ రోజున అలా చెప్పడం తేలిక అయేది ఆకాశం నిరాశతో అర్థంకాని పంతాలతో బొబ్బరిస్తోంది. వనవనాంతరాలకు ఆ బొబ్బరింపులో మాటలు పట్టుబడ్డాయి. కురిసే వర్షపు యవ నిక వెనక పర్వత శిఖరాలు వాటిమాటలు వినడానికి చెవులు నిక్కించుకున్నాయి. వాటిలాగానే లావణ్య మాటలు అదే సంపూర్ణ ప్రశాంతతలో, అత్యంతశ్రద్ధతో వినడానికి శ్రోతవస్తే బాగుండును! గంటలకు గంటలకు గడిచిపోయాయి. కాని ఎవరూ రాలేదు. మనసులోని మాటను సరిగా చెప్పేసమయం దాటిపోయింది. సమయం దాటిపోయిన తరవాత శ్రోత వచ్చినా ప్రయోజనం లేదు మాటపెగలదు. అనుమానాలు తిరిగి ప్రత్యక్షమవుతాయి. హృదయంనుంచి భయాన్ని పారద్రోలిన విశ్వతాండవరవం ఆకాశంలోవిలీనమయిపోతుంది. సంవత్సరాలకు సంవత్సరాలు నిశ్శబ్దంగాగడిచిపోతాయి.ఆ తర వాత వాణి అనిరీక్షితంగా మానవద్వారాలను కొట్టే ఘడియ వస్తుంది దానిని తెరిచే తాళంచెవి కనిపించకపోతే నిర్భయ వాణి దివ్యకానుకను తిరిగి ఎన్నటికీ ప్రసాదించదు. అటువంటి రోజున ప్రపంచమంతటితో రహస్యంగా 'అంతావినండి! నేను

ప్రేమిస్తున్నాను! ప్రేమిస్తున్నాను!' అని చెప్పాలని తహ తహ పుడుతుంది. సముద్రం అవతలనుంచి సుమారం రాత్రిం బవలు ఎగురుతూ ప్రయాణంచేసివచ్చే అజ్ఞాతపక్షిలాగా మాటలు బయటకు వస్తాయి. వాటికోసమే నాలోని దివ్యత్వం జాగరణచేస్తోంది. వాణి స్పర్శతో నా యావజ్జీవితం, నా యావత్తు విశ్వం వాటి భావాన్ని గ్రహిస్తుంది. లావణ్య తల గడాలో ముఖం దాచుకుని, ఎవరికోసం? "యిదీ సత్యం, సత్యం, యేకైకసత్యం" అనుకుంది.

కాలం గడిచింది. అతిథి రాలేదు. నిరీక్షణాభారం ఆమె హృదయాన్ని అణచివేసి బాధపెట్టింది. వరండాలోకి లావణ్య వెళ్ళింది. గాలివానకు కొద్దిగా తడిసింది. అప్పుడు పూర్తిగా కుంగిపోయింది. మనసు చెడ్డనిరాశతో నిండి పోయింది. ఆమె జీవిత జ్యోతి ఒకసారి గప్పుమని ఆరిపోయి ఆమె ప్రపంచమునే తుడిచిపెట్టి వేసినట్లు అనిపించింది. అమె తను పరిగ్రహింపజేసే అంతర విశ్వాస జనిత ధైర్యం ఇపుడా మెను పరిత్యజించింది. అత్యున్నత ప్రేమ విశ్వాసం వాడి పోయింది చాలాసేపు మైకంలో ఉన్న తరవాత మేజామీద నుంచి ఒక పుస్తకం తీసింది. మనసును కుదుట పర్చుకోవ డానికి కొంతసేపు పట్టింది. కథలో ఆసక్తి కలిగిన తరవాత ఆమె అనుకోకుండానే అందులో మైమరచింది. గంతలో హఠా త్తుగా యోగమాయ వచ్చి బయటకు వెళదాం రమ్మన్నది. కాని లావణ్యకు బయటకు వెళ్ళడానికి ఉత్సాహం కలగలేదు.

కుర్చీలాగుకుని యోగమాయ లావణ్యకు ఎదురుగా కూర్చుని ఆమె ముఖంకేసి తీవ్రంగా చూస్తూ, "నిజం చెప్పు, లావణ్యా! నువు అమితను ప్రేమిస్తున్నావా?"

"యీ ప్రశ్నను ఎందుకు వేశావు, అమ్మా!" అంది లావణ్య తొందరగా లేచికూర్చుంటూ.

"ప్రేమించకపోతే ప్రేమించడం లేదని ఎందుకు స్పష్టంగా చెప్పవు? నీకు దయాదాక్షిణ్యాలు లేవు. నువతనిని వాంఛించకపోతే స్వేచ్ఛగా వదలివేశేయి."

లావణ్య హృదయం లోలోపల ఉక్కిరిబిక్కిరయింది. మాటాడ లేకపోయింది.

"యిపుడతని వాలకంచూస్తే హృదయం బద్దలవుతుంది. యెవరికోసం ముష్టివానిలాగా కుళ్ళిపోతున్నాడు? అతని విషయంలో నువింత గడ్డిదానివెలా అయినావు? అటువంటివాడు వాంఛించిన యువతి అదృష్టవంతురాలు."

ఉక్కిరిబిక్కిరవుతున్న ఊపిరిని అదుపులో పెట్టుకోడానిక కొట్టుమిట్టాడుతూ లావణ్య, "ప్రేమను గురించి అడిగావుగదూ, అమ్మా నా కంటె యెక్కువగా ప్రేమించేవారు యీ ప్రపంచంలో వుంటారనుకోను. ప్రేమకోసం నా ప్రాణాలను బలిపెట్టగలను. నా పూర్వస్వత్వంతుడిచిపెట్టుకుపోయింది. ఇది నాకు నూతన జన్మ అంతంలేని జన్మ! నాలో యిటువంటి అద్భుతం జనించింది. నేను ఇతరులకిది యెలా విప్పి చెప్పగలను? నాలాగా యింకెవరయినా భావించుకుంటారా?"

యోగమాయ బ్రాన్పడిపోయింది. లావణ్య ఆత్మ స్థయిర్యం కోల్పోవడం ఆమె ఎన్నడూ చూడలేదు. ఇంత ఉద్రేకం ఆమెలో ఎక్కడ దాగుకొంది?

మెల్లగా మృదువుగా యోగమాయ అన్నది: "లావణ్యా! నిన్ను నువు అణచివేసుకోవద్దు. చీకటిలో అమిత నీ కోసం వెదుకుతున్నాడు సంపూర్ణంగా అతనికి కనిపించు. భయపడకు నీలో జ్యోతి ప్రకాశిస్తోంది. ఆ జ్యోతి అతనికి కనిపిస్తే అతనికింకేమీ కొదువ వుండదు. రా, అమ్మా! రా! యిప్పుడే నాతో రా." ఇద్దరూ అమిత కుటీరానికి బయలు దేరారు.

## ద్వితీయ సాధన

తడిసిన కుర్చీమీద వార్తాపత్రిక కాగితాలు పరిచి అమిత దానిమీద కూర్చున్నాడు. తెల్ల కాగితాలకట్ట ముందు వేసుకుని తన ఆత్మకథ వ్రాయడం అపుడే ప్రారంభించాడు. అప్పటికే అతని ఆత్మకథ వ్రాయడం విషయం నలుగురూ చెప్పుకుంటున్నారు. ఆత్మకథ విషయం ఎవరయినా అతనిని ప్రశ్నిస్తే, వానకురిసి వెలసిన నాటి ఉదయం షిల్లాంగు కొండలలాగా అతనిజీవితం వివిధ వర్ణాలతో అపుడే తనకు గోచరించిందని జవాబు చెప్పేవాడు. తన అస్తిత్వపు విలువను ఇపుడు గుర్తించడంవల్ల దానిని ప్రకటించ కుండా ఉండడం ఎలా? మానవుని జీవిత చరిత్ర అతను మరణించిన తరవాత వ్రాయడానికి కారణం బ్రతికి ఉండగా

అతను ప్రపంచ దృష్టిలో మృతుడు కావడమేనని, మృతి చెందిన తరవాత వారి మనసులలో తిరిగి తీవ్రరూపంలో జీవించడమేనని అమిత అభిప్రాయం దీని అర్థం అతని గతచరిత్ర ఎండమావిలా మాసిపోవడంతో ఒకదశ పిల్లాంగులో అంతరించింది. ఇంకొక దృష్టిలో అంధకారం వెనక దివ్యకాంతి బింబంలాగా అతనుతిరిది తీవ్రజీవంతో తిరిగిజన్మించాడు. అటువంటి అభివ్యక్తీకరణ అనుభవించే అదృష్టం ఏ కొద్దిమందికో మాత్రమే పడుతుంది. అందువల్ల దానిని ప్రకటించడం వాంఛనీయం. చాలామంది జీవితాలు, గుహాలోని గబ్బిలాల జీవితాలలాగా, పుట్టిన దగ్గరనుంచి చనిపోయేవరకు సందె వెలుగు నీడలో భారంగా సాగిపోతూంటాయి.

తుప్పరపడుతోంది. తుపాను అణగిపోయింది. మబ్బులు చెల్లాచెదరయినాయి.

"పిన్నీ యెంత అన్యాయం చేశావు!" అన్నాడుఅమిత కుర్చీలోనుంచి దిగ్గునలేస్తూ.

"నేనేం అన్యాయం చేశాను!"

"నేను ఏ మాత్రం తయారు కాలేదు. శ్రీమతి లావణ్య యేమనుకుంటుందో!"

"లావణ్యను కొంచెం యోచించేటట్టు చేయడం అవసరం. తెలుసుకోవలసింది తెలుసుకోవడం మంచిది. శ్రీయుత అమిత యింత కంగారుపడడం దేనికో!"

"శ్రీయుతుని సంపద శ్రీమతికి తెలియజేయడంకోసం. ముష్టివాని లేమి పిన్నికి మాత్రమే తెలుస్తుంది."

"యెందుకా విచక్షణ, నాయనా!"

"నా కోసం. సంపదను యితరులకిచ్చి తిరిగి సంపద నిమ్మని కోరవచ్చు. బీదవాడు మహాకోరితే సానుభూతి కోరతాడు. నాగరికతా సంపదకు కారణం లావణ్యాదేవి లాంటి వారు. దానిలోని మానవతకు కారణం పిన్నిలాంటివారు!"

"దేవిని పిన్నిని ఒకటిగానే పొందవచ్చు. బీదరికాన్ని దాచుకునే అవసరం లేదు"

"దీనికి ఒకానొక కవి మాటలతో జవాబివ్వ వలసి వుంటుంది. గద్యానికి ఛందోరూపంలో వ్యాఖ్యానం చేయాలి. మాథ్యూ ఆర్నాల్డ్ కవితను 'జీవిత విమర్శ' అన్నాడు దీనికి ఒక సవరణ పెడుతూ కవితను 'ఛందోరూప జీవిత వ్యాఖ్య' అంటాను. గౌరవనీయ అతిధికోసం ముందుగానే చెప్పు తున్నాను. నేను చదవబోయే కవిత ఏ కవి సమ్రాట్ రచించిందీ కాదు.

నీ ఆత్మ వాంఛితంకోసం
రిక్తహస్తాలతో అన్వేషించకు
తడికంటితో నిలబడకు
దాని ద్వారము చెంత

కాస్త ఆలోచించు. ప్రేమే సంపద, దాని తహ తహ బీదవాని తహతహ లాంటిదికాదు. భగవంతుడు భక్తుని ప్రేమించసాగినపుడు బీదవాని వేషంలో అతని ద్వారం ముందు ప్రత్యక్ష మవుతాడు.

రత్నమాల నువు తెచ్చినపుడు
మార్చుకొందము మాలలు

నీ దేవతాసనం పరిచెదవా
ధూళికొట్టిన దోవపక్కన?

'అందుకే నే నీమెను గదిలో ప్రవేశించకముందే ఆత్రపడవద్దని చెప్పాను పరచడానికి యేమీ లేనప్పుడు ఏమి పరిచేది. తడిసిన యీ కాగితాలు పరచనా? సంపాదకీయ స్థిరా మరకలు అవుతాయేమోనని నా భయం. కవి ఏమన్నాడంటే నా తృష్ణను పంచుకునేందుకు రమ్మని నా హృదయాధిదేవతను ఆహ్వానించను. జీవితపాత్ర పొంగిపొరలే టప్పుడు ఆహ్వానిస్తాను.

వైశాఖంలో వడిగాలిలో
అడవులు కృశిస్తుంటే
ప్రేమ కానుకల గంపను
నింపెదవా వాడిన పూలు!
అతిథిని ఆహ్వానించి
అసంఖ్యాక అగ్నిశిఖలతో
అంధకారంలో దీపాలు వెలుగునపుడు
ఆనంద గర్వంతో ఆహ్వానించు.

"పిన్ని ఒడిలో నిస్సహాయంగా దిగంబర సన్యాసిలాగా బాల్యంలో పండుకోవడమేమానవుని ప్రథమతపస్సు, ప్రమథ సాధన. ఆర్ద్రి హృదయంలో శిక్షణ. ఈ కుటీరం అనిశ్చల సంసిద్ధతకు చిహ్నం. ఈకుటీరానికి 'మాషి' (పిన్ని) బంగాళా అని నామకరణం చేయాలని నిశ్చయించుకున్నాను."

"ద్వితీయ జీవిత తపస్సు సంపద, కన్యపక్కన ప్రేమ సాధన. యీ నీ సాధన యీ కుటీరంలో జరుగుతోంది. తడి

కాగితాలెన్నయినా యీ సాధనను అణచివేయలేవు వరం యింకా పొందలేదని భ్రాంతిచెందడ మెందుకు? నీ హృదయాంతరాళంలో వరం పొందావని నీకు తెలియనే తెలుసు!"

ఇలా అంటూ అమితపక్కన లావణ్యానునిలబెట్టి, ఆమె కుడిచేతినితీసుకొని అతని కుడిచేతిమీద పెట్టింది. లావణ్యా మెడ నుంచి సువర్ణ హారం తీసి దానితో వారిద్దరి చేతులుకట్టివేసి, "మీ దాంపత్యం అక్షయంగా వుండుగాక!" అని ఆశీర్వదించింది.

అమిత లావణ్యా ఇద్దరూ వంగి ఆమె పాదధూళిని తీసుకున్నారు. ఆమె, "నేను తోటలోనుంచి పువ్వులు తెస్తాను. నేను వచ్చేవరకు యిక్కడే వేచివుండండి," అనిచెప్పి పూలు తీసుకురావడానికి కారులో వెళ్ళింది

ఇద్దరూ మంచంమీద ఒకరిపక్కన ఒకరు చాలా సేపటి వరకు మౌనంగా కూర్చున్నారు. ఆ తరవాత అమిత మొహంలో మొహంపెట్టి లావణ్యా, "యివాళ అసలు రానే లేదే!" అంది.

"కారణం బహు స్వల్పం. యిటువంటి రోజున దానిని చెప్పడానికి ధైర్యం కావాలి. మబ్బుపట్టిన రోజున వానకోటు లేకపోవడంవల్ల ప్రియురాలిని సందర్శించడం ప్రియుడు వాయిదా వేసుకున్నాడని చరిత్రలో యెక్కడా ప్రస్తావించ లేదు. అందుకు భిన్నంగా అగాధ సముద్రాన్ని యీదుకుంటూ వెళ్ళాడని చరిత్ర చెపుతూంది. హృదయ చరిత్రనే అది ఉద్ఘాటిస్తోంది. దాని అగాధ జలంలోనే నేనూ యీదుతున్నాను. అంతులేని ఆ సముద్రాన్ని నేను యెన్నటికయినా దాటగలనా?"

ఏ నావికుడూ పో సాహసించని
చోటుకు పోవడం మన లక్ష్యం
నావనూ మనలను సర్వమునూ ఒడ్డుదాం

"నువు నాకోసం నిరీక్షించావా?, వన్యా!'

"ఆఁ నిరీక్షించాను మిత్రా! వర్షపునీటి చిటపటలలో నీ పాద ధ్వనులు విన్నాను. భూమి అంచుల నుంచి నువు వస్తున్నట్టు అనిపించింది. యెలాగయితేనేం చివరకు నా జీవితంలో నువు ప్రవేశించావు"

"వన్యా! నా జీవిత హృదయంలో ఇప్పటి వరకు నిన్ను యెరగని పెద్దవలితి చీకటిలా యేర్పడింది. అదే అన్నిటికంటె అసహ్యమయినది. యీ రోజున నా జీవిత హృదయం అంచులదాకా నిండింది. దానిమీద సూర్యకాంతి ప్రకాశిస్తోంది. ఆకాశం ప్రతిఫలిస్తోంది. నేడు అదే సుందరాతి సుందరం. నా నిరంతరం ప్రలాపన. పొంగిపొరలే జీవిత సరోవరం మీది కెరటాల ప్రతిధ్వని. దీనిని యెవరు ఆపుచేయగలరు?"

"మిత్రా! యీ రోజు నువు కాలం యెలా గడిపావు?"

"నా చైతన్య కేంద్రంలో నిస్తబ్ధతతో తులతూగుతున్నది నీవే. నీతో యెదో చెప్పబోయాను. మాటలు యేమయిపోయాయి? ఆకాశం నుంచి వర్షంపడుతోంది. నేను కూర్చుని 'నాకు మాటలు ప్రసాదించు, మాటలు ప్రసాదించు' అని జపించాను."

ఓ యేమిటిది?
నిగూఢ అస్వాధీన ఆనందం!

నే నెరింగిం దే! కాని
ఊపిరిలా సామాన్యంగా
మందహాసంలా సరళంగా
భూమికంటె పురాతనంగా
గోచరించును నాకు.

"యితరుల మాటలను నా మాటలుగా చేసుకోవటమే నా వృత్తి నాకే గనక వాగ్గేయకారుని శక్తివుంటే విద్యాపతి రచించిన వర్ష గీతానికి సంగీతం కూర్చి పూర్తిగా నాది చేసుకునేవాడిని."

ప్రభువు లేక రాత్రింబవలు
గడిపేదెలా? అంటున్నాడు విద్యాపతి.

"ఎవరు హాజరులో లేకుంటే జీవించడం అసాధ్యమో అతను లేకుంటే రోజులు గడిచేదెలా? యీ మాటలకు సరయిన సంగీతం యెక్కడినుంచి వస్తుంది? కళ్ళు పైకెత్తి ఒకసారి మాటలకోసం, ఒకసారి సంగీతంకోసం ప్రార్థిస్తాను. మాటలతో సంగీతంతో భగవానుడు కిందికి దిగుతాడు. కాని తోవలో యింకెవరికో బహుశా నీ రవీంద్రనాథ టాగోరు వాటిని అందిస్తాడు."

లావణ్య నవ్వింది. "రవీంద్రుని అభిమానించేవారు కూడా నీలా మాటిమాటికీ అతనిని ప్రస్తావించరు."

"వన్యా! యీ రోజు నేను అతిగా వాగుతున్నాను గదూ. నాలో నేడు వాగుడు వానగాలి పెళపెళలాడుతోంది. వాతావరణ సూచికలను నువ్వు పరికిస్తే నా విపరీత చాంచల్యానికి వణికిపోయేదానివి. మనం కలకత్తాలో వుండి వుంటే

నిన్ను మోటారుకారులో తిన్నగా మొరాదాబాద్ పరుగె త్తించేవాడిని. దానిలో టైర్లు ఎన్ని బద్దలయితేనేం? మొరా దాబాద్ యెందుకు అని అడిగితే కారణం చెప్పలేను. వరద వురుముతూ మహావేగంతో వచ్చిపడి నురుగులాగా నవ్వుతూ కాలమును తన వెంట వూడ్చుకుపోతుంది ''

ఇంతలో యోగమాయ బుట్టెడు పొద్దుతిరుగుడు పూలవతోచ్చి, "అమ్మాయి, లావణ్యా! యీ రోజున యీ పూలతో యితనిని పూజించు," అంది. మనోభావానికి క్రియా రూపమిచ్చే స్త్రీ యత్నమే ఇది క్రియా రూపం మీాది ఈ మోజు స్త్రీల రక్తమాంసాలలోనే ఉంది.

అమిత తగు సమయం చూసుకుని లావణ్యా చెవిలో, "వన్యా! నీకు వుంగరం తేవాలి," అన్నాడు.

"మితా! యెందుకు? అవసరమా?"

"యీ నీ చేతిని నా చేతిమీాదవుంచి నేను వూహించ గలిగిన దానికంటె యెక్కువే ప్రసాదించావు. ప్రియురాలి ముఖాన్ని మాత్రమే కవులు వర్ణించారు కాని చేతిలో యెంత సూచనా సంపద వుంది! ప్రేమలోని ప్రీతి, భక్తి, సౌకుమార్యం, అనిర్వచనీయ కాంక్ష చేతిలో వున్నాయి. నా హృదయంలోని చిన్నమాటలాగా వుంగరం నీ వేలిని చుట్టివుంటుంది. యింతే ప్రియా! యీ నాచిన్నమాట సువర్ణ భాషలో మాణిక్యభాషలో నీచేతిని అంటిపెట్టుకుని వుండనీ!"

"సరే మీా యిష్టం ''

"కలకత్తానుంచి తెప్పిస్తా. నీకే రాయి అంటే యిష్టమో చెప్పు."

"రాయి వద్దు ముత్యాం సరిపోతుంది"
"బలే! నాకూ ముత్యమంటే యిష్టమే."

# ప్రేమ తత్వము

మార్గశిరమాసంలో వివాహం జరిపించడానికి, అవసరమయిన ఏర్పాట్లు చేయడానికి ముందుగా యోగమాయ కలకత్తా వెళ్ళడానికి నిశ్చయమయింది.

లావణ్యా అమితతో, "మీరు ఎప్పుడో కలకత్తాకు తిరిగి వెళ్ళవలసింది. యిపుడు అనుమానాలు తీరి మీకు స్వేచ్ఛ లభించింది గనక యిక మీరు ఏమాత్రం సందేహించకుండ వెళ్ళవచ్చు. వివాహానికి ముందు మనం కలుసుకోరాదు," అంది.

"ఎందుకింత కఠిన శిక్ష?"

"మొన్న మీరు నిరాండంబర సౌఖ్యం గురించి మాట్లాడారు. ఆ నిరాండంబరతను కాపాడడానికి"

"ఇవి మహావిజ్ఞాని మాట్లాడేమాటలు. నువు కవయిత్రివని మొన్న అనుమానించాను. యివాళ నువు తత్వవేత్తవని అనుమానిస్తున్నాను. బలేగొప్పగా చెప్పావు. సహజ నిరాండంబర సౌఖ్యం కాపాడడానికి కాఠిన్యం వహించవలసి వుంటుంది. సౌఖ్యం, నిరాడంబరలయలు రెండూ కావాలంటే సరియైన స్థలాలలో జాగా యివ్వడానికి కష్టపడాలి. అత్యాశమూలంగా జీవిత కావ్యంలో సంయమనం అవలంబించడానికి సిగ్గుతో కొట్టుకుంటాను. లయ తప్పుతుంది. జీవితం అశ్రావ్య

బంధనంగా తయారవుతుంది. సరే. రేపు సంపదతో పొంగి పొరలే యీ రోజులను ఛేదించుకుని వెళతాను మేఘనాధ కధ కావ్యంలో ఉలికిపడేటట్టు చేసి అకాలంలో అడ్డగించి నిలిపే యీ గీతంలాగా—

యమలోకానికి అకాలంలో
యేగినప్పుడు—

"నేను షిల్లాంగును వదలి వెళ్ళినా మార్గశిరమాసం పంచాంగంనుంచి పరారీ కాలేదు. కలత్తాలో నేనేం చేస్తానో వూహించగలవా?"

"యేంచేస్తారు?"

"వివాహపు యేర్పాట్లలో పిన్ని మునిగివుండగా నేను వివాహాంతర యేర్పాట్లలో మునిగివుంటాను. వైవాహిక జీవితంకూడా ఒక కళ అని ప్రజలు మరిచేపోయారు. ప్రతి రోజులోనూ నూతనత్వం పొడగట్టాలి. వన్యా! రఘువంశంలో యిందుమతిని అజమహారాజు వర్ణించిన తీరు జ్ఞాపకంవుందా? 'ప్రియశిష్యా లలితే కళావిధే'!"

"యీ లలితకళ వైవాహిక జీవితానికి సంబంధించింది. అనాగరీకులు వివాహ సంయోగాలను అభిన్నంగా భావిస్తారు. అందువల్ల యిద్దరినిజసంయోగాల్ని వివాహానంతరం నిర్లక్ష్యం చేస్తారు."

"నీ దృష్టిలో సంయోగకళ అంటే యేమిటో విశదీకరించి చెప్పు. నేను మీకు శిష్యురాలిని కావాలనుకుంటే యివాళనే మొదటిపాఠం ప్రారంభిద్దాం."

అలా అయితే సరేవిను నిర్నిబంధంగా సంయమనాన్ని అవలంబించి కవి ఛందస్సును సృష్టిస్తాడు. అలాగే నిర్నిబంధంగా సంయమనాన్ని అవలంభించి సంయోగాన్ని రమణీయం చేసుకోవచ్చు. అలాగే ననుకోవడం అమూల్యమైనదానిని చౌకపర్చడం తనను తాను మోసగించుకోవడం. యెక్కువ ధర పెట్టడంలో యెక్కువ ఆనందం వుంటుంది ”

“ధర యెలా కడుతావో చెప్పు వింటాను.”

“కాస్త ఆగు నామనసుని చిత్రాన్ని ముందుగా తెలపనీ. డయిమెంటు హార్బరు సమీపంలో గంగానదీతీరం, రెండు గంటలలో కలకత్తాకు తీసుకుపోగల చిన్న పొగ ఓడ.”

“యిక్కడ కలకత్తా ప్రసక్తి యెందుకు?“

“ప్రస్తుతం కలకత్తా నా జీవితంలో ప్రముఖపాత్ర వహించదని నీకూ తెలుసు. నిజంగా నేను బార్ లైబ్రరీకి వెళతాను. వృత్తిపనిమీద కాదు. చదరంగం ఆడుకోవగానికి. నాకు పని చేయవలసిన అవసరం లేదుకాబట్టి నామనసు దాని మీద వుండదని న్యాయవాదులకు తెలుసు. అందుకని సామరస్యంగా పరిష్కారమయే చిన్న కేసులు నాకు యిస్తుంటారు. కాని వివాహానంతరం పనిచేయడమంటే యేవిటో జీవనోపాధి కోసంగాక జీవితంకొరకేనని వారికి చూపుతాను. మామిడి టెంక తియ్యగా వుండదు, మెత్తగా వుండదు. తినతగినదీ కాదు. కాని దాని గట్టితనమే మామిడికి ఆధారం, రూపానికి పునాది ఈ టెంకలాగా కలకత్తా కాఠిన్యం అవసరం. యెందుకో తెలుసా? గట్టిటెంకను తీయదనంలో వుంచడానికి.”

"అర్థమయింది. నాకూ అది అవసరమని. నేను కలకత్తాకు వెళ్ళి వుదయం 10 గంటలనుంచి సాయంకాలం 5 గంటలవరకు—"

"యెందుకు వెళ్ళకూడదు? దిమ్మరిగా తిరగడానికి పని చేయడానికి."

"యెలాంటి పని? జీతం బత్యం లేనిదా?"

"అబ్బే! జీతం భత్యంలేనిపని పనీకాదు, ఆనందమూ కాదు. వట్టి ప్రహసనం. నీకిష్టమయితే మహిళా కళాశాలలో ప్రొఫెసరుగా పనిచేయవచ్చు."

"సరే, నాకిష్టమే. యింకా?"

"నేను స్పష్టంగా చూడగలుగుతున్నాను. గంగానదీ తీరం, కిందనుంచి పురాతన వటవృక్షం పెరిగివుంది. దాని వూడలు అనేకం కిందికి దిగాయి. ధనపతి సింహళానికి గంగానదిమీద ప్రయాణం చేస్తూ, ఈ చెట్టుకే లంగరువేసి పడవను నిలిపి దీనినీడలోనే వంటచేసుకుని వుంటాడు. దాని కుడివేపున రాళ్ళు పరచినఘట్టం. ఘట్టం శిథిలమయి బీటలు వారి నాచుతో నిండిపోయింది. ఆ ఘట్టంలోనే మన ఆకుపచ్చ, తెలుపురంగు చిన్ననావ. దాని నీలిపతాకంమీద తెల్లరంగులో పేరు. దానికి నువ్వు పేరుపెట్టడం మంచిది!"

"సరే. పేరుచెప్పనా? మైత్రి!"

"సరయినపేరు- మైత్రి! సాగరి అని పేరుపెడదామని తలపోశాను. ఆ పేరుకు గర్వించాను. కాని నువ్వుపెట్టిన పేరే బాగుంది. తోటగుండా చిన్నయేరు ఒకటి ప్రవహిస్తోంది.

అది గంగానది హృదయ స్పందనం దానికి అవతలవేపున నీ నివాసం. యివతల నా నివాసం."

"మీరు ప్రతిరోజూ యీదుకురావాలా? నేను నా యింటికి కిటికీలో దీపం వెలిగించి వుంచాలా?"

"మనం కొయ్యవంతెన దాటుతూ మనసులోనే యీదుదాం. నీ నివాసం పేరు మానసి. యిక నా నివాసానికి నువ్వు పేరుపెట్టాలి."

"దీపక్!"

"బలే బాగుంది యీపేరుకు తగినట్లుగా నా యింటి కొప్పుమీద దీపం పెడతాను మన సంయోగంనాటిసాయం కాలం అక్కడ యెర్రదీపం వెలుగుతుంది వియోగంనాటి రాత్రి నీలిదీపం. కలకత్తానుంచి తిరిగి వచ్చిన తరవాత ప్రతి రోజూ నీ వుత్తరంకోసం యెదురు చూస్తూంటాను వుత్తరం రావచ్చు, రాకపోవచ్చు. రాత్రి యెనిమిది గంటలలోపున రాకపోతే నాదురదృష్టాన్ని తిట్టుకుంటూ బెర్ట్రాండ్‌రస్సెల్ వ్రాసిన తర్కశాస్త్రం చదవడానికి యత్నిస్తాను. ఆహ్వానించనిదే నేను నీ యింటికి రాకూడదని మన నియమం."

"మరి నేను నీ యింటికి రావచ్చా?"

"ఆ నియమమే నువ్వు పాటించడం మంచిది. అయినప్పటికీ ఎప్పుడయినా నియమోల్లంఘన అప్రియం కాదు."

"వుల్లంఘనే నియమం కాకపోతే నీ యిల్లు యెంత తారుమారవుతుందో! కాస్త ఆలోచించు. నేను బురఖా వేసుకుని రావలసి వస్తుంది."

"నీ యిష్టం కాని ఆహ్వానపత్రిక అవసరం. అందులో యేదో ఒక కవితలోనివి ఒకటి రెండు పంక్తులుతప్ప మరేమీ వుండకూడదు."

"ఆహ్వానం లేకపోతే బయటకు పోవలసిందేనా?"

"నెలకొకనారి పధ్నాలుగురోజుల చంద్రకళల ఖండ రమణీయత సంపూర్ణత చెందిన పూర్ణిమనాడు నీకు ఆహ్వానం అందుతుంది."

"నీ ప్రియశిష్యురాలకి నీ వుత్తరం మచ్చు వినిపించ రాదూ?"

"సరే, అలాగే,"

జేబులోనుంచి నోటుపుస్తకం తీసి దానిలోనిది ఒక పుటచింపి,

"నా ప్రియురాలువచ్చి
నను పిలిచేవేళ
దక్షిణ సముద్ర పవనమా
మెలమెల్లగా వీచుము"

లావణ్య ఆ కాగితం తీసుకుని తిరిగి యివ్వలేదు

"యిక నీమచ్చు వుత్తరం రాయి. నీచదువు ఎంతవరకు వచ్చిందో చూదాం" అన్నాడు అమిత

లావణ్య ఒక కాగితం ముక్కమీద వ్రాయబోయింది. కాని అమిత అంగీకరించక "ఊహు యీ నానోటుపుస్తకంలో రాయాలి" అన్నాడు.

లావణ్య సంస్కృతంలో జయదేవుని గీతాన్ని అనుకరిస్తూ,

"మిత్రా! నువే నా జీవితానివి
నువే నా ఆభరణానివి
నువే నా జీవితసాగర
రత్నానివి!" అని వ్రాసింది.

నోటుపుస్తకం తిరిగి జేబులో పెట్టుకుంటూ అమిత "నేను స్త్రీమాటలను నీవు పురుషుని మాటలను అనుకరించడం ఆశ్చర్యంగానే వుంది అందులో అసంగతమేమీలేదు. కాలే దుంగ సీముచెట్టుదయినా వకుళ చెట్టుదయినా జ్వాల ఒకవిధం గానే కనిపిస్తుంది."

"ఆహ్వానాలు యిచ్చి పుచ్చుకోవడ మయింది. యింకా?"

"సంధ్యాతార వుదయిస్తుంది. గంగానది పొంగి పొరలుతుంది సరుగుడు చెట్లు వరసలో గాలి గానం చేస్తుంది. పెన వేసుకున్న మర్రిచెట్టు వేళ్ళకు గంగాజలంవచ్చి తాకుతుంది. నీ యింటివెనక తామరకొలను. నిర్జనంగా ప్రత్యేకంగాఉన్న ఘట్టంలో నువు స్నానంచేసి తల దువ్వుకున్నావు. రోజుకో రంగు చీర ధరిస్తావు. యీ సాయంకాలం యేరంగు చీర ధరిస్తావా అని నేను వచ్చినపుడు యోచిస్తూంటాను. సంకేతస్థలం కూడా మారుతూంటుంది. ఒక రోజున చంపక వృక్షంకింది వేదిక, యింకోరోజున డాబామీద, మరో రోజున గంగానది ఒడ్డుమీది డాబా. నేను గంగానదిలో స్నానంచేసి తెల్లని రవసెల్లా ధోవతికట్టి, ఉత్తరీయం వేసుకుని, యేనుగదంతపు పావకోళ్ళు తొడుగుకొని యిలా వచ్చేసరికి నువు తివాసీమీద కూర్చుని వుంటావు. నీముందు వెండి పళ్ళెంలో బరువయిన

పూలమాల, చిన్న గిన్నెలో గంధం వుంటాయి. ఒకమూల ధూపం, దసరా శెలవులకు కనీసం రెండు నెలలయినా విదేశాలలోని వివిధ ప్రదేశాలలో తిరిగి రావాలి. నువు పర్వత ప్రాంతానికి వెళితే, నేను సముద్రప్రాంతానికి వెళతాను. ఈ మన కుటుంబ దురాజ్య నియమావళిని నీముందు పెడుతున్నాను వీటిని నువేమంటావు?''

"వాటిని పాటించడానికి అంగీకరిస్తున్నాను."

''పాటించడానికి అంగీకరించడానికి తేడావుంది, వన్య."

"నాకు అనావశ్యకమయినా నీకు ఆవశ్యకమయిన దానికి దేనికీ అడ్డుచెప్పను."

"నీకు అనావశ్యకమా?"

"అవును. నువు యెంత దగ్గరగావున్నా నువింకా నిజానికి దూరంగానే వున్నావు ఆ దూరాన్ని స్థిరంగా వుంచడానికి నేను యీ నియమావళిని ఆశ్రయించడం అనావశ్యకం. నీ వికటదృష్టికి నేను సిగ్గుతో జేవురించకుండా వుండలేనని నాకు తెలుసు దీనివల్ల నాకు సంబంధించినంత వరకు కుటుంబజీవితాన్ని, యెదురుబదురు రెండు వేరు వేరు నివాసాలగా విభజన కావడం ప్రమాదకరంకాదు."

కుర్చీలోనుంచి దగ్గునలేచి అమిత, "నీ చేతిలో వోడిపోతాననుకున్నావా వన్యా? తోటాగీటా లేదు. కలకత్తానుంచి బయటకు ఒక అడుగయినా పెట్టం. నెలకు డబ్బయి అయిదు రూపాయల అద్దెమీద నిరంజన్ ఆఫీసుమీద భాగంతీసుకుని మనిద్దరమూ అందులోనే నివసిద్దాం. హృదయ సీమలో దూరం దగ్గిరా అంటూ లేదు. అయిదు అడుగుల వెడల్పు

మంచానికి యెడమ పక్కన నీవిభాగం 'మానసి', కుడిపక్కన నావిభాగం 'దీపక్'. గదికి తూర్పువేపున అద్దాల అలమారా. దాని అద్దంలో మనిద్దరి ముఖాలూ ప్రతిఫలిస్తాయి. పడమటి వేపున పుస్తకాల బీరువా. దాని వెనకభాగం యొాడను లోప లికి రానీయకుండా అడ్డం వుంటుంది. ముందు యిద్దరు పాఠకు లకు కావలన గ్రంథాలయం. ఉత్తరపువేపున ఒక సోఫా. ఒక కొసన నేను కూర్చుని యెడమవేపున నీకు చోటువుంచుతాను. కొద్ది అడుగుల దూరంలో బట్టల బీరువా వెనక నువ్వు నిలబడ తావు. వణికే చేతులతో ఆహ్వాన పత్రికను పైకెత్తి పట్టుకుం టాను. దానిమీాద యిలా వ్రాసివుంటుంది:

దక్షిణ సుగంధపవనమా
నామిద్దెపై వీచుము మెల మెల్లగా
నాప్రియురాలు వచ్చినవేళ
మా నాలుగుకనులు కలిసినవేళ"

"శ్రావ్యంగాలేదా వన్యా?"

"శ్రావ్యంగానే వుంది. యీా గీతం యెక్కడనుంచి సంపాదించావు?"

"నా స్నేహితుడు నీలమాధవ్ వ్రాత ప్రతిలోనిది. వధువు యింకా నిర్ణయం కానేలేదు. అయినా ఆవేశంతో ఇంగ్లీషు పద్యాన్ని కలకత్తామూసలోవేసి పునస్సృష్టించాడు. అందులో నేనూ చేయి కలిపాను. అర్థశాస్త్రంలో యం. ఎ. పట్టంపుచ్చుకుని పదిహేనువేల రూపాయల నగదు కట్నం, యెనభయి తులాల ఆభరణాలు పుచ్చుకుని వివాహంచేసుకుని కొత్త పెళ్ళికూతురిని యింటికి తీసుకువచ్చాడు. దక్షిణపవన

సుగంధాన్ని, నాలుగుకళ్ళ కలయికను అనుభవించాడు. యిక ఆపద్యంతో అతనికి అవసరం లేకపోయింది. యిప్పుడు ఆపద్యం కాపతు యాజమాన్య హక్కులో భాగస్వామికి దఖలు పర్చడానికి అతనికేం అభ్యంతరం లేదు."

"దక్షిణ పవనం నీ మిద్దెమీదకూడా వీస్తుంది. నేనూ తన వధువు యెల్లకాలం నూతన వధువుగానే వుంటుందా?"

మేజామీద గట్టిగాకొట్టి అమిత బిగ్గరగా, "ఆఁ వుంటుంది, వుంటుంది, వుంటుంది," అని అరిచాడు.

"యేం వుంటుంది?" అని అడిగింది యోగమాయ పక్కగదిలోనుంచి తొందరగా వస్తూ. "నామేజా కాదుగా!"

"వుండతగింది వుంటుంది. నిత్యనూతన వధువు దుర్లభం. భగవంతుని దయవల్ల నూటికొకతె లభించితే ఆమె యెల్లకాలం వధువుగానే ఉంటుంది."

"ఉదాహరణ చెప్పు."

"యెదో ఒకరోజున చూపిస్తాను."

"చాలా కాలం పడుతుంది. యింతలోవచ్చి భోజనం చేయండి."

## ఆఖరిసాయంత్రం

భోజనాలు పూర్తికాగానే అమిత "పిన్నీ! రేపు కలకత్తాకు బయలు దేరుతున్నాను నా బంధువర్గం నేను మారిపోయానని అనుమానిస్తాను," అన్నాడు.

"నువ్వు తేలికగా మారిపోతావని నీ బంధువర్గానికి తెలుసా?"

"ఆఁ బాగా తెలుసు. లేకపోతే బంధువర్గమెందుకు? కాని అంతమాత్రాన నేను క్షణంలో వేషం మార్చుకునే కళాకారుడిననిగాని తేలికగా మారిపోతానని రుజువుకాదు. ఈ రోజున నాకు సంభవించింది మార్పు మాత్రమే కాదు. యుగ సమాప్తిని సూచించే మహా పరివర్తన. నూతనసృష్టికి నాలో ప్రజాపతి మేల్కొన్నాడు, పిన్నీ! యివాళ లావణ్యను బయటకు తీసుకు వెళ్ళనీ ఇద్దరం కలసి ఆఖరిసారిగా పిల్లాంగు కొండలకు నమస్కరించి వస్తాం."

"పిన్ని అనుమతించింది. ఇద్దరుబయలు దేరీ బయలుదేరగానేచేయిచేయి కలిశాయి. శరీరం శరీరానికి దగ్గరగా చేరింది. నిర్జన మార్గం అంచుకింద దట్టమయిన అడవివుంది ఆ అడవిలో ఒక ఖాళీస్థలం ఉంది. అక్కడ ఆకాశం పర్వతబంధనం నుంచి తప్పించుకుని అస్తమయ సూర్యశోభను రెండు చేతులలోను నింపుకున్నది. అక్కడ వారిద్దరూ పశ్చిమాభిముఖంగా నిలబడ్డారు. అమిత లావణ్య తలను తన వక్షస్థలం మీదకి తీసుకుని ముఖం పైకెత్తాడు. ఆమె కళ్ళు సగం మూసుకుని ఉన్నాయి. కంటికొనలనుంచి కన్నీటిబొట్లు జారుతున్నాయి. ఆకాశపు బంగారువన్నె కరిగించిన మరకతమాణిక్య వన్నెతో కలిసిపోతోంది. పలచని మబ్బుల మధ్య ఖాళీలో సుగభీర నిర్మల నీలిమ గోచరిస్తోంది. భౌతిక శరీరం లేకుండా కేవలం ఆనందంతో నిండిన దేవలోకానికి చెందిన అవ్యక్తగానం ఆ నీలిమలోనుంచి ప్రవహిస్తున్నట్టుతోస్తోంది. క్రమంగా చీకటి

పడింది ఆ కారు చీకటిలో శూన్యాకాశం రంగు రంగుల రేకలు ముడుచుకున్న పుష్పంలా కనిపించింది.

"యిక వెళ్ళిపోదాం," అంది లావణ్య అమిత వక్షస్థలంమీద తల ఆనించికుంచి మృదుస్వరంతో. ఆ దృశ్యం అక్కడ అలా అంతంకావడమే యుక్తమని ఆమెభావించింది. అమిత ఆమె భావం గ్రహించి మాటాడలేదు. లావణ్య ముఖము ప్రేమతో ఆలింగనం చేసుకుని మెలమెల్లగా వెనకడుగులు వేశాడు.

"నేను రేపు ఉదయం పెందరాడే వెళ్ళాలి. వెళ్ళే ముందు తిరిగి నిను కలుసుకోను."

"యెందుకని?"

"మన జీవితంలో షిల్లాంగు అధ్యాయం సరయిన స్థలంలోనే ముగిసింది. ఇక్కడ ప్రథమాశ్వాసం మన స్వర్గానికి నాంది సమాప్తి."

లావణ్య ఏమీ అనలేదు. అమిత చేతిలో తన చేయి కలిపి, ఆనందంతో నడుస్తోంది. కాని ఆమె మనసులో కన్నీటి భారం ఆనందంతో సమ్మిశ్రిత మయింది. అనూహ్యమయినది. ఇంత సన్నిహితంగా ఎన్నటికీ రాదని భావించింది. ఒక మహోన్నత క్షణంలో శుభదృష్టి వచ్చింది. కాని శుభదృష్టి ననుసరించి శోభన నిశి రాదు. కేవల సంయోగ వియోగ అంతిమ నమస్కృతి మాత్రమే! అక్కడికక్కడే అమితకు నమస్కరించి, "నేను ధన్యను," అని చెప్పాలనే కాంక్ష ప్రబలింది. కాని ఎందుకనో మాటలు వెగిలి బయటకు రాలేదు.

ఇంటిని సమీపించగానే అమిత, "వన్య! నీ ఆఖరి మాట కవితలో చెప్పు, జ్ఞాపకం పెట్టుకోవడం తేలిక నీకు ఏది జ్ఞాపకంవస్తే అదే," అన్నాడు.

లావణ్య ఒకక్షణం ఆలోచించి,

"నీకు సౌఖ్యం నే కొనిరాలేదు
స్వాతంత్ర్యకానుకే విడిచిపుచ్చితి
సుప్రకాశ నిశాంతమందు
యిక మిగిలేదేమీ లేదు
ప్రార్థనలేదు, క్షణక్షణ దైన్యరాశిలేదు
అహంకృతి లేదు, జాలిగొల్పెడి రోదన లేదు
సగర్వహాసం లేదు, వెనకచూపులేదు
నేడు నా మహా విధ్వంసనంతో
నింపితి స్వాతంత్ర్య నైవేద్యం" అని చదివింది.

"వన్య! మహాదారుణం యిటువంటి రోజున చెప్పవలసిందేనా? ఇదే ఎందుకు చదివావు? వెనువెంటనే యీకవితను ఉపసంహరించుకో."

"దేనికింత భయం మితా! అగ్ని శుద్ధ ప్రేమ సౌఖ్యాన్ని కోరదు. స్వాతంత్ర్యం పొంది, స్వాతంత్ర్యం ప్రసాదిస్తుంది. తనవెంట అలసటను కొనిరాదు, విసుగుదలను కొనిరాదు. యింతకంటె మంచి కానుక యింకేముంటుంది?"

"కాని యీ గీతం ఎందులోదో తెలుసుకోవాలని ఉంది."

"రవీంద్రనాథ టాగోరు కవితలోది."

"ఆయన గ్రంథాలలో దేనిలోనూ కనిపించదే?"

"యింకా గ్రంథరూపంలో ప్రకటితం కాలేదు."

"అయితే నీకెలా లభించింది?"

"మా నాన్నను గురువుగా భావించుకుని కొలిచే కుర్ర వాడొకతనున్నాడు మా నాన్ననుంచే అతని మెదడుకు మేత లభించేది కాని అతని మనసులోని ఆకలి రవీంద్రనాథ దగ్గరకు పరిగెత్తించేది. టాగోరు వ్రాత ప్రతిలోనుంచి గుప్పెడు భిక్ష తెచ్చుకునేవాడు."

"అలా తెచ్చి నీపాదాలవద్ద సమర్పించాడు అంతేనా?"

"కాని సాహసం లోపించింది. నాదృష్టిలో నాచేతిలో పడే స్థలంలో వదలి వెళ్ళేవాడు."

"అతనిమీద దయ చూపేదానివా?"

"అవకాశం రాలేదు. భగవంతుడు అతనిమీద దయ చూపాలని మనసులో ప్రార్థిస్తుంటాను."

"ఈ రోజున నువ్వు చదివిన గీతం ఆ అభాగ్య హృదయ స్వరమని అర్థమవుతోంది."

"అవును."

"యివాళ అదెందుకు జ్ఞాపకం వచ్చింది?"

"నేనేం చెప్పగలను? యింకో గీతం కూడా యివాళ మాటిమాటికీ జ్ఞాపకం వస్తోంది యెందుకో నాకే అర్థం కావడం లేదు"

"మనోహర! కనులనింప
గొని తెచ్చితిని భాష్పతతి
నీ హృదిలో భరించితివి

భరించరాని హోమాగ్ని
ఆ అగ్నిలో జ్వలించును దుఃఖం
సమ్మోహిత హృదయ మంత్ర బంధనం
వినావికలగును
వియోగ శతపత్రం ప్రేమలో
వికసించును సంపూర్ణముగా."

"వన్యా! ఆ కుర్రవాడు యీ రోజునే మనిద్దరి మధ్యా యెందుకు రావాలి? యిది ఈర్ష్య కాదు. యీర్ష్యను నేను అసహ్యించుకుంటాను. అయినా ఎదో భయం నా మనసును ఆవరించింది. అతను నీ కిచ్చిన గీతాలు యీ రోజునే యెందుకు జ్ఞాపకం చేసుకున్నావో చెప్పు?"

"అతను ఆఖరిసారిగా మా యిల్లువదలి వెళ్ళినతరవాత ఒక రోజున అతను కూర్చునివ్రాసుకునే మేజాసొరుగులో ఈ గీతాలు దొరికాయి. యివిగాక రవీంద్రుని గీతాలు, ఒక పుస్తకానికి సరిపోయేవి, యింకా కొన్ని లభించాయి నీకు నేను వీడ్కోలు యిస్తున్నా కాబట్టి యీ వీడ్కోలు గీతాలు స్ఫురణకు వచ్చివుంటాయి."

"యీ వీడ్కోలుతో ఆ వీడ్కోలు పోల్చవచ్చా?"

"నేనేం చెప్పను? యెందుకీ చర్చ? యీ గీతాలు నా కిష్టం. అందుకనే నీకు వినిపించాను. యింకే కారణం లేదు."

"రవీంద్రుని గీతాలు లోకం పూర్తిగా మరిచే పోతేనే గాని అతని వాస్తవ రచనలు ప్రస్ఫుటంకావు. అందుకే అతని గీతాలు నే నెన్నడూ వుపయోగించను. మందిమెచ్చుకోవడం

ఆకాశ కాంతిని పొగమంచు తడిచేతితో మలినం చేయడం లాంటిదే."

"మిత్రా! చూడు. స్త్రీ తాను కోరిన వస్తువును భద్రంగా వక్షంలో దాచుకుంటుంది. పదిమందితో దానిని గురించి చర్చించదు. యివ్వగలిగినదంతా యిస్తుంది. బజారులో బేరం చేయదు."

"అలా అయితే నాకూ ఆశవుంది, వన్య! బజారులో నా విలువను తెలిపే చీటీని దాచివేసి, నువ్వు మదింపు చేసిన వెల చీటితో తిరుగుతూంటాను."

"యింటిదగ్గరకు వచ్చేస్తున్నాం. నీ పథాంతగీతం నీ నోట వినాలని వుంది, వినిపించు."

"టాగోరు కవిత చదవకపోతే చెడ్డగా తలచకేం!"

"చెడ్డగా యెందుకు తలచాలి?"

"నే నొక కవిని కనిపెట్టాను. అతని శైలి–"

"మనం కలుసుకున్న దగ్గరనుంచి అతనిని గురించి యెడతెగకుండా నువ్వు చెప్తూనే వున్నావు. నేను వింటూనే వున్నాను. అతని పుస్తకాలకోసం కలకత్తాకు రాశాను."

"భేష్! అతని పుస్తకాలు! అతనిలో దోషాలు చాలా ఉన్నాయి. కాని పుస్తకాల ప్రచురణ దోషం మాత్రం లేదు. నాద్వారాఅతనిని గురించి క్రమక్రమంగా తెలుసుకో గలుగుతావు. లేకపోతే—"

"మరేం భయపడకు మిత్రా! నువ్వు మెచ్చుకున్నంతగా నేను మెచ్చుకునేటట్టు తయారవుతానని నమ్ముతున్నాను. యెక్కువ లాభంనాకే!"

"యెలా?"

"నా అభిరుచిద్వారా నేను పొందేలాభంనాదే నీ అభిరుచి ద్వారా పొందేలాభం కూడా నాదే. రెండు మనసుల తోనూ స్వీకరించే శక్తి నాది. యిద్దరు కవుల రచనలను కలకత్తాలోని నీ చిన్నగదిలోని బీరువాలో వుంచగలుగుతాను. యిక నీ గీతం చదువు."

"యిప్పుడు చదవాలని మనసుగా లేదు. తర్క ప్రతి తర్క విష్కంభంతో వాతావరణం పాడయిపోతుంది."

"మరేం పాడుకాలేదు. వాతావరణం బాగానేవుంది."

చేతివేళ్ళతో జుట్టు దువ్వుకుని, అమిత అత్యంత వేదనా స్వరంతో ప్రారంభించాడు

"సుందరీ! సుదూర శైల శిఖరాంత
ఉదయ తారవు నువే!
శర్వరి శేషించినా గోచరింతువు
దారితప్పిన దిమ్మరికి"

"అర్థమయిందావన్నా! రాత్రి తనకు తోడుగా వుండ వలసిందని చంద్రుడు సాంధ్య తారను పిలుస్తున్నాడు. నిశి మీది ప్రేమ నశించింది:

"భూమ్యాకాశాలు కలిసే చోటకు
నేను అర్ధజాగరణ చంద్రుడ.
అగుపెంతు అంధకార వక్షంమీది
మసక మసకలాడే గాయంలాగా.

"యిది అర్ధజాగరణ. దాని పాక్షిక కాంతి అంధ కారంలోని బాట దుఃఖం. స్వల్పతాజాలంలో చిక్కుపడింది.

జాలం తెంచుకుబయటపడే పోరాటంలో నిద్రలోలాగా పలవ
రిస్తోంది. యెటువంటి కల్పన! బలే!

నిద్రాపారవశ్య మహాశూన్యంలో
పరచిరి నా ఆసనం
స్వప్నసీమలో మీ౯ెద హృదయ తంత్రి
పరవశతను సున్నితంగా స్పందిస్తూ

"కాని అటువంటి స్వల్ప అస్థిత్వ భారం అధికమే. యెండిపోతున్న నది మందగొడిగా ప్రవహిస్తూ చెత్తాచెదారం పోగుచేస్తుంది. స్వల్పమయినది కష్టాన్నే పోగుచేసుకుంటుంది అందుకే.

"గమ్యస్థానానికి చేరుకుందు
మెలమెల్లగా అడుగులువేసుకుంటు
సారెసారెకు గొంతు అలసిపోవు
తనువు జడమయిపోవు.

"యీ అలసటే అంతమా? సడలిన వీణా తంత్రులను మేళవించే ఆశ లేకపోలేదు. దిఙ్మండలం అవతల యెక్కడ నుంచో యెవరివో పాదధ్వనులు వినిపిస్తున్నట్టు అనిపిస్తుంది

"సుందరీ! ఉదయతారా!
త్వరితగతిని రమ్మ
నిశ అంతము కాకముందే
స్వప్నంలో పోగొట్టుకున్న గానం
జాగరణలో విని ఆనందింతు

"విముక్తి కలుగుతుందని ఆశ. జాగృత విశ్వ అనంత కలరవం వినిపిస్తోంది మహాపథదూత చేతిలో దీపిక పట్టుకుని రాబోతున్నాడు.

"నిశీథాంధకారనుంచి
పైకెత్తిపట్టి దానిని
అరుణ ప్రభాతంలో యుంచుము
చీకటిలో మైమరపు
వెలుగులో ధన్యను గావించుము
నిద్రా నిశ్శబ్దత విశ్వాలయులో
లీనమగుచోట
అర్ధ జాగృత చంద్రుడ నేను
నా వీణను ఇచ్చివేతు

"ఆ అభాగ్య చంద్రుడను నేనే. రేపువుదయం పెందలకడనే నేను వెళ్ళిపోతాను. కాని నా నిర్గమన శూన్యానికి సుందర వుదయతార తన మేలుకొలుపు గీతాలతో విమోచనం ప్రసాదించాలని కోరుకొంటున్నాను. జీవితాంధ స్వప్నంలో అస్పష్టతకు సుందర ఉదయతార కాంతిలో సంపూర్ణత పునరుద్ధరించాలి. యీ గీతంలో ఆశ అమితంగా వుంది. భావి ప్రభాత వుజ్వల గౌరవం వుంది. నీ రవీంద్రుని గీతాలలోని నిరాశా ప్రలాపన మాత్రం లేదు."

"యెందుకు, మితా! యింతకోపం! రవీంద్రుడు ఇప్పటి కంటె మించిపోలేదని మాటిమాటికీ అని ప్రయోజనమేమిటి!"

"మీరంతా కలసి కుట్రపన్నారు. అతని కవితలో వున్నదానికంటె —"

"అలా అనకు, మిత్రా! నా అభిరుచి నాది. నీ అభిరుచితో, యితరుల అభిరుచితో నా అభిరుచి సరిపడకపోతే అది నా తప్పా? నెలకు డబ్బయి అయిదు రూపాయల అద్దె భాగంలో నాకు స్థానం లభిస్తే నీ కవి రచనలను నాకు చదివి వినిపించవచ్చు నేను మాత్రం నా కవి రచనలతో నిన్ను పీడించనని మాట యిస్తున్నాను."

"అన్యాయం, అన్యాయం! వివాహమంటే ఒకరి పీడనకు ఒకరు తలవంచడమే."

"అభిరుచి పీడనను నువ్వు తట్టుకోలేవు. నీ సాహిత్య సంతర్పణకు ఆహ్వానితులను మాత్రమే రానిస్తావు యిక నేనో వచ్చినవారి నందరినీ ఆహ్వానిస్తాను."

"యీ వివాదం తీసుకుని రావడం పొరపాటే. మనిద్దరం కలసివున్న ఆఖరి సాయంత్రపు చిత్తవృత్తి చెడిపోయింది."

"అబ్బే! విస్పష్ట భాషణ తరవాత మిగిలే చిత్తవృత్తే యదార్థ చిత్తవృత్తి అదే అక్షయ సహతా చిత్తవృత్తి."

"ఏమయినా నా నోటి చెడు అభిరుచిని వదలించుకోవాలి. బెంగాలీ కవితవల్ల సాధ్యంకాదు. ఆంగ్ల కవిత నీ మన స్తత్వాన్ని పునరుద్ధరిస్తుంది. యిండియాకు తిరిగి వచ్చిన తరవాత కొంతకాలం ప్రొఫెసరుగా పనిచేశాను."

లావణ్య నవ్వి, "మన చిత్తవృత్తి యింగ్లీషు వారి యింటి కుక్కలాంటిది. ధోవతి ధరించి యెవరు వచ్చినా మొరుగుతుంది. కాని ప్రభుత్వ సేవకులు కంటబడితే తోక జాడిస్తుంది."

"అవును. నిజం. పక్షపాతం సహజమూ కాదు, స్వయంకృతమూ కాదు. యెక్కువగా ఆజ్ఞలవల్ల జనిస్తుంది. బాల్యంనుంచి యింగ్లీషు సాహిత్యంమీద పక్షపాతం మన మీద రుద్దారు. యీ నిర్బంధ శిక్షణ మూలంగా దానిని తిరస్కరించడానికిగాని, మన సాహిత్యాన్ని మెచ్చుకోవడానికిగాని ధైర్యం లేకుండాపోయింది. యేమయినా యివాళ నివారణ చక్రవర్తి రచనలు చదవను. నూటికి నూరుపాళ్లు ఆంగ్ల కవిత అనువాదం వుండదు."

"ఊహుం- మిత్రా! యింటిదగ్గర మేజాబల్లదగ్గర మనం కూర్చునే వరకు యింగ్లీషు కవితను నిలిపిపెట్టు. మనం కలసివున్న ఆఖరి సూర్యాస్తమయ సమయంలో నివారణ చక్రవర్తి రచనలే చదువు. యింకేవీపీ వద్దు."

"నివారణ చక్రవర్తి చిరకాలం వర్ధిల్లుగాక!" అన్నాడు అమిత అమితోత్సాహంతో. "యింతకీ అతనికి అమరత్వం సిద్ధించింది. వన్యా! నీ ఆస్థాన కవిగా అతనిని నియమిస్తాను. నీ ఒక్క దాని చేతులతోనే సత్కారం పొందుతాడు."

"అంతటితో తృప్తి పొందుతాడా?"

"తృప్తి పొందకపోతే చెవి పట్టుకుని బయటకు తన్నేస్తాను."

"చెవి పట్టుకునే విషయం తరవాత నిర్ణయిద్దాం. ఇక కవిత వినిపించు."

అమిత చదవనారంభించాడు.

"ఎంత ఓరిమితో వసించితివి
నా చెంత రాత్రింబవలు!

నా అదృష్ట పథధూళిలో
నీ పాద ముద్రలు గమించెను
ఎన్నిసారులో!
పోవలె నేడు నేను దూర దూరాలకు
కానుకగా సమర్పింపనిమ్ము
నీ విజయ గీతి
చేసి వ్యర్థ కృషి పలుమారు
జ్వలియించదు జీవిత హోమాగ్ని
నిరాశతో ధూమ వలయాలు శూన్యంలో
విలీనమయి పోయె
ఎన్నిమారులో క్షణభంగురజ్వాల
చిత్రించే తన అస్పష్ట చిహ్నాలు
నిశ్చేతన నిశీ ఫాలభాగాన
అస్పష్ట కాలశూన్యంలో
మాయంకాక మునుపే
ఇక నీ రాకతో
హోమాగ్ని జ్వలియించును సగర్వంగా
ఫలియించును నా యజ్ఞం
దినాంతాన అర్పింతు నీకు
నా పూర్ణాహుతి
ఇదే గైకొనుము నా నమస్కృతి
నా జీవిత సంపూర్ణ ఫలం
నా వినమ్రత శిరమును
స్పృశించుము మృదువుగా

నీ మహనీయ వైభవ సింహ పీఠంనుండి
పంపుము ఆహ్వానమ్ము
ఈనా ప్రణుతి స్థానం
లభింపజేయుమిచ్చట."

## ఆశంక

మరునాటి ఉదయంనుంచి విధి నిర్వహణ మీద మనసు నిలపడం లావణ్యకు కష్టమయి మామూలు వ్యాహ్యాళికి బయటకు పోలేదు. షిల్లాంగును వదిలి వెళ్ళే ముందు ఉదయం ఆమెను కలుసుకో నిశ్చయించనని అమిత చెప్పేఉన్నాడు. ఆ నిశ్చయంతో ఆమె కూడా సహకరించి అమిత వెళ్ళే మార్గాన్ని విడనాడాలి. ఆమె అతి ప్రలోభానికి లోనయిందిగాని నిలదొక్కుకుంది. యోగమాయ పెందల కడనే స్నానంచేసి పూజా పుష్పాలకోసం బయటకు వెళు తుంది. కాని లావణ్య ఇంకా ముందుగానే ఇంటి నుంచి బయలుదేరి నీలగిరి తైలవృక్ష పాదతలం దగ్గరకు చేరుకుంది. తనను ఇతరులను మోసగించడానికో అన్నట్లు చేతిలో రెండు పుస్తకాలు పట్టుకుంది. తెరిచిన పుస్తకాలు తెరిచినట్లే వున్నాయి. కాలం పరుగిడుతోంది. పుటలు తిరగ వేయనే లేదు. జీవిత పర్వదినం నిన్నటితో సమాప్త మయిందని పదే పదే తనలో తాను అనుకుంది. ఆకాశం వెలుగు నీడల మాసి కలతో రూపు చెడింది. అపుడపుడు వాటిని విధ్వంసనహస్తం చీపురుతోలా తుడిచి వేస్తోంది. అమిత పుట్టుకతోనే పలా

యనం చిత్తగించే తరహా మనిషని లావణ్యకు విశ్వాసం కుదిరింది. తప్పించుకున్నాడా ఇక జాడ తెలియడం దుర్లభం. సంచార కాలంలో ప్రేమగాథ ప్రారంభిస్తాడు. రాత్రి తరవాత ఉదయం రాగానే ఆ గాథా సూత్రం తెగిపోతుంది. ప్రయాణీకుడు నిష్క్రమిస్తాడు. తన ప్రేమ గాథ కూడా అలానే అసంపూర్ణంగా సర్వకాలమూ నిలిచిపోతుందని విశ్వసించసాగింది. అసంపూర్ణతా వేదన ఉదయసూర్యకాంతిలో అకాల సమాప్తి వేదన తడిగాలిలో ప్రతిఫలించాయి.

అప్పుడే తొమ్మిదిగంటలయింది. అమిత ఉరుక్కుంటూ ప్రవేశించి, "పిన్నీ! పిన్ని" అని కేకలు వేశాడు. యోగమాయ పూజముగించుకుని వంటలో నిమగ్నురాలయింది. ఆమె మనసుకూడా బాగుండలేదు. అమిత ఉత్సాహం, నవ్వు ఇంతకాలం ఆమె ఇంటిలో, ఆమె మనసులో పొంగి పొరలుతూండేవి. అతను వెళ్ళిపోయాడనే భావం, పుష్పంమీద వానపడి అణచివేసినట్టే, ఆ ఉదయమంతా ఆమెను కుంగదీసింది ఇతరుల దృష్టినుంచి దూరంగా ఒంటరిగా ఉండడం లావణ్యకు అవసరం అనే విషయం గ్రహించి యోగమాయ ఇంటి పనులలో సహాయ పడవలసిందని ఆమెను పిలవలేదు.

లావణ్య దిగ్గున లేచింది ఆమె ఒడిలోని పుస్తకం కింద పడింది. ఆమె గమనించనే లేదు. యోగమాయ వంట సామాను కొట్టులో నుంచి పరిగెత్తుకు వచ్చింది.

"యేమిటి సంగతి అమిత! భూకంపం వచ్చిందా!"

"అవును. భూకంపమే. సామానంతా పంపించివేశాను. మోటారుకారు సిద్ధంగా వుంది. వుత్తరాలకోసం పోస్టాఫీసుకు వెళ్ళాను. టెలిగ్రాం వచ్చివుంది."

అమిత ముఖంమీది భావముద్రను గమనించి యోగమాయ అదుర్దాగా, "అంతా బాగానే వున్నారనుకుంటా"

లావణ్య గదిలోకి వచ్చింది. అమిత వ్యాకులపాటును వ్యక్తంచేస్తూ, "నా చెల్లెలు ఆమె స్నేహితురాలు కేటీ మిత్తర్‌తోను కేటీ సోదరుడు నరేన్‌తో యీ సాయంకాలం యిక్కడికి వస్తోంది," అన్నాడు.

"యింకులో చింతించవలసిందేముంది? గుర్రపు పందాలువేసే ప్రదేశం దగ్గర యిల్లు ఒకటి ఖాళీగా వుందని విన్నాను. ఆ యిల్లు దొరక్కపోతే మన యింటిలోనే వుంటారు."

"నేను చింతిస్తున్నది ఆ విషయం గురించికాదు పిన్నీ! టెలిగ్రాం యిచ్చి హోటలులో గది కుదుర్చుకున్నారు."

"ఏమయినా నువా పాడుగుడిసెలో నివసిస్తుండడం నీ చెల్లెళ్ళ కంటబడనీయను. నీ చపల బుద్ధికి బాధ్యత మా మీద వేస్తారు."

"ఊహూం— పిన్నీ! స్వర్గసీమను కోల్పోయాను. శూన్య స్వర్గ సీమకు వీడ్కోలు! నా ఆనంద స్వప్నాలు నా చిన్న మంచంమీది గూటినుంచి యెగిరిపోతాయి. యీ అధునాధునికి నాగరీక హోటలులోని ఆ గదిలో నేను కూడా వెళ్ళి వుండవలసివుంది."

అతని భాషణలో చెప్పుకోతగిందేమీ లేదు. అయినా లావణ్య ముఖం వివర్ణమయింది. అమిత బంధు మిత్రవర్గానికి తనకుగల అంతరం గురించి ఆమె ఆలోచించనే లేదు. ఇపుడు మెరుపులా ఆ ఆలోచన ఆమెలో ప్రవేశించింది. తప్పనిసరి అయి అమిత హోటలుకు మకాం మార్చవలసి రావడంతో తాము భావనా జగత్తులో నిర్మించుకున్న అగోచర గృహం దృగ్గోచర రూపం ధరించదని ఆమె మనసుకు తట్టింది.

"నేను హోటలుకు వెళ్ళినా నరకానికి వెళ్ళినా నా అసలు యిల్లు ఇదే," అన్నాడు అమిత లావణ్యవేపు త్వరిత గతి చూపు చూస్తూ.

నగరం నుంచి అనుమానించే వారు దిగుతున్నారని అమిత గ్రహించాడు. సిసీ, ఆమె బృందం ఇక్కడికి రాకుండా నిరోధించడానికి ఎత్తులు ఆలోచించ సాగాడు కాని ఇటీవల అతని ఉత్తరాలన్నీ యోగమాయ చిరునామాకే వస్తు న్నాయి. ఇది ఒకరోజున తనకు కష్టాలకు కేంద్రమవుతుందని అతని కెన్నడూ తోచలేదు. అమిత భావాలను ఎక్కువసేపు అణచి ఉంచుకోలేడు. పైగా అవి కొద్ది అతిశయంగా ద్యోతక మవుతాయి. సోదరీమణుల రాకకు అతను ఆందోళనచెందడం యుక్తంగా లేదని యోగమాయ భావించింది. లావణ్యకూడా తాను వారికి సాటిరాననే భావంతో అమిత సిగ్గుపడుతున్నా డని భావించింది. అది సహించరాని అవమానం. అమిత లావణ్యకేసి తిరిగి, "తీరుబడివుందా! కొంచెంసేపు అలా బయటికి వస్తావా?" అని అడిగాడు.

"ఊహుం- తీసుబడి లేదు," అంది లావణ్య విరసంగా.

"కొంచెంసేపు వెళ్ళు, అమ్మా!" అని బతిమాలింది యోగమాయ కలరవ పడుతూ.

"అమ్మా! కొంతకాలంనుంచి సురమ చదువు సరిగా సాగడం లేదు. తప్పునాదే యికనుంచి ఏమాత్రం అశ్రద్ధ చేయకూడదని కిందటి రాత్రి నిశ్చయించుకున్నాను."

ఇలా చెప్పి లావణ్య మూతి బిగించుకుంది. ముఖంలో కఠోరత గోచరించింది. యోగమాయకు ఈ లక్షణాలు తెలుసు. ఇంకా చర్చించడానికి సాహసించ లేదు.

"నేనూ నా విధి నిర్వహణకు వెళ్ళాలి వారికి కావలసిన వన్నీ సిద్ధంచేయాలి," అన్నాడు అమిత నీరస స్వరంతో

వెళ్ళిపోయేముందు కొద్దిసేపు వరండాలో కదలకుండా మెదలకుండా సిలబడ్డాడు.

"చూడు, వన్యా! చెట్లసందులలో నుంచి కొద్దిగా నా యింటి పై కప్పు కనిపిస్తుంది నీతో యింకా చెప్పలేదు. ఆ యింటిని కొనివేశాను. ఆ యింటి యజమానురాలు నేను కొంటాననేసరికి అదిరిపోయింది. నా కేదో బంగారంగని దొరికిందని ఆమె భావించి ఉంటుంది. ధర బాగా పెంచేసింది. బంగారం గనిని నేను కనుగొన్నాననుకో, కాని ఆ విషయం నా ఒక్కడికే తెలుసు నా శిధిల కుటీర శోభ ఎవరికంటా పడరాదు."

లావణ్య ముఖాన్ని విషాదచ్ఛాయ కప్పివేసింది. "యితరులను అంతగా లక్ష్యపెట్టడం దేనికి? అందరికీ తెలి

యనీ యదార్థానికి నిజాన్ని సక్రమంగా [illegible] ఎప్పుడు ఎవరికీ అమర్యాదగా ప్రవర్తించే సాహసం వుండదు."

దీనికి అమిత జవాబు చెప్పలేదు.

"వన్యా! వివాహమయిన తరవాత మనం యిక్కడికి వచ్చి ఆ కుటీరంలో కాపురం చేయాలి. గంగానదీ తీరంమీది ఆ తోట, స్నానాలఘట్టం, మర్రిచెట్టు యిప్పుడు అందులో కలిసి పోయాయి. నువు దానికి 'మితా' అనిపేరు పెట్టడం తగి పోయింది."

"మితా! యివాళ నువా యింటిని విడిచి పెట్టావు. ముందుముందు అందులో మళ్ళీప్రవేశించదలచినపుడు చాలదని తోస్తుంది. నేటి నివాసంలో రేపటికి జాగాలేదు. మానవుని ప్రథమసాధన బీదరికంలోనని ద్వితీయసాధన ఐశ్వర్యంలోనని మొన్నమొన్ననే చెప్పావు కాని అంతిమ సాధనను గురించి చెప్పలేదు. అది పరిత్యాగ సాధన."

"యివి నీ రవీంద్రుని మాటలు, వన్యా! షాజహాను తాజమహల్‌ను మించిపోయాడంటాడు. మనం నిర్మించిన దానిని మించిపోవడానికే నిర్మిస్తామని నీ కవికి తోచలేదు. సృష్టిక్రమంలో పరిణామానికి అర్థం అదే. ఏదో అద్భుత భూతం మనలను పట్టి 'సృష్టించు!' అని ఆజ్ఞాపిస్తుంది. సృష్టి పూర్తి అయిన తరవాతనే ఆ భూతం మనలను వదిలి పెడు తుంది. సృష్టిపొందిన దానితో యిక అవసరం వుండదు. కాని దాని అర్థం వదలిపెట్టడం పెద్ద యదార్థమని కాదు. షాజ హాన్ ముంతాజ్‌లు ధారావాహికంగా ప్రవహిస్తునే వుంటారు. యీ ప్రపంచంలో వారొక్కరే లేరు. అందుకే

తాజమహల్ యెన్నడూ శూన్యం కాలేదు నివారణ చక్ర వర్తి శోభన శయనాగారంమీద ఒక గీతం రచించాడు. పోస్టుకార్డు మీద రాసిన ఆ గీతం, రవీంద్రుని 'తాజమహల్' అనే గీతానికి సంక్షిప్త ప్రతివచనం.

"అరుణ రథచక్ర ధ్వనికి
నిశా ప్రశాంతత భగ్నమయినపుడు
పరిత్యజించుట తప్పదునిను
పాపం! ఓ శోభన శయ్యాగారమా!
బాహిర బ్రహ్మాండమ్ము
ఘోరవియోగ రాక్షసి
ప్రేమ పుష్పమాలల
ముక్కలుగా తెంచి వేసినా
లేదు నీ కెన్నటికీ నాశనమ్ము
అవిచ్ఛిన్నమ్ము నీరవమ్ము
ఈ ఉత్సవమ్ము సతమ్ము.
వైవాహిక శయ్యాతలమ్ము
గావించి శూన్యమ్ము
యువదంపతులు నిను
వర్జింతురని చెప్పిందెవరు?
వెళ్ళిపోలేదు, వెళ్ళిపోలేదు
నీ ఆహ్వానమ్ముపై
తిరిగి వత్తురు నీ ద్వారతలికి
వినూత్న యాత్రల నుంచి
మరల మరలవత్తురు

ఓ శోభన శయ్యాగారమా!
ప్రేమకు చావులేదు
సిద్ధించె అమరత్వము నీకు."

"రవీంద్రనాథ్ గతించువాటిని గురించే గానం చేస్తాడుగాని శాశ్వతంగా వుండేవాటిని గురించికాదు. వన్యా! మనమా ద్వారం తట్టితే తెరచుకోదనా ఆ కవి భావం?"

"మితా! నిను వేడుకుంటున్నా. ఈ హృదయం కవితా కలహం ప్రారంభించకు. నువే నివారణ చక్రవర్తివని నాకు తెలియదనుకున్నావా? మొదటినుంచీ తెలుసు. నీ కవితతో మన ప్రేమకు స్మారక చిహ్నం కట్టడం ప్రారంభించకు. కనీసం అది చచ్చేవరకు నిరీక్షించు."

అంతర ఆందోళనను అణచివేసుకోవడానికి అమిత నోటికి వచ్చినట్లు మాటాడుతున్నాడని లావణ్యకు బాగా తెలుసు. గత సాయంకాలం కవితా కలహం అసౌఖ్యకరంగా లేదని నేటి ఉదయం అపశ్రుతిగా పరిణమించినదని అమిత కూడా గ్రహించాడు. కాని ఈ విషయం లావణ్య గ్రహించిం దనే యదార్థం అతనికి కంటకంగా ఉంది. కొంచెం విరసంగా,

"సరే. వెళుతున్నాను. యీ ప్రపంచంలో నేనూ నిర్వర్తించిన కార్యకలాపం వుంది. యీ క్షణంలో హోటలుకు వెళ్ళాలి. పాపం! ఆ దురదృష్ట నివారణ చక్రవర్తి కోలాహలం కూడా అంతమయింది."

లావణ్య అమిత చేయిపట్టుకుని, "మితా" నా క్షమా పణను యెన్నడూ నిరాకరించకు. మనం విడిపోయే రోజువస్తే

నీకు మనసులో కోపంతో మాత్రం వెళ్ళిపోవద్దు. యిదే నా ప్రార్థన ”

కన్నీటిని దాచుకోవడానికి తొందర తొందరగా ఆమె లోపలికి వెళ్ళింది. కొద్దిసేపు అమిత నేలమీద పాతుకు పోయాడు తరవాత మెలమెల్లగా పరాకుగా నీలగిరి తైలవృక్షం వేపుకు వెళ్ళాడు. అక్కడ పగిలిన అక్రోటు కాయల ముక్కలు చెల్లాచెదరగా పడిఉండడం చూచాడు. ఆదృశ్యం అతని హృదయంలో వేదనను రగుల్కొల్పింది. జీవిత ప్రవాహం వదలివెళ్ళిన చెత్తా చెదారం నిరర్థకం కావడం మరింత విషాదం కలిగించింది. పచ్చికమీద పడివున్న రవీంద్రుని 'బలాకా' అనే పుస్తకంమీద అతని కన్ను పడింది. ఆఖరిపుట మూసి పోయింది. దానిని తిరిగి ఇచ్చివేదామని ఆలోచించాడు గాని అలా చేయకుండా తీసుకుని జేబులో పెట్టుకొన్నాడు. హోటలుకు వెళదామనుకొన్నాడు. కాని అలా చేయకుండా ఆ చెట్టుకింద కూర్చున్నాడు కిందటిరాత్రి పట్టిన తడిమబ్బులు ఆకాశమును శుభ్రపరిచాయి. దుమ్మూ ధూళి వదలిపోయి ప్రతిదీ శోభిస్తోంది. చెట్ల చేమల కొండల నీడలు నీలి ఆకాశంలో చెక్కినట్లు యావత్ప్రపంచం మనసుకు అతి సన్నిహిత మయినట్లు తోచింది. క్రమక్రమంగా భైరవి రాగాలాపనతో కాలం గడిచింది

లావణ్య తన కర్తవ్యభారంలో మునిగిపోవాలని తలంచిందిగాని దూరాన్నుంచి అమిత చెట్టుకింద కూర్చునిఉండడం చూసేసరికి నిలువలేక పోయింది. ఆమె హృదయం పగిలి

పోయిందనిపించింది. బాష్పజలంతో కళ్ళు నిండిపోయాయి. అతని దగ్గరకు వెళ్ళి, "యేమిటి ఆలోచిస్తున్నావు? మిత్రా!" అని అడిగింది

"యిప్పటివరకు ఆలోచిస్తున్న దానికి తలకిందులుగా."

"నీ మనసుకు తలకిందులుగా మధ్య మధ్య చూస్తూంటే గాని నీకు మనసు కుదుటపడదు. సరే. ఆ తలకిందులు ఆలోచనలేమిటో చెప్పు"

"యింతకాలమూ నేను ఒకొక్కప్పుడు గంగానదీ తీరం మీద, ఒకొక్కప్పుడు కొండలలో నీకు నివాసం భావనా జగత్తులో నిర్మిస్తూనే వున్నాను. ఆ కొండవరకు వెళ్ళే మార్గ దృశ్యం నా మనసును కదిలించి వేసింది. అడవి నీడలు ఆ మార్గంమీద వెదజల్లి వున్నాయి. నేటి ప్రభాత తీక్షణ కాంతి వాటిని స్పృశిస్తోంది. నా చేతిలో పొడుగాటి ఇనప గుబ్బల కర్రవుంది. భుజంమీద తోలుపట్టీ చదరపు సిపాయి సంచివుంది. నువ్వు నాపక్కనే నడుస్తున్నావు. నన్ను బయటకు గెంటి విచ్చలవిడిగా పెరిగేటట్లు చేసి నీపేరు సార్థక పరుచుకున్నావు. యితరులతో యిల్లు నిండిపోయింది. మనిద్దరికే ఆ రోడ్డు మార్గం."

"యింకేం డయిమెండు హార్బరు దగ్గరతోట, నెలకు డబ్బయి అయిదు రూపాయల అద్దెభాగం మాయమయ్యాయి. బాగుంది. రోడ్డుమీద మనిద్దరిమధ్య దూరం యెంత వుండాలి. నువొక విశ్రాంతి భవనంలో నేనొక విశ్రాంతి భవనంలో రాత్రి గడపాలా?"

"యిక యేమాత్రం అవసరంలేదు, వన్యా! నడుస్తూంటే అడుగడుగుకూ కొత్తగానే వుంటాం. వృద్ధాప్యానికి వ్యవధేలేదు. కదలకపోతే వయసు వచ్చిపడుతుంది."

"హఠాత్తుగా భావం మారిందేం? మితా!"

"చెపుతా విను. హఠాత్తుగా శోభనలాల్ దగ్గరనుంచి నాకు వుత్తరం వచ్చింది. అతనిపేరు నువ్వు వినేవుంటావు ప్రేమచంద్ రాయచంద్ విద్యార్థివేతనం పొందుతున్న శోభనలాల్. భారతదేశ చరిత్రలోని పురాతన మార్గాల జాడలను తెలుసుకోవడానికి సంచారం బయలుదేరాడు. గత కాలంలో నిశీర్ణమార్గాలను కనుగొనాలని అతని కాంక్ష. భావికి కొత్త బాటలు సృష్టించాలని నా కాంక్ష"

హఠాత్తుగా లావణ్య హృదయంమీద ఎదో దెబ్బ కొట్టినట్టు అనిపించింది. అమిత సంభాషణకు అడ్డువచ్చి,

"అతనూ నేను యం. ఎ. పరీక్షకు ఒకసారే కూర్చున్నాం. అతనినిగురించి అంతా వినాలని వుంది," అంది లావణ్య.

"ఆఫ్ఘనిస్థాన్‌లోని కాపిష్‌గుండా వెళ్ళే పురాతన మార్గాన్ని కనుక్కోవాలనే భావం అతనిని ఆవేశించింది. ఆ మార్గాన్నే పేన్‌సంగ్ తీర్థయాత్రకు వచ్చాడు. అతనికి ముందు అలెగ్జాండరు జైత్రయాత్రకు వచ్చాడు. శోభన్‌లాల్ శ్రద్ధగా పుస్తుభాష నేర్చుకోవడం, పఠానుల ఆచారాలు చట్టాలు పరిశీలించడం ప్రారంభించాడు. అతను చక్కని

వాడు. వదులు లాగూలు వేసుకుంటాడు. అందుకని అతను పఠాన్‌లాగాక పారసీకునిలాగా కనిపిస్తాడు ఫ్రాన్సులో యిటు వంటి పరిశోధనల్ చేస్తున్న విద్వాంసులకు పరిచయ లేఖలు యిమ్మని హఠం చేశాడు ఫ్రాన్సులోవుండగా నేను వారి దగ్గర చదువుకొన్నాను. పరిచయ లేఖలు యిచ్చానుగాని ఇండియా ప్రభుత్వం అతను విదేశాలకు వెళ్ళడానికి అనుమ తించలేదు. అప్పటినుంచి దుర్గమ హిమాలయ పర్వతాల గుండా మార్గం ఒకపుడు కాశ్మీర్‌లో, ఇంకొకపుడు కుమాయూ అన్వేషించాడు. బౌద్ధ ధర్మ ప్రచారకులు వచ్చిన మార్గం కోసం హిమాలయ పర్వతాల కొసలో వెదకాలని తలపోస్తు న్నాడు. అతని సంచారోన్మత్తత నన్ను కలవర పరుస్తూం టుంది. గ్రంథాలలోని మాటల మార్గం కనుగొనడానికి మనం కనులు చిల్లులు పొడచుకుంటాం. కాని యీ వున్మ త్తుడు, మానవ విధివిలాసం స్వహస్తాలతో లిఖించిన మార్గ దర్శిని చదవాలని చూస్తున్నాడు నేనేమనుకుంటున్నానో తెలుసా?"

"యేమనుకుంటున్నావు?"

"అతను యవ్వనంలో యెదో గాజుల చేతిదెబ్బ తిని వుంటాడు. అందువల్లనే యింటినుంచి రోడ్డుపట్టాడు. కథ పూర్తిగా నాకు తెలియదుగాని ఒక రోజున మేమిద్దరం ఒంట రిగా అర్ధరాత్రివరకు వివిధ విషయాలు మాట్లాడుకున్నాం. హఠాత్తుగా పుష్పించిన మేలశిసిరి వృక్షంగుండా చంద్రో దయం కనిపించింది యెవరిని గురించో మాట్లాడడం ప్రారం

భించాడు. ఆమె పేరు చెప్పలేదు, వర్ణించలేదు. కాని ఆమెను గురించి మాట్లాడడం ప్రారంభించగానే అతని స్వరం ఉద్వేగంతో భారమయింది. తొందర తొందరగా వెళ్ళిపోయాడు. జీవితంలో యెప్పుడో అతని మనసు తీవ్రంగా గాయపడ్డదని నేను భావిస్తున్నాను. నిరంతర సంచారద్వారా ఆ బాధను చంపుకోవాలని చూస్తున్నాడు."

లావణ్య వృక్షశాస్త్ర జోత్స్యక్యతకు హఠాత్తుగా లోనయి వంగి గడ్డిలోని తెలుపు, పసుపురంగు అడవిపువ్వును పరిశీలించ సాగింది. దాని రేకులు లెక్కించాలనే ఆకాంక్ష బలీయంగా ఆమెను చుట్టుముట్టింది.

"వన్యా! నన్నీరోజున నువ్వు రోడ్డుమీదికి తోసేశావు తెలుసా," అన్నాడు అమిత.

"యెలా?"

"నేను యిల్లు కట్టాను. యీ వుదయం నువ్వు చెప్పిన దానినిబట్టిచూస్తే నువాయింటిలో అడుగు పెట్టడానికి తటపటాయిస్తున్నట్టు తోస్తుంది. రెండు నెలలుగా నా మనసులో సంసిద్ధం చేస్తున్నాను. యీ రోజున 'రా, నాయింటికి రా, నవ వధూ' అని నిన్ను పిలిచాను. కాని నువ్వు పెళ్ళికూతురు దుస్తులు తీసివేసి, 'ఉహూ ప్రియా! యిక్కడ జాగాలేదు. మన వివాహ సప్తపది నిరంతర సంచారం' అన్నావు."

అడవి పువ్వులమీది ఆసక్తి విచ్ఛిన్నమయిపోయింది. లావణ్య, హఠాత్తుగా లేచి నిటారుగా నిలబడి ఆవేదనతో, "మితా! యిక చాలించు. నాకు తీరుబడిలేదు" అంది.

# ధూమకేతు

లావణ్యతో తనకుగల సంబంధం షిల్లాంగులోని బెంగాలీ లందరికీ తెలిసిపోయిందని అమిత ఇప్పటికి గ్రహించాడు. ప్రభుత్వ గుమస్తాల చర్చలలో ప్రధానాంకం సచివాలయ ఆకాశంలో పాలించే గ్రహాల స్థాన సంబంధం. కాని వారు మానవ ఆకాశంలోని జ్యోతిర్మండలంలోని ప్రథమ శ్రేణి తారలు రెండు ప్రకాశించడం హఠాత్తుగా కనుగొనగానే, గ్రహగమనాన్ని జాగ్రతగా పరిశీలించే వారలాగా సహజంగా నూతన తేజోమూర్తులు ప్రదర్శించే ప్రచండ నాటకం గురించి నానావిధాలుగా చర్చించ సాగారు.

ఈ చర్చల సుడిగాలిలో కుమార్ ముఖర్జీ చిక్కుకున్నాడు. కుమార్ ముఖర్జీ న్యాయవాది. గాలి మార్పుకోసం షిల్లాంగు కొండలకు వచ్చాడు. కొంతమంది అతని పేరును కుమార్ ముఖో అని మరికొంతమంది మార్ ముఖో అని సంక్షిప్తంచేసి పిలికేవారు.

సిసీ బృందం అతనికి బాగా పరిచయమే. గాని ఆమె ఆంతరంగ మిత్రవర్గంలోనివాడు మాత్రంకాడు. అమిత అతనిని ధూమకేతుముఖో అని పిలిచేవాడు. అతను వారి బృందంలోనివాడు కాకపోయినా అపుడపుడు అతనితోక వారి కక్ష్యమార్గంలో ఆడుతుండేది. అతనిని ఆకర్షించిన తార లిస్సీ అని అంతా ఊహించగలిగారు. అంతా సంతోషించారుగాని,

లిస్సీమాత్రం కోపగించుకొనేది. సిగ్గుపడేది అందుకని ఆమె ఎప్పుడూ అతనితోక గట్టిగా తొక్కుతుండేది. కాని అలా తొక్కినా అతని తోకకుగాని తలకుగాని హాని కలిగేదికాదు.

షిల్లాంగు రోడ్లమీద అతనిని అమిత ఒకటి రెండు సార్లు దూరంనుంచి చూశాడు. అతనిని చూడకుండా ఉండడం కష్టం. అతనెన్నడూ ఇండియాదాటి విదేశాలకు వెళ్ళలేదు. అందువల్ల అతని విదేశీ వైఖరి నెర్రిగా వెల్లడవుతోంది. పొడుగాటి లావు దొరచుట్ట ఎప్పుడూ అతని నోటిలో ఉండేది. దానినిబట్టే అతనికి ధూమకేతు అని మారుపేరు వచ్చింది. అమిత అతనిని దూరాన్నుంచి చూసినపుడల్లా తప్పించుకు వెళ్ళాలని యత్నించేవాడు. అలా యత్నిస్తున్నాననే సంగతి ధూమకేతుకు తెలియదనే భ్రాంతితో తృప్తిపడేవాడు. చూస్తున్నట్టు కనిపించకుండా చూడడం గొప్ప లలితకళ. చోరకళకులాగానే ఈకళలో నేర్పును పరీక్షించడం ఎలాగో ఎవరికీ తెలియదు. ప్రత్యక్షంగా కనిపించే దానిని చూడకుండా ఉండడానికి ఎంతో నైపుణ్యం కావాలి.

షిల్లాంగులోని బెంగాలీ సమాజంనుంచి కుమార్ ముఖో సంపాదించిన సమాచార సంక్షిప్త రూపానికి 'అమిత అత్యాచారం' అని శీర్షిక పెట్టవచ్చు. నీలాపనిందలను ఎక్కువగా వ్యాపింప జేసేవారికే నీలాపనిందలంటే ఎక్కువ ప్రీతి. కాలేయ వ్యాధి నివారణకోసం కొన్ని రోజులు అక్కడ ఉండిపోవాలని ధూమకేతు మొదటలో ఉద్దేశించాడు. కాని వ్యర్థప్రలాపాలు వ్యాపింప చేయాలనే ఉత్సాహం అధికంకాగా అయిదు

రోజులలోపునే కలకత్తాకు తిరిగి వెళ్ళారు. అక్కడ సిసీ లిసీ బృందంముందు చుట్టపోగతో బాటు అమిత విషయమయిన దారుణ గాధలు వెళ్ళగక్కాడు. ఆ గాధల కథనం ఎగతాళి హాస్యాలతో నిండిఉంది.

సిసీదేవి వాహనం కేటీమిత్రా సోదరుడు నరేన్ అని అభిజ్ఞపాఠకులు ఈపాటికి అనుమానించే ఉంటారు. ఈ వాహనదశ వైవాహిక దశగా పరిణమిస్తుందని పుకార్లు బయలు దేరాయి. సిసీకి మనసులో అతనిని వివాహ మాడాలనే ఉద్దేశం ఉందికాని లేనట్టు నటిస్తూ రహస్యపు మేలిముసుగులో మునిగిపోయింది. అమిత సలహా సహాయంతో ఈ సంశయ దశను ఛేదించాలని ఆలోచించాడుగాని మాయలమారి అమిత కలకత్తాకు తిరిగి రాలేదు. ఉత్తరాలకు జవాబు వ్రాయలేదు. బహిరంగంగా రహస్యంగా కంటిముందు లేని అమితమీద, ఇంగ్లీషు భాషలో తనకు వచ్చిన నీచ పదజాలమంతా విసిరాడు. షిల్లాంగుకు అమితను దూషిస్తూ టెలిగ్రాంలు పంపాడు గాని, నక్షత్రానికి గురిచూసి కొట్టిన తారాజువ్వలాగా వాటి జాడే తెలియలేదు. చివరకు విషయం అక్కడికి వెళ్ళి విచారించాలని ఏకగ్రీవ నిర్ణయం జరిగింది. అమితను ఈడ్చుకుని పోతున్న సర్వనాశన ప్రవాహంమీద కాస్త పిలక కనిపించినా దాన్ని పట్టుకుని అతనిని ఒడ్డుకు లాగడానికి ఆలస్యం చేయ కూడదని నిశ్చయించారు. ఈ విషయంలో అతని సోదరి సిసీ

కంటె ఇంకొకరి సోదరి కేటీ ఎక్కువ ఉత్సాహం చూపింది. భారతదేశ సంపద విదేశాలలోకి మాయమవుతున్నందుకు రాజకీయవేత్తలకు వచ్చినంత ఆగ్రహం కేటీకి వచ్చింది.

నరేన్‌మిత్ర యూరపులో చాలాకాలం నివశించాడు. జమీందారు బిడ్డ. సంపాదన ఖర్చు అతనికి సమస్య కాదు. విద్య విషయంలో కూడా అంతే. విదేశాలలో డబ్బు, కాలం వెచ్చించడమే అతని పని. కళాకారుడుగా వ్యవహరిస్తే ఒక్క దెబ్బన బాధ్యతా రహిత స్వాతంత్ర్యం అనర్హ ఆత్మసన్మానం ప్రాప్తిస్తాయి. అందువల్ల కళాధిదేవతను అనుసరించడానికి యూరపు దేశాల రాజధానులలోని దేశదిమ్మరులు నివసించే పేటలలో నివశించాడు. కొద్దిపాటి యత్నంతరవాత నిరుత్సాహ మాటంగా చెప్పే హితాభిలాషుల హృదయపూర్వక ప్రార్థన మీద చిత్ర రచన మానుకున్నాడు నాటినుంచీ తాను కళా కోవిదుడనని చెప్పుకోసాగాడు. అయితే ఆ బిరుదుకు అర్హుడ నని చెప్పుకోవడంకంటె వేరే అర్హతహక్కు లేదు. చిత్రరచనా కళను వృద్ధిచేసుకోలేకపోయినా కనీసం భ్రమపెట్టగలడు. అతని మీసాల కొనలు పైకి మెలితేలి ఉంటాయి. జుట్టు దట్టంగా చిందరవందరగా ఉంది. అతను చక్కనివాడు. కాని ఇంకా చక్కగా కనిపించాలనే శ్రద్ధా కృషిలో అలంకర మేజాను చక్కదనాన్ని ఇనుమడింపజేసే వస్తువులతో నింపివేశాడు. అతను చేతులు మొహం కడుగుకునే తొట్టెలోని ఉపకరణాలు

పది తలల రావణునికికూడా సరిపోతాయి. హాదానా చుట్టను నాలుగు దమ్ములలో పీల్చిపారవేయడం, ప్రతి నెలా బంగీలో పారిస్‌నగరానికి బట్టలు ఉతకడానికి పంపించడం చూచి అతని అభిజాత్యం గురించి సందేహం వెలిబుచ్చే ధైర్యం ఎవరికీ లేకపోయింది. యూరప్పులోని ప్రథమ శ్రేణి దర్జీశాలల చిట్టాలలో అతని దుస్తుల కొలతలు వాటియాలా కపూర్తలా మహారాజుల పేర్లతోపాటు ఎక్కినాయి. అతని ఇంగ్లీషు గ్రామ్యంతో నిండి ఉండేది దానిని అతను అరమూత కనుల మందకొడి నిద్రమత్తు చూపులతో నములుతూ సాగదీస్తూ ఉచ్చరించేవాడు. ఇంగ్లండులోని అభిజాత్య సంస్థానాధీశులు అలానే గద్గద స్వరంతో మాట్లాడతారని అభిజ్ఞలు చెప్తుతూంటారు. అంతేగాక నీచగ్రామ్యభాష, బూతుతిట్లు అతని బృందానికి అతనిని నాయకుడుగా చేశాయి.

కేటీమిత్ర అసలు పేరు కేతకి. ఆమె సోదరుని ధోరణిలో మున్నూరు వడబోసి తీసిన ఆమె వైఖరి విదేశాలలో తయారయిన అతి శ్రేష్టమయిన చిక్కని సారం. సాధారణ బెంగాలీ బాలిక పొడుగాటి జుట్టుకు గర్విస్తూంటుంది. అందు కావేశంతో అంతగర్వంతోనే కేటీ జుట్టు కత్తిరించుకుంది ఆమె జడ కప్పపిల్ల తోకలాగా లోపించి, విదేశీ అనుకరణ దశకు పరిణమించింది ఆమె ముఖరాగం గౌరవర్ణం. దాని మీద పింగాణీ పూత. బాల్యంలో ఆమె నల్లని కళ్ళు నిర్మ

లంగా, ప్రశాంతంగా ఉండేవి. ఇప్పుడు సామాన్యమయినవాటి మీద పడనంత గర్వాన్ని పొందుపుకున్నాయి. ఒకవేళ సామాన్యమయినవాటిమీద పడినా గమనించేవికాదు. గమనించినా ఒరలోనుంచి సగం పైకి తీసిన కత్తిలాగా తళ తళ లాడేవి. ఒకప్పుడు మనోహరంగా సరళంగా కనిపించే పెదవులు ఎడతెగని అవహేళన మూలంగా కఠిన అంకుశంలాగా వంపులు తిరిగాయి. స్త్రీల దుస్తులను వర్ణించే సామర్థ్యం నాకు లేదు దానికి తగిన పరిభాష నాకు తెలియదు. కాని కళ్ళకు కొట్టవచ్చినట్టు కనిపించేది. పాము కూసంలాంటి అతి సన్నని పై ఉడుపులు, వాటిలోనుంచి లోపలి దుస్తుల రంగు కనిపిస్తూంటుంది. ఆమె వక్షంమీద ఆచ్ఛాదన ఇంచుమించు లేనట్టే. ఆమె బోసి చేతులు ఒకప్పుడు మేజామీద, ఇంకొకప్పుడు కుర్చీ చేతులమీద, మరొకప్పుడు అతినాగరీకతను నటించడానికి అతి జాగ్రతగా పెట్టిన భంగిమలో ఉంటాయి. గోళ్ళకు రంగు వేసిన వేళ్ళమధ్య సిగరెట్టు పెట్టుకుని పీల్చడం, పీల్చడం కోసంకంటె అలంకారంకోసమే కాని అత్యంత అసహ్యం గొలిపే విషయం ఎత్తు మడమల పాదరక్షలతో వంకరటింకర నడక. సృష్టికర్త మానవ పాదమును మేక గిట్టలలాగా తీర్చి దిద్దినందున పరిణామంలోని ఈ ప్రాథమిక దోషమును, చెప్పులు కుట్టువాని దుష్టకళవలన ఎత్తెత్తి అడుగులు వేస్తూ భూమిని బాధించడంద్వారా, సరిదిద్దుతున్నట్టు తోస్తుంది.

సిసీ ఇంకా మధ్య దశలోనే ఉంది. త్వరితగతిని ఉన్నత దశకు వెళుతూనే ఉంది. గాని పట్టా పుచ్చుకోలేదు. గణగణ

నవ్వుతో, ఎడతెగని ఉల్లాసంతో, అణచుకోలేని బాహ్యాశా నీతో తేజస్సుతో తొణికిసలాడుతూ ఆమెను ఆరాధించేవారి మెప్పును పొందుతూంది నవయవ్వనంలోని రాధలాగానే ఆమె ఒకొకప్పుడు పరిపక్వ స్త్రీ లాగా గంభీరంగా మరొకప్పుడు పక్వంగాని లేబ్రాయపు బాలికలాగా కనిపించేది ఆమె పాద రక్షల ఎత్తు మడమలు కాల పరివర్తన విజయాన్ని ప్రదర్శిస్తే ఆమె జుట్టుముడి పూర్వ కాలాన్ని ప్రదర్శిస్తోంది. చీరకింది అంచు కొన్ని అంగుళాలు పాదాల పైకి ఉన్నా, పై అంచు న్రమతనుసూచిస్తూ ముఖమును చుట్టిఉంది. అనవసరంగా చేతి తోలు తొడుగులు ఉపయోగించినా రెండు చేతుల మణికట్టు లకు గాజులు పెట్టుకునేది. సిగరెట్టు తాగినా తల తిరిగేదికాదు కాని తమలపాకులు ఆమెను ప్రలోభపరుస్తాయి. ఊరగా యలు, మామిడి తాండ్ర, పనికిరాని బిస్కట్టు టిన్నులో పెట్టి పంపారని పట్టించుకునేదికాదు. కిస్‌మస్ పండగకు చేసే రేగి ముద్ద కుడుములుకంటె అట్లతదియనాటి అట్లే ఆమెకు ఎక్కువ ఇష్టం. విదేశీ నాట్యాచార్యుని వద్ద కచేరీ నాట్యం నేర్చుకుంది గాని తోటి వర్తకునితో కలిసి బహిరంగ ప్రదర్శనంలోగిరున తిరుగుతూ నాట్యం చేయడానికి సంకోచించేది.

అమితను గురించిన అపవాదులు వినీ వినిగానే ఆందో ళనచెంది సిసీ, లిసీ పిల్లాంగుకు వేగిరం వచ్చేశారు. వారి పరి భాషలో లావణ్య పంతులమ్మ జాతికి చెందినది. పురుషులను

జాతి భ్రష్టులను చేయడానికి పుట్టిన జాతే పంతులమ్మ జాతి అని వారి అభిప్రాయం. అమితకుగల ధనం స్థితిగతులమీది వ్యామోహంతో అతనిని బంధించివేసిందని వారి నమ్మకం. ఆమె గుప్పిటనుంచి అతనిని తప్పించడానికి స్త్రీ తెలివితేటలు కావాలి. నాలుగు ముఖాల బ్రహ్మ నాలుగు జతల కళ్ళతో ప్రేమ పూర్వక పక్షపాత బుద్ధితో స్త్రీలమీద నిలుస్తాయి. అందువల్లనే స్త్రీల విషయంలో పురుషులకు మందబుద్ధి ప్రసాదించాడు. ఈ కారణంవల్ల స్త్రీల కుతంత్రాలకు లోనుగాని ఆడబంధువుల సహాయంతో తప్పితే అన్యరక్తంగల స్త్రీపన్నిన మోహజాలంనుంచి తప్పించుకోవడం పురుషునికి సాధ్యం కాదు.

ఈ లోపున ఆ తరుణులిద్దరూ అమితను ఆమె బారినుంచి రక్షించడానికి ప్రణాళికను గురించి ఒక నిర్ణయానికి వచ్చారు. మొదటగా శత్రుబలాలను, రణరంగాన్ని జాగ్రతగా పరిశీలించి, ఆ మాయావిని శక్తిని అంచనాకట్టాలి అంతేగాని ముందుగా అమితకు తెలియజేయడమనే ప్రసక్తే లేదు.

వారికంటికి తొలిగా గోచరించినది అమిత పల్లెటూరి వాలకం. నిజానికి అమిత అతని బృందంలోని వారిలాగా ఎన్నడూ లేడు. నిజానికి అతను ఎపుడూ అతినాగరీకుడు. ధగధగా మెరిసిపోతూండేవాడు. కాని ఇపుడు అరుబయులు

జీవితం మూలంగా శరీరం కమిలిపోయింది. అంతేగాదు ఆటవికస్పర్శ అతనిమీద నిలిచిపోయింది. చెట్లలాగానే ఆకు పచ్చగా, మందమతిగా మారిపోయినట్టు కనిపించసాగాడు. సామాన్యమానవునిలాగానే ప్రవర్తించసాగాడు. పూర్వం హాస కరవాలంముందు జీవితవ్యవహారాలను పారిపోవనిచ్చే వాడు. ఇప్పుడు ఆ వినోదంమీది వ్యామోహం నశించింది. ఇది అతని అంత్యకాలలక్షణమని వారికి తోచింది.

ఒకరోజు సిసీ సూటిగా, "యిక్కడికి రాకముందు నువ్వు కొండజాతివారిస్థాయికి దిగజారావేమోనని భయపడ్డాం. కాని ఇక్కడ దేవదారు వృక్షాలలాగా పచ్చిపచ్చిగా తయా రయ్యావు. వెనకటికంటె ఆరోగ్యం బాగావున్నా ఆసక్తి జనకంగాలేవు."

దీనికి జవాబుగా అమిత ప్రకృతి సహవాసంవల్ల మానవుని శరీరానికి, మనస్సుకూ ఆత్మకూ "మూగ జడ పదార్థ" లక్షణం అబ్బుతుందనే వర్డ్స్‌వర్త్ కవి పద్యపాదం ఉదహరించాడు. అపుడు సిసీ తనలో తాను "మూగ జడ పదార్థాలతో మాకేం తగువులేదు. యేమాత్రం కాకుండా తీయతీయగా మాట్లాడుతూ చలాకీగావుండే వారంటేనే భయం," అని అనుకుంది.

లావణ్య విషయం అమిత తనంతట తానే ప్రస్తావిస్తా డని వారు ఆశించారు. కాని ఒకరోజు కాదు, రెండురోజులు

కాదు, మూడు రోజులు గడచాయి. అమిత ఒక్కమాట కూడా చెప్పలేదు. అతని హృదయనావ అటూయిటూ ఎక్కువగా ఊగిసలాడుతోందని స్పష్టమయింది. వారు ఉదయంలేచి తయారయేసరికి అమిత ఎక్కడికో వెళ్ళిపోయేవాడు. తిరిగి వచ్చేసరికి అతని ముఖకవళిక తుఫాను తరవాత వాలిచినిగిన అరటి ఆకులను జ్ఞప్తికి తెస్తుండేది. అతని పక్కమీద రవీంద్రనాథ్ రచించిన పుస్తకంపడి ఉండడం ఇంకా ఎక్కువ భయకారణమయింది. ఆ పుస్తకంలోపలి అట్టమీద లావణ్యపేరు ఇంగ్లీషులో వ్రాసివుంది. అందులోని మొదటి అక్షరాలు ఎర్రసిరాతో కొట్టివేసి ఉన్నాయి. ఆ పేరే అంతటినీ బంగారంగా మార్చిన పరశువేది.

అమిత మాటిమాటికీ మాయమవుతుండేవాడు. అలా మాయమవడం ఆకలికోసం అనేవాడు. ఆ ఆకలి అపరిమితమయిందని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఆ ఆకలిని ఎవరు తీర్చగలరో వారికి తెలియనిదికాదు. కొండగాలితక్క ఇంకెవరూ ఆకలిని తీర్చేవారు లేరని నటించేవారు. సిసీ తనలో తాను నవ్వుకుంది. కేటీ లోలోపల మండిపడింది. అమిత స్వంత సమస్యలలో నిమగ్నుడవడంవల్ల వాతావరణ ధోరణిని పసికట్టలేకపోయాడు. జలపాతం చూడడానికి వెళ్ళానని ఈ మిత్రద్వయంతో అమిత సౌమ్యంగా చెప్పేవాడు. కాని అదే విధమయిన జలపాతమూ, దాని జలం ప్రవహిస్తాయో లేదో

అని అనుమానిస్తారనే విషయమే అతనికి తట్టలేదు. ఈఉదయం నారింజ తేనె కొనడానికి వెళుతున్నానని చెప్పాడు. వారు సరళంగా అన్యాయంగా సాటిలేని తేనెమీద అణచుకోలేని ఆసక్తి ప్రదర్శించి కూడా వస్తామని చెప్పారు. దానిమీద, "ఆ మార్గంవెంట ఏ వాహనం వెళ్ళదు. నడిచి వెళ్ళడం కష్టం" అని జవాబు చెప్పి చర్చను హఠాత్తుగా ఆపివేసి పారిపోయాడు. తేనెటీగ రెక్కల రెపరెపలకు ముగ్ధులయి ఆ మిత్రద్వయం ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా నారింజ తోటమీదకు దాడి నడిపించడానికి నిశ్చయించుకున్నారు. నరేన్ గుర్రపు పందాలకు వెళ్ళాడు. కూడా సిసీని తీసుకువెళ్లాలని పట్టుబట్టాడుగాని ఆమె నిరాకరించింది. ఈఆత్మ నైరాశ్యం వెనకనున్న కఠిన క్రమశిక్షణను దయార్ద్ర హృదయం మాత్రమే మెచ్చుకోగలుగుతుంది.

## వ్యాఘాతం

ఆ మిత్రద్వయం యోగమాయ తోట గేటులో అడుగు పెట్టారు. చుట్టుపక్కల నౌకరు ఎవరూ కనిపించక పోయేసరికి తలవాకిలి వసారాను సమీపించారు. అరుగుమీద చిన్న మేజాబల్లముందు ఒక పంతులమ్మ ఒక విద్యార్థినికి చదువు చెపుతూండడం వారికి గోచరించింది. ఆ ఇద్దరిలో

పెద్దది లావణ్య అని ఊహించడం తేలికే. మొట్లు టకటకా ఎక్కుతూ కేటీ ఇంగ్లీషులో "క్షమించండి" అంది.

"యెవరు కావాలి?" అని అడిగింది లావణ్య ఆసనం నుంచి లేస్తూ.

ఒక్క క్షణంలో కేటీ లావణ్యను ఆపాదమస్తకం తిలకించి, "మిస్టర్ అమిట్రాయ్ యిక్కడ వున్నాడేమో కనుక్కుందామని వచ్చాం," అంది.

ఈ అమిట్రాయ్ ఏజాతి జీవో వెంటనే గ్రహించలేక "అతనిని యెరగం" అని చెప్పింది.

ఆ మిత్రద్వయం ఒకరి నొకరు మెరుపుచూపులా చూసుకున్నారు. వారి ముఖాలమీద అవహేళన ఛాయ గోచరించింది. కేటీ కోపంతో కస్సుమంటూ తల ఎగరవేసింది. "అతను యిక్కడకు యెక్కువగా అతని మంచికి మించి వస్తుంటాడని మాకు తెలుసు."

లావణ్య చకితురాలయింది. వారెవరో గ్రహించింది. పొరపాటును గుర్తించింది. "అమ్మను పిలుస్తాను. అన్ని విషయాలు ఆమె చెపుతుంది," అంది కలవరపడుతూ.

ఇలా చెప్పి లావణ్య లోపలికి వెళ్ళింది. కేటీ సురమకేసి తిరిగి ముక్తసరిగా "మీ పంతులమ్మా?" అని అడిగింది.

"ఆఁ– అవును."

"ఆమె పేరు లావణ్య అనుకుంటాను."

"అవును."

"అగ్గిపెట్టివుందా?" అని కేటీ ఇంగ్లీషులో అడిగింది. సంభాషణ అగ్గిపెట్టిమీదకు హఠాత్తుగా మారేసరికి ఆ మాటల అర్థం సురమ గ్రహించలేక కేటీముఖంవంక తేరి పారజూచింది.

"అగ్గిపెట్టి" అని కేటీ బెంగాలీభాషలో వివరించింది. అపుడు సురమ అగ్గిపెట్టి తెచ్చిచ్చింది. సిగరెట్టు వెలిగించుకుని తాగుతూ, "యింగ్లీషు నేర్చుకుంటున్నావా?" అని అడిగింది.

సురమ తలాడించి ఇంటిలోకి పరుగెత్తింది.

"యీపంతులమ్మ దగ్గిర యీబాలిక యేమి నేర్చుకున్నా నేర్చుకోకపోయినా మర్యాద మన్ననా నేర్చుకోలేదు," అని వ్యాఖ్యానించింది కేటీ.

ఆ మిత్రద్వయం తమలో తాము ఇలా వ్యాఖ్యానించుకుంటూనే వున్నారు.

"సుప్రసిద్ధ లావణ్య! భేష్! షిల్లాంగ్ కొండలలో అమిత కఠిన మనోభూమిని బద్దలు కావించిన భూకంపాన్ని సృష్టించిన మహాశక్తి! ఛీ! పురుషులు తమాషా మనుష్యులు."

సిసీ బిగ్గరగా నవ్వింది. మనసారానవ్విన ఆనవ్వులో ఉదారతపొడగట్టింది. పురుషులను మూర్ఖులని ఆమె తృణీకరించలేదు. అందాకా ఎందుకు,ఆమెస్వయంగానే కఠినాతి కఠిన భూమిని ముక్కలు ముక్కలుచేసే భూకంపాన్ని సృష్టించింది కాని ఇది విచిత్ర వ్యవహారం. ఒక వేపున కేటీ, ఇంకో వేపున నోటిలోవేలుపెడితే కొరకలేనంత అమాయకంగా అసాధారణ దుస్తులలో కనిపించే పంతులమ్మ. తడిపీలికలమూట! వర్షాకాలంలో బిస్కట్టు బూజులాగా మనసును బూజు పట్టించగలదు. అమిత ఒక్క క్షణమయినా ఎలా సహించగలుగుతున్నాడో!

"సిసీ! మీఅన్నగారి మనసు తలకిందులుగా నడుస్తూంటుంది. ఒకానొక వ్యక్తి ప్రతికూల చిత్తవృత్తిలో ఆమె దేవకన్యలా కనిపించి వుంటుంది. సందేహంలేదు."

ఇలా చెపుతూ కేటీ మేజామీద బీజగణిత గ్రంథానికి సిగరెట్టు ఆనించి వెండిగొలుసు సింగారపు సంచిని తెరిచి కొద్దిగా మొహానికి పౌడరు అద్దుకుని, కనుబొమలు అంజన తూలికతో తిరగి తీర్చి దిద్దుకుంది. సోదరుని వివేక శూన్యతకు సిసీకి కోపం రాలేదు. పైగా అనుకంపన కలిగింది. పురుష నేత్రాలను ఆకర్షించే కృత్రిమ దేవకన్యల మీదనే ఆ కోపమంతా. సోదరుని విషయంలో సిసీ చూపే ఉదాసీనతను

కేటీ సహించలేకపోయింది. గట్టిగా చివాట్లు పెడదామని తల పోసింది.

సరిగ్గా ఆ సమయానికి యోగమాయ తెల్లని పట్టుచీర కట్టుకుని వచ్చింది. లావణ్య మాత్రం రాలేదు. కేటీ టాచీ అనే కుక్కను వెంటబెట్టుకుని వచ్చింది. దాని దట్టమయిన బొచ్చు కళ్ళమీద వేలాడుతోంది. లావణ్య సురమాల విషయంలో వాసన పరిచయంతో తృప్తి చెందింది. కాని యోగమాయ కనిపించేసరికి దానిమనసులో ఉత్సాహం రేకెత్తింది. ఆమె వద్దకు పరుగెత్తుతూ వెళ్ళి నాలుగు పాదాలు పైకెత్తి శుభ్రంగా ఉన్న ఆమె చీరమీద మట్టితో చిత్రాలు చేసి ఆమె మీద అవ్యాజ ప్రేమను వెల్లడించింది. సిసీ దాని మెడ తాడును పట్టుకుని కేటీ దగ్గరకు లాగింది. కేటీ తన ముక్కును చూపుడు వేలులో తట్టుకుంటూ, "కొంటె కుక్క!" అని తిట్టింది.

కేటీ కుర్చీమీదనుంచి లేవలేదు. సిగరెట్టు కాలుస్తూ యోగమాయకేసి తలతిప్పి విస్పష్ట నిశ్చింతాభావంతో తేరి పారజూచింది. లావణ్యమీదకంటె యోగమాయ మీదనే ఆమెకు కోపం ఎక్కువని స్పష్టమవుతోంది. లావణ్య గత చరిత్ర మలినమయింది, యోగమాయ పిన్ని వేషంలో అమితను మాయచేసి ఆమెను కట్టబెట్టాలని యెత్తులు వేస్తోంది అని ఊహించ సాగింది కేటీ. పురుషులను మోసపుచ్చ

డానికి పెద్ద తెలివితేటలు అక్కరలేదు విధి వారికళ్ళకు ఇది వరకే గంతలు కట్టింది.

సిసీ ముందుకువచ్చి యోగమాయకు నమస్కారం నటించి, "అమిత చెల్లెలు సిసీని," అంది.

యోగమాయ మందహాసంచేసి, "అమిత నన్ను పిన్నీ అని పిలుస్తాడు. అందుచేత నీకూ పిన్నినే ఆ హక్కు నాకువుంది," అన్నది.

కేటీ వైఖరిదృష్ట్యా యోగమాయ ఆమెను గమనించ లేదు. సిసీతో, "రా అమ్మా! లోపలికిరా," అంది.

"వ్యవధి లేదు. అమిత యిక్కడున్నాడేమో కను క్కుందామని వచ్చాను," అంది సిసీ.

"యింకా రాలేదు," అంది యోగమాయ

"యెపుడు వస్తాడో తెలుసా?"

"చెప్పలేను. వెళ్ళి తెలుసుకుని వస్తా."

కుర్చీలోనుంచి లేవకుండానే కేటీ "యిక్కడ చదువు చెప్పే పంతులమ్మ అమితను యెన్నడూ కలుసుకోనేలేదని చెప్పింది," అంది.

యోగమాయ ప్రమాన్పడి పోయింది. గొడవ జరిగి నట్టుందని పసిగట్టింది. వారిముందు ఆత్మగౌరవం నిలబెట్టు

కోవడం కష్టమనికూడా గుర్తించింది. పిన్నివరసను వదలివేసి "అమితరాయ్ మీ హోటలులోనే వుంటున్నాడని తెలుస్తోంది. అలాంటప్పుడు అతని ఆచూకీ మీకు తెలియకుండా వుంటుందా?" అంది.

కేటీ విరసంగా నవ్వింది. ఆ నవ్వు మాటలలో పెట్టితే "నువు దాచవచ్చు, కాని మోసగించలేవు," అనే అర్థం వస్తుంది

లావణ్య కంటపడడం, అమితను యెరగనని చెప్పడం కేటీకి కోపాగ్నిని జ్వలింపజేసాయి. కాని సిసీ వ్యాకుల పడిందేగాని కోపగించుకోలేదు. యోగమాయ రమణీయాకృతి ఆమెను ఆకర్షించింది. కుర్చీలోనుంచి లేవకుండా కేటీ ఆమెను ఘోరంగా అవమానించినందుకు కలవర పడింది. కాని ఏవిషయంలోనూ కేటీకి విరుద్ధంగా ఆమె పోలేదు. కేటీ విద్రోహమును వెనువెంటనే అణచివేస్తుంది. కర్కశంగా వ్యవహరించడానికి వెనుదీయదు. బెదిరింపులకు భయపడి అధిక సంఖ్యాకులు లొంగిపోతారు. తన నిరంతర కఠోరతకు కేటీ గర్వపడేది తీయతీయగా మాట్లాడే పెద్ద మనిషి లక్షణం తనమిత్రమండలిలో ఏమాత్రం కనిపించినా వారిని ఎన్నడూ క్షమించేది కాదు. నిష్టాపత్యం అనేపేరుతో తన క్రూరతను వారిపై ప్రదర్శించేది. దాని ఆఘాతానికి వెన కడుగువేసేవారు. శాంతికోసంఆమెను సంతోషపెట్టడానికి చేయ

గలిగించడంతా చేసేవారు. అటువంటి వారిలో సిసీ ఒకతె. లోలోపల కేటీ అంటే భయపడుతున్నకొద్దీ తాను భయస్తురాలను కానని రుజువు చేసుకోవడానికి కేటీని అనుకరించేది. కాని ఎల్లప్పుడూ అలా చేయగలిగేది కాదు. సిసీ మనసు మారుమూలలో తనచేష్టలకు అసమ్మతి నెలకొనివుందని కేటీ ఊహించింది. ఈ సందేహాలను యోగమాయ ముందు అణచివేయాలి. అందుకని కేటీ లేచి సిసీపెదవుల మధ్య సిగరెట్టు పెట్టి తన సిగరెట్టుతో ఆసిగరుట్టు వెలిగించడానికి ముఖం ముందుకు పెట్టింది. అభ్యంతర పెట్టడానికి సిసీకి ధైర్యం లేకపోయింది. గాని సిగ్గుతో ఆమె మొహం మ్రెరబారింది.

సరిగ్గా ఈ సమయానికి అమిత చక్రవచ్చాడు. ఆ యువతులు అదిరిపోయారు. కోటలోనుంచి బయలుదేరేటప్పుడు సూటు, ఫెల్ట్ హాటు ధరించాడు ఇప్పుడు ధోవతి కట్టుకుని శాలువ వేసుకున్నాడు. అతని కుటీరంలో దుస్తులు మార్చుకున్నాడు. ఆ కుటీరంలో పుస్తకాల అలమారా, బట్టలతో నిండిన పెట్టె, యోగమాయ ఇచ్చిన పడకకుర్చీ ఉన్నాయి. ఉదయం ఫలహారానంతరం ఆ కుటీరంలో తల దాచుకున్నాడు. ఇటీవల లావణ్య శిక్షణ విషయంలో ఖచ్చితంగా ఉంటోంది. సురమకు చదువు చెప్పేటప్పుడు జలపాతం నారింజల కోసుకుని ఎవరినీ చదువుకు ఆటంకం కలిగించడం లేదు. అందువల్ల సాయంకాలం నాలుగున్నర గంటలకు

తేనీరు తీసుకునేటప్పుడుగాని అమిత ఆ ఇంటిలో ప్రవేశించ డానికి వీలులేదు. భౌతిక ఆధ్యాత్మిక తృష్ణను తీర్చుకోవడానికి వేరు మార్గంలేదు. అప్పటివరకు ఏదోవిధంగా కాలక్షేపంచేసి దుస్తులు మార్చుకుని నిమిషంకూడా ఆలస్యం చేయకుండా సరయిన వేళకు వచ్చేవాడు.

కోటలోనుంచి బయలుదేరే ముందే కలకత్తానుంచి ఉంగరం వచ్చింది. లావణ్యా వేలికి ఆ ఉంగరం పెట్టడం భావనాజగత్తులో ఊహించుకోసాగాడు. ఆ రోజు అతనికి పండగ. బయట ద్వారంవద్ద పండగను ఆపివేయడం తగదు. నేడు యితరపనులన్నీ కట్టిపెట్టాలి. మేజాముందు కూర్చున్న లావణ్యా దగ్గరకు తిన్నగావెళ్ళి, "ఒక రోజున రాజు యేనుగ నెక్కి వచ్చాడు. కాని గేటు ఎత్తుతక్కువ. తల వంచవలసి వచ్చింది. తలవంచి కొత్తగా కట్టించుకున్న రాజభవనం లోనికి ప్రవేశించకుండా వెనకకు తిరిగి వెళ్ళిపోయాడు. యీ రోజు మన జీవితంలో మహాదినం. కాని తీరుబడి గేటును ఎత్తు తక్కువగా కట్టించావు రాజు తలయెత్తుకుని నీ యింట ప్రవేశించేందుకు దానిని పడగొట్టేసేయి," అని చెప్పదల చాడు. "సరయిన వేళకు రావడమే నిర్ణీత సమయపాలనకు అర్థం. కాని గడియారం చూపేకాలం నిజమయింది కాదు. గడియారం అంకెలతో వేళను తెలుపగలదేగాని దాని విలువను యెలా తెలుసుకోగలదు?" అని కూడా చెప్పాలనుకున్నాడు.

బయటకు చూశాడు. ఆకాశం మబ్బులతో బూడిద రంగుగా ఉంది. వెలుగు సాయంకాలం అయిదారుగంటలను ఉండే వెలుగు చాలాకాలంగా జ్వరంతో బాధపడే పిల్ల వాడి శరీరం తాకితే చల్లగా ఉన్నా ఉష్ణమానం తన ఆశలను భగ్నంచేస్తుందేమోనని భయపడే తల్లిలాగా, గడియారం ముళ్ళు ఆకాశంచూపించే గంటలను తప్పు అంటాయేమోనని దానివంక అమిత చూడలేదు.

ఈరోజున అమిత నిర్ణీతకాలానికి చాలాముందుగానే వచ్చాడు ఆతురతకు సిగ్గంటూ ఉండదు.

వరండాలో లావణ్యా కూర్చుని సురమకు చదువుచెప్పే స్థలం రోడ్డు మీదికి కనిపిస్తుంది. నేడు నిర్మానుష్యంగా ఉంది. అతని హృదయం సంతోషంతో గంతులువేసింది. గడియారం వంక చూశాడు. మూడుగంటల ఇరవయి నిమిషాలు మాత్రమే అయింది. మొన్న మొన్ననే లావణ్యాతో నియమ పాలన మానవవిధి అని దేవతల విధికాదని చెప్పిఉన్నాడు. స్వర్గంలో నియమపాలనవిధి కాని దేవతల అమృతం సేవించ డానికి మనం భూమిమీద నియమపాలన చేయాలి. ఆ స్వర్గం ఒకొకపుడు భూమిమీదనే గోచరిస్తుంది. అటువంటి సమయంలో మనం నియమభంగంచేసి దానిని గౌరవించాలి. నియమభంగంలోని గౌరవాన్ని లావణ్యాకూడా గుర్తించిందని మహోదిన స్పర్శఅనుభవించి సర్వసాధారణ అడ్డంకులను తొలగ దోసిందని భావించాడు.

దగ్గరకువచ్చి చూసేసరికి ద్వారంముందు యోగమాయ నేలను అంటుకుపోయినట్టు నిలబడిఉంది. సిసీ కేటీ సిగరెట్టుతో తన సిగరెట్టు వెలిగిస్తోంది. బుద్ధిపూర్వకంగా యోగమాయను అగౌరవ పరుస్తున్నారని తక్షణమే ఊహించాడు. టాచీ ప్రథమమైత్రీ ప్రకటనలో భంగంపొంది కేటీ పాదాలదగ్గర కునికిపాట్లుపడ యత్నిస్తోంది. అమిత సమీపించగానే అతనికి స్వాగతమివ్వడానికి కదిలింది గాని సౌజన్య ప్రదర్శనకు తగిన సమయం కాదని సిసీ గట్టిగా జ్ఞాపకం చేసింది.

అమిత వారిద్దరివంక చూడలేదు. "పిన్నీ!"అని పిలుస్తూ వచ్చి యోగమాయ పాదధూళి తీసుకున్నాడు. ఆ వేళలో ఈవిధంగా ప్రణామంచేయడం అతనికి అలవాటులేదు.

"పిన్నీ! లావణ్య యేదీ?"అని అడిగాడు.

"నాకు సరిగ తెలియదు నాయనా! ఆమె గదిలో వున్నదేమో!"

"కాని చదువు చెప్పడం కట్టిపెట్టే వేళ యింకా కాలేదే!"

"వీరు రాగానే ఆమె లోపలికి వెళ్ళిందనుకుంటా."

"యేమి చేస్తోందో వెళ్ళి చూదాం పద"

ఇతర ప్రాణుల ఉనికిని విస్మరించి అమిత యోగ మాయతో లోనికి వెళ్ళాడు.

"అవమానం! యింటికి పోదాం పద, కేటీ!" అంది సిసీ తీక్షణంగా.

కేటీకికూడా కోపం రేగింది. కాని విషయం తేల్చుకోవాలని తలపోసింది.

"ఫలితమేమీ వుండదు" అంది సిసీ.

"యేదో ఒక ఫలితం కనిపించితీరాలి" అంది కేటీ. ఆమె పెద్దకళ్ళు బాగా విప్పారినాయి.

కొంతసేపు గడిచింది. సిసీ, "వెళదాం పద, యిక్కడ యేమాత్రం వుండబుద్ధి పుట్టడం లేదు," అని బతిమాలింది.

కాని కేటీ వరండాలోనుంచి కదలలేదు.

"యీ దోవనే రావలసివుంది," అంది కేటీ.

చివరకు లావణ్యాను వెంటబెట్టుకొని అమిత వచ్చాడు. లావణ్యా ముఖంలో రోషంగాని, ఆనందంగాని, గర్వంగాని ఇసుమంతయినా లేదు. ప్రశాంతతతో ప్రకాశిస్తోంది. యోగ మాయ లోపలనే ఉండిపోయింది. బయటకు రావడం మనస్కరించలేదు. అమిత వెళ్ళి ఆమెను తీసుకువచ్చాడు. లావణ్యా వేలి ఉంగరం కేటీ కంటబడింది. నెత్తురు నెత్తికెక్కింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. కాలి కింది నేలను తన్నాలని అనిపించింది

"పిన్నీ! యీమె నా చెల్లెలు శమిత. నా పేరుకు దీని పేరుకు ప్రాస సరిపోవాలనే ఉద్దేశంతో మా నాన్న యీ పేరు

పెట్టాడుగాని ఛంధోరహితంగా తయారయింది చరణం. యీామె కేతకి మా చెల్లెలి స్నేహితురాలు."

ఇంతలో ఇంకో ఉపద్రవం వచ్చి పడింది. సురమ పెంపుడు పిల్లి బయటకు వచ్చింది. ఆ పిల్లి పొగరబోతు తనం టాచీ వక్రబుద్ధికి పోరాటానికి సవాలు రేకెత్తించినట్లనిపించింది. మొదటగా మొరుగుతూ ముందడుగు వేసింది. తరవాత వెనకకు తగ్గింది. పై కెత్తిన పిల్లి పంజాలు గుర్తుకు భయపడింది. పోరాట ఫలితం విషయమయి టాచీకి అనుమానం కలిగించింది. తగినంత దూరంలో నిలబడి హింసించకుండా మొరగడం వీరత్వ లక్షణంగా భావించి ఎడ తెగకుండా విపరీతంగా మొరగ సాగింది. సవాలును అందుకోకుండా ఆ పిల్లి వెనుకకు తిరిగి వెళ్ళిపోయింది. కేటీ దీనిని సహించలేక పిచ్చి కోపంతో టాచీ చెవులు మెలిపెట్టింది. ఈ పిచ్చికోపానికి ఆమె అదృష్టదేవతగురికాలేదు. ఈనిరాదరణకు తీవ్రఅసమ్మతిసూచకంగా కుక్క కుయ్యోమని అరవసాగింది. దేవతలు మాట్లాడకుండా నవ్వారు.

ఈ గందరగోళం అణగిపోగానే అమిత సిసీకేసి తిరిగి, "సిసీ! యీామె పేరు లావణ్య. యీామెను గురించి నేను నీకు స్వయంగా చెప్పకపోయినా యితరులు అనేకమంది చెప్పే వుంటారు. మార్గశిర మాసంలో ఒక శుభముహూర్తాన కల

కత్తాలో వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాం" అన్నాడు.

కేటీ తక్షణమే చిరునవ్వు తెచ్చి పెట్టుకుంది.

"అభినందనాలు! యింతకీ నారింజ తేనె లభించడం కష్టంకాదనితోస్తోంది. మార్గం కష్టమయినది కాదు. తేనెవచ్చి నోటిలో పడింది."

అలవాటు చొప్పున సిసీ ముసిముసి నవ్వులు నవ్వింది కేటీ మాటలలోని ద్వేషాన్ని లావణ్య పసిగట్టింది గాని అంత రార్థం గ్రహించక పోయింది. అప్పుడు అమిత "యివాళ ఉద యం నేను బయటకు వెళుతూంటే యెక్కడికి వెళుతున్నావని అడిగారు. 'అడవి తేనె కోసం' అని నేను జవాబు చెప్పాను. అందుకు వీళ్ళునవ్వుతున్నారు. అది నాతప్పు. నేను పరియాచ కానికి చెప్పినపుడు యితరులు సరిగా అర్థంచేసుకోలేరు"అని వివరించి చెప్పాడు.

"నారింజతేనె లభించిందిగా, నాకు మాత్రం నష్టం వచ్చేటట్టు చేయకు," అంది కేటీ ప్రశాంతస్వరంతో.

"నన్నేం చేయమంటావు?"

"నేను నరేన్‌తో పందెం వేశాను. పెద్ద మనుష్యుల విహార స్థలాలకు గుర్రపుపందాలకు వచ్చేటట్లు నిన్నెవరూ చేయలేరని అతనన్నాడు. నిన్ను గుర్రపుపందాలకు తీసుకుని

వస్తానని యీ వజ్రపుటుంగరం పందెం ఒడ్డాను. యీ జిల్లా లోని అన్ని జలపాతాలు, తేనె అంగళ్ళు నీకోసం వెదికాను. చివరకు యిక్కడ కనిపించావు. చాలా దూరం తిరగలేదా, సిసీ! యింగ్లీషులో అడవిబాతు వేట అనే విధంగా."

అందుకు జవాబుగా సిసీ ముసిముసి నవ్వులు నవ్వింది.

"అమిత్! ఒకసారి నువ్వు పారశీక తత్వవేత్తను గురించిన కథ చెప్పావే. అది యిప్పుడు జ్ఞాపకంవస్తోంది. దొంగలు అతని తలపాగా యెత్తుకు పోతే వారిజాడ తెలియక వెళ్ళి స్మశానంలో కూర్చుని 'యిక్కడ నా బారినుంచి తప్పించుకు వెళ్ళలేరు.' అన్నాడు. అమిట్‌ను మెరగనని లావణ్య చెప్పినప్పుడు నేను ఆశ్చర్యపోయాను. కాని చివరకు నువ్వు నీయీ శ్మశానభూమికి వచ్చితీరతావనియెవరో చెప్తున్నట్లు అనిపించింది"

సిసీ పెద్దగా నవ్వింది.

"అమిట్ నీపేరు యెత్తనేలేదు. నారింజతేనె విషయం తీయతీయని వుపమానాలతో చెప్పాడు. కాని వుపమానాలను ప్రయోగించడం నీవల్ల కాదు. మాట్లాడడంలో కిటుకులు నీకు తెలియవు. అమిట్‌ని మెరుగనని చటుక్కున అనివేశావు. ఆదివారం బడిలో చెప్పినట్లుగా కర్మదేవతలు మీలో యే ఒకరినీ శిక్షించలేదు. మీలో ఒకరు అలభ్య అమృతాన్ని

ఒక్క-గుక్క-లో తాగేస్తారు. యింకొకరు అపరిచితులనుకూడా ఒక్క- చూపులోనే గ్రహిస్తారు. యింతకీ నష్టపడేదానిని నేను. యెంత అన్యాయం సిసీ!" అన్నది కేటీ లావణ్యతో.

సిసీ తిరిగీ పెద్దగా నవ్వింది. టాచీకూడా ఈసంబరంలో పాలుపంచుకోవడం సమాజకర్తవ్యమని భావించి కదిలే చిహ్నాలు చూపించింది. కాని మూడోసారి కూడా చివాట్లు తిన్నది.

"యీ వుంగరాన్ని కోల్పోతే నా మనసుకు యిక శాంతివుండదని నీకు తెలుసు. అమిట్! యీ వుంగరం యిచ్చింది నువ్వు. ఒక క్షణం కూడా నా వేలునుంచి తీసి వేయలేదు. యిది నాలో ఒక భాగమయిపోయింది. యిన్ని సంవత్సరాల తరవాత పిల్లాంగు పందెంలో దీనిని కోల్పోవ డమా?" అంది కేటీ.

"దీనిమీద పందెం యెందుకు వేశావు?"అని అడిగింది సిసీ.

"అతి అహంకారం. పురుషునిలో అతినమ్రకం సరే. గర్వం పతనానికి దారి తీస్తుంది. పందెంవేసి ఓడిపోయాను. అమితమీద నా ప్రభావం నశించినట్లుంది. ఓ- క్రూరం! అంత ప్రేమతో నాకీవుంగరం యివ్వడమెందుకు? యిప్పుడు నన్ను తోసివేయడమెందుకు? దానిని యివ్వడంలో బంధనం

లేదా? నిను తోసిపుచ్చనని ఆ నాడు యెందుకు వాగ్దానం చేశావు?''

మాటాడుతూంటే కేటీ గొంతు బొంగురుపోయింది. ఎంతో కష్టంమీద కన్నీరు ఆపుకుంది.

ఏడు సంవత్సరాల కితం. అప్పటికి కేటీకి పద్ధెనిమి దేళ్ళు ఇద్దరూ ఇంగ్లండులో ఉంటున్నారు. ఆక్స్‌ఫర్డ్‌లో ఒక పంజాబీయువకుడికి కేటీమీద పిచ్చిప్రేమ పుట్టింది. ఒక రోజున అతను అమిత నదిమీద స్నేహపూర్వకంగా పడవ పందెం వేసుకున్నారు. ఆ పందెంలో అమిత గెలిచాడు. జూన్ వెన్నెలలో ఆకాశమంతా శబ్దజాలంతో నిండిపోయింది. మైదానాలలోని పువ్వుల ఆనంద కోలాహలం భూమి స్థయి ర్యాన్ని దొంగిలించింది. అటువంటి సమయంలో అమిత ఆ వుంగరాన్ని కేటీవేలికి పెట్టాడు. అది పెద్ద రహస్యం కాకపోయినా అందులో ఎంతో అర్థం ఉంది. - ఆ రోజులలో కేటీ మొహానికి కోటావేసుకునేది కాదు. ఆమె నవ్వు సహజంగా ఉండేది. మనోభావాలు రేకెత్తినపుడు నిరాటం కంగా చెంపలు యెరుపెక్కేవి. ఆమె వేలికి ఉంగరం పెడుతూ "యిది సుకుమార నిశి, హఠాత్తుగా సింహాసన మధిష్టించె చందమామ!'' అని చెవిలో చెప్పాడు.

కేటీ అప్పటికింకా బాతాఖానీ కొట్టడం నేర్చుకో లేదు. దీర్ఘంగా ఊపిరిపీల్చుకుని తనలో తాను 'నామిత్రుడు' అని గొణుగుకుంది.

ఇప్పటికీ అమిత జవాబు చెప్పడానికి సిద్ధంగా లేదు. ఏమి చెప్పాలో అతనికే తోచలేదు.

"పందెంలో నేను నిజంగా ఓడిపోతే నా అంతిమ పరాజయ చిహ్నంగా దీనిని నీ దగ్గరే వుంచుకోవడం వుత్తమం. యిక నా వేలిమీద యిది అబద్ధాలకు వుండ రాదు." అని చెప్పి కేటీ వుంగరంతీసి మేజామీద పడవేసి తొందర తొందరగా బయటికి వెళ్ళింది చెంపలమీదకు కన్నీరు ప్రవహించింది.

# ఏ ము క్తి

శోభనలాల్ వ్రాసిన చిన్నజాబు లావణ్యకు చేరింది. "క్రిందటి రాత్రి నేను పిల్లాంగు చేరుకున్నాను నువు అను మతిస్తే వచ్చి నిన్ను కలుసుకుంటాను. లేకపోతే రేపుబయలు దేరి వెళతాను. నువు నన్ను శిక్షించావు. కాని నేను నీకు ఎప్పుడు ఏమి అపరాధం చేశానో అర్ధంకావడంలేదు. నేనేమి అపరాధం చేసిందీ నువు చెపితేగాని నామనసుకు శాంతి వుండదు. అందుకే నేడు నేను నీదగ్గరకు రాదలచాను. భయ పడవద్దు. యింకే వుపకారం చేయవలసిందని నిన్ను అర్థించను."

లావణ్య కనులు భాష్పజలంతో నిండిపోయాయి. వాటిని తుడుచుకుంది. గతాన్ని నెమరు వేసుకుంటూ మౌనంగా కూర్చుంది. సున్నిత ప్రేమలతను అణచి పార వేయడానికి కారణభూతమయిన యవ్వన భీతిని గురించి ఆలోచించింది. ఆ జీవితమునే అవలంబించి ఆ లతను పోషించి తే ఈపాటికి పుష్పించేది. కాని తన విజ్ఞానానికి గర్వపడింది. చదువులో మునిగిపోయింది. స్వేచ్ఛ ఉందనే అహంకారం బలిసింది. తండ్రి మోహంలో చిక్కుకోవడం చూసి ప్రేమను బలహీనత కింద జమకట్టింది. ఇప్పుడు ప్రేమ పగ తీర్చుకుంది. గర్వం మట్టిలో కలిసింది. ఒకప్పుడు ఊపిరి పీల్చడంలాగా నవ్వడంలాగా తేలికయిన విషయం ఇప్పుడు కష్టంగాతయారయింది. పూర్వ జీవితంలోని అతిధికి హృదయ పూర్వకంగా స్వాగత మివ్వడం సాధ్యంకాదు. తరిమివేయడం బాధాకరం. ఆ రోజులలో తన తృణీకారంతో గాయపడి చిన్నబుచ్చుకున్న శోభన లాల్ రూపం గురించి ఆలోచించింది. ఇదంతా జరిగి చాలా సంవత్సరాలయింది. ఆ యువకుని తృణీకృత ప్రేమ ఏ అమృతం సేవించి ఇంతకాలం జీవించగలిగిందో? అతనిలోని సహజ ఔదార్యమే దీనికి కారణం.

లావణ్య ఇలా జవాబు వ్రాసింది:

"నువ్వు నా పుత్తమ స్నేహితుడివి. నీ స్నేహ కానుకకు ప్రతిఫలం ముట్టజెప్పడానికి నాకు సంపదేమీ లేదు. ప్రతి

ఫలం నువ్వు కోరలేదు. నువ్వు యివ్వగలిగింది యివ్వడానికి నువీ రోజున వచ్చావు. మరేమీ కోరలేదు. నీ కానుకను నిరాకరించి తరిమివేయగల అహంకారంగాని, శక్తిగాని లేదు."

ఉత్తరం అలా పంపించిందో లేదో అమిత చక్కా వచ్చాడు.

"రా, వన్యా! బయటకు వెళదాం," అని లావణ్య నిరాకరిస్తుందేమోననే భయంతో బిడియపడుతూ అడిగాడు. కాని ఆమె సరళంగా, "సరే పద," అంది.

వారిద్దరూ బయటకు వెళ్ళారు. కొద్దిగా తటపటా యిస్తూ అమిత లావణ్య చేతిని పట్టుకున్నాడు. ఆమె అభ్యం తరం చెప్పకుండా చేతిని పట్టుకోనిచ్చింది. అమిత ఆమె చేతిని గట్టిగా నొక్కాడు. ఈ విధంగా అమిత తన మనోభావాలను వ్యక్తం చేశాడు. మాటలు నోటినుంచి వెలువడలేదు. నడుస్తూ నడుస్తూ ఇదివరలో తాము సందర్శించిన స్థలానికి వచ్చారు. అక్కడ అడవిలో హఠాత్తుగా మార్గం కని పించింది. సూర్యుడు కిందికివాలి చెట్టూచేమలేని కొండ శిఖరాన్ని ఆఖరిసారిగా స్పృశిస్తున్నాడు. పసరికల లేత రంగులు ఎవరికీ తెలియకుండా లేతనీలి వర్ణంలో కరిగి పోతు న్నాయి. వారు అక్కడ ఆగి ఆ దృశ్యాన్ని తిలకించ సాగారు.

లావణ్య మెలమెల్లగా, "యింకొకరి వేలికి పెట్టిన వుంగరాన్ని నేను దొంగిలించేటట్లు యెందుకు చేశావు?" అని అడిగింది.

ఈ మాటలకు అమిత చాలా బాధపడ్డాడు. "నీకు అర్థమయేటట్టు ఎలా చెప్పగలను, వన్యా! వుంగరం ఇంకొకరి వేలికి పెట్టాను యీ రోజున దానిని తిరిగి యిచ్చివేసిన వ్యక్తి ఆ వ్యక్తేనా?"

"సృష్టికర్త ప్రేమహస్తం దానిని మాలో ఒకదానిని రూపొందించింది. నీ వుపేక్ష రెండవ దానిని రూపొందించింది," అని సమాధానమిచ్చింది లావణ్య.

"అది పూర్తిగా నిజం కాదు. కేటీ యిలా తయారు చేసిన ఆఘాతాలు నేను కొట్టినవి కావు."

"కాని ఒకపుడు ఆమె పూర్తిగా నీకు తనను అర్పించుకుంది. నీ దానినిగా యెందుకు చేసుకోరాదు? యేకారణంవల్లనయినాగానీ ముందుగా ఆమెమీాది పట్టును సడలించి వెళ్ళనిచ్చావు. ఆ తరవాత అనేకమంది ప్రస్తుత రూపం తీసుకువచ్చారు. నిన్ను కోల్పోవబట్టే యితర రుచులను అలవరించుకుంది. అందుకనే విదేశీ బొమ్మలాగా కనిపిస్తోంది. ఆమె హృదయంలో జీవం వుంటె యిలా జరిగేది కాదు. సరే,

యీ విషయం యింక మాట్లాడకుండా వుండడం మంచిది. నేను నిన్నొక వరం కోరుతున్నాను. సరే అనవలసిందే."

"సరే అలాగే. యేమిటా వరం?"

"నీ మిత్రులను వారం రోజులపాటు చిరగంజీకి తీసుకు వెళ్ళు. ఆమెను నువ్వు సుఖపెట్టలేకపోయినా ఆమెకు వినోదం కలిగించగలుగుతావు."

"సరే," అన్నాడు అమిత కొద్దిసేపు ఆగి.

లావణ్య అమిత వక్షంమీద తల ఆనించింది. "నేను తిరిగి యెన్నడూ చెప్పలేని విషయం చెప్పదలచాను, మితా! మన ఆంతర బంధనం నీ చేతులను యేమాత్రం కట్టివేయ కూడదు. నేను కోపంతో ఈమాట చెప్పటంలేదు. సంపూర్ణ నిండుప్రేమతో చెప్పుతున్నాను. నాప్రేమకు బాహ్యచిహ్నాలు ఛాయలు అవసరంలేదు."

ఇలా చెప్పి వేలినుంచి ఉంగరంతీసి లావణ్య అమిత వేలికి పెట్టింది. అమిత అభ్యంతరం పెట్టలేదు.

సాయంకాలమయింది. అస్తమయ సూర్యకాంతిలో మునిగిన ఆకాశంకేసి పృథ్వి మౌనంగా ముఖం ఎత్తింది. అదే నిశ్చల ఉజ్వల ప్రశాంతంలో లావణ్య తనముఖంకూడా అమిత ముఖంకేసి ఎత్తింది.

# స మా ప్తి

వారం రోజుల తరవాత అమిత యోగమాయ ఇంటికి తిరిగీ వచ్చాడు. ఇల్లు మూసి ఉంది. అంతా వెళ్ళిపోయారు. వారెక్కడికి వెళ్ళిందీ తెలిపే సూచనలు కానరాలేదు.

చిరపరిచిత నీలగిరి తైల వృక్షం కింద నిలబడ్డాడు. వ్యథతో అటూ ఇటూ తిరగసాగాడు. తోటమాలి వచ్చి నమస్కరించి, "తలుపు తెరవమంటారా! లోపలికి వెళతారా!" అని అడిగాడు.

"అఁ—" అని సమాధానం చెప్పాడు కొద్దిగా తట పటాయిస్తూ

అమిత లావణ్య కూర్చునే గదిలోకి వెళ్ళాడు. మేజా బల్ల, కుర్చీ, అలమారా యథా ప్రకారంగా ఉన్నాయిగాని పుస్తకాలుమాత్రం లేవు. లావణ్య పేరు చిరునామా వ్రాసిన కవర్లు చినిగి ఖాళీగా నేలమీదపడి ఉన్నాయి. ఆ దస్తూరీ అమిత ఎవరిదో ఎరగడు. వాడి పారవేసిన రెండు మూడు పాళీలు, అరిగిపోయిన పెనసలు ముక్కలు మేజామీద కనిపించాయి. పెనసలును అమిత జేబులో వేసుకున్నాడు. ఆ గది సరసనే పడక గది. అందులో ఇనప మంచం పరుపు, అలంకర

బల్లమీద ఖాళీ నూనె సీసా మాత్రం ఉన్నాయి అమిత పరుపుమీద వాలి రెండు చేతులతోను పట్టుకున్నాడు. ఇనప మంచం కిర్రుమంది. ఆ గది మౌన శూన్యతతో నిండిపో యింది. ఎన్నటికీ భగ్నంకాని మైమరపులో అతని ప్రశ్నలకు ఆ గది సమాధానమీయలేదు.

అమిత అతని స్వంత కుటీరంలోకి వెళ్ళాడు. శరీరం, మనసు పూర్తిగా అలసట చెందాయి. ప్రతీదీ వదలినప్పటి లాగానే ఉంది. పడక కుర్చీ అక్కడనే ఉంచె. యోగమాయ దానిని తీసుకువెళ్ళలేదు. ప్రేమపూర్వక బహుమతిగా దానిని వదలి వెళ్ళిందని అమిత గ్రహించాడు. 'నాయనా!' అని మృధుమధురంగా సరళంగా పిలవడం వినిపించింది. నేలను నుదిటితో తాకి కుర్చీముందు ప్రణమిల్లాడు.—షిల్లాంగు కొండలు ఇంకేమాత్రం రమణీయంగా కనిపించలేదు. అమితకు ఎక్కడా శాంతి చిక్కలేదు.

# శేష కవిత

యతిశంకర్ కలకత్తాలోని ఒక కళాశాలలో చదువు తున్నాడు. కలుటోలా ప్రెసిడెన్సీ కాలేజీ వంటశాలలో భోజనం. అమిత భోజనానికి తన ఇంటికి తరుచు తీసుకు వెళు తూండేవాడు. అతనితో కలసి రకరకాల పుస్తకాలు చదివే

వాడు. విచిత్ర భాషణతో అతని మనసును ఆదరగొట్టేవాడు. తన కారులో షికారుకు తీసుకువెళ్ళేవాడు.

ఆ తరవాత యతిశంకర్ అమితని గురించి నిర్దిష్ట సమాచారం తెలియలేదు. కానిటాల్‌లో ఉన్నాడని ఒకమారు, ఉదకమండలంలో ఉన్నాడని ఒకసారి విన్నాడు. అమిత కేటీమిత్ర బయటి రంగును తుడిచివేయనున్నాడని వేళాకోళంగా అమిత మిత్రుడు అనడం ఒకనాడు విన్నాడు. అతనికి మనస్కరించే కార్యకలాపం, 'రంగు మార్పు' ను చేపట్టాడు. అంతకు పూర్వం అతనిలోని సృజనాత్మక కాంక్షను మాటలతోనే తీర్చుకుంటున్నాడు. ఇపుడు సజీవ మానవ వ్యక్తిని చేపట్టాడు. ఇక ఆ వ్యక్తికూడా అంతిమ ఫలం సిద్ధిస్తుందనే ఆశతో పూత రేకులను విదల్చడానికి ఇష్టపడుతునేఉంది. అమిత సోదరి లిసీ, కేటీ గుర్తుపట్టరానంతగా మారిపోయిందని అంటె అతి స్వాభావికంగా గోచరిస్తోందని, అన్నట్టు వినికిడి. తనను కేతకి అని పిలవవలసిందని స్నేహితురాండ్రను అడిగింది కూడా. అలా అడగడానికి సిగ్గుపడలేదు. నమ్రతగల కన్య అర్ధ నగ్నతకు దారితీసే అతి సున్నిత శాంతిపురివస్త్రాల దుస్తులను విసర్జించి గౌరవాస్పదమయిన ముతక దుస్తులు ధరించినట్టు ఉంది. అమిత ఏకాంతంలో ఆమెను 'కేయా' అని పిలిచేవాడని వాడుక. నయినటాల్ సరోవరంమీద పడవ షికారు వెళ్ళినపుడు కేటీ తెడ్లు వేస్తూంటే అమిత రవీంద్రుని

'లక్ష్యహీనయాత్ర'ను చదివి వినిపించాడని రహస్యంగా చెప్పు కునేవారు. కాని లోకులు కాకులు. తెరచాప ఎత్తారని అమి తను నోనోక సెలవుదిన తత్వప్రవాహంలో ప్రయాణం చేస్తాం దని స్పష్టంగా గ్రహించాడు.

అమిత ఎలాగయితేనేం తిరిగి వచ్చాడు. అతను కేతకీ వివాహం చేసుకోనున్నారని పుకార్లు వ్యాపించాయి. కాని అమిత యతికి ఈ విషయంలో మాట మాత్రంగానయినా చెప్పలేదు. అమిత వైఖరిలోకూడా పెద్ద మార్పు వచ్చింది. ఇంగ్లీషు పుస్తకాలు కొని యతికి ఇస్తూనే ఉన్నాడుగాని వాటిని గురించి యతితో చర్చిస్తూ సాయంకాలాలు గడపడం లేదు. అమిత చర్చా ధోరణి నూతన మార్గం పట్టిందని యతి ఊహించాడు. యతిని కారులో షికారుకు రమ్మని అమిత ఇప్పుడు ఆహ్వానించడంలేదు. అమిత 'లక్ష్యహీనయాత్ర'లో మూడవ వ్యక్తిని తీసుకువెళ్ళడం సాధ్యం కాదని వయసును బట్టి యతి భావించడం కష్టం కాదు.

యతి ఇక ఏ మాత్రం ఉండబట్టలేక సూటిగా అమి తను, "అమిత్! నువు కేతకీ మిత్రను వివాహం చేసుకోబోతు న్నావటగా?" అడిగాడు.

ఒక క్షణం ఆగి అమిత, "లావణ్యా యీ సంగతి విన్నదా?" అని అడిగాడు.

"ఊహూc- నేను రాయలేదు. నీ నోటితో నువ్వు చెప్ప నిదే చెప్పదలచుకోలేదు."

"ఆ సంగతి నిజమేకాని లావణ్య అపార్థం చేసుకుం టుందేమోనని భయపడుతున్నాను"

యతి నవ్వి "యిందులో అపార్థం చేసుకోవడాని కేముంది? నువ్వు పెళ్ళిచేసుకుంటే చేసుకుంటావు. సాధారణ విషయం."

"చూడు యతి! మానవజాతికి సామాన్య విషయ మంటూ లేదు. నిఘంటువులో ఒకేఒక అర్థం వున్న మాటకు సాగరసంగమంలో గంగానదిలాగా మానవ జీవి తంలో అర డజను అర్థాలు వుంటాయి"

"అంటే వివాహానికి అర్థం వివాహం కాదనా?"

"వివాహం అనేమాటకు వేయి అర్థాలు వున్నాయని సూచించదలచాను. అది మానవ జీవితంలో అర్థవంతమవు తుంది. మనిషిని మినహాయిస్తే దాని అర్థం అనుమానంలో పడుతుంది."

"అయితే నీ అర్థమేమిటో చెప్పు!"

"దానిని నిర్వచించలేం. దానిలో జీవించాలి. దాని సారం ప్రేమ అని చెపితే నేను యింకో మాటలో పడ తాను. వివాహం కంటె ప్రేమ ముఖ్యమయినది."

"అలా అయితే యిక చర్చ ముగించవచ్చు మాటల బరువుకింద అర్థంకోసం మనం పొంచివుండవలసిందేనా? అది దాని యిష్టం వచ్చినట్టు దోబూచులాడుతూ కుడియెడమలకు చలిస్తూంటుంది. అలా యెవరూ కొనసాగించలేరు"

"బాగా చెప్పావు. నాతో సహచర్యం నీ నోటికి ఆవేశం కలిగించింది. ప్రపంచ కార్యకలాపాలను కొనసాగించడానికి మాటలు అత్యవసరం. మాటలకు అందని సత్యాలన్నింటినీ విపణివీధికి పనికివచ్చేటట్టు సరిచేయాలి. మాటలేముఖ్యం. యింతకంటె యింకేం చేయాలి? మేధాపరంగా అసంతృప్తికరమయినదే. కాని మనం కళ్ళు మూసుకుని పనులు చేసుకుపోతూంటాం."

"అయితే యీ చర్చను వదలివేయడమేనా?"

"ముఖ్య ప్రయోజనం లేకుండానే మేధా పరమయిన వ్యాయామమే అయితే వదిలివేసినా హాని లేదు."

"ముఖ్య ప్రయోజనమే వుందనుకో. అప్పుడు?"

"బలే! అలా అయితే విను."

సంక్షిప్తి సమీక్ష అప్రస్తుతం కాదనుకుంటా.

ఇటీవల యతి అతని సోదరి సిసీ చేతి టీ తాగడానికి తరుచు వస్తున్నాడు. అందుకనే అమిత అతనితో పూర్వంలాగా మధ్యాహ్నంపూట సాహిత్య చర్చలు జరపకపోయినా,

సాయంకాలంపూట కారులో షికారు తీసుకువెళ్ళకపోయినా పట్టించుకోలేదని నిర్ణయించుకోవడం నిర్హేతుకం కాదు. మన స్ఫూర్తిగా అమితను క్షమించాడు.

"ప్రాణ వాయువు గాలిలో కనిపిస్తుంది. లేకపోతే జీవం నిలవదు జీవితంలో అనేక రకాలగా వుపయోగపడే కాలిన బొగ్గుతో కలుస్తుంది. యే రూపంలో నయినా అది లేకపోతే బతకలేం. అర్థమయిందా?"

"పూర్తిగా అర్థం కాలేదు. కాని అర్థం చేసుకోవాలని వుంది."

"ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే ప్రేమ ఆత్మ మిత్రము. నిత్య కృత్యాలలో కలిసిపోయే ప్రేమ గృహిణి. వారిద్దరూ నాకు కావాలి."

"నువు చెప్పింది నాకు అర్థమయిందో లేదో కూడా తెలియదు. యింకా కొంచెం స్పష్టంగా చెప్పు."

"ఒక నాడు నేను రెక్కలు విప్పుకుని స్వర్గం వరకు విహరించాను. కాని యిప్పుడు నా రెక్కలు ముడుచుకు పోయాయి. నా చిన్న గూటిలో పడివున్నాను. కాని నా స్వర్గం అలానే వుంది."

"ఆత్మ మిత్రం, గృహిణి ఒకరే కావడం సాధ్యం కాదా?"

"సుఖప్రదమయిన సంఘటనలు జరగడం జీవితంలో సంభవమే కాని సంభవించవు. రాజకుమారుని అర్ధ రాజ్యాన్ని సంపాదించినవాడు అదృష్టవంతుడే కుడి చేతిలో రాజ్యాన్ని యెడమ చేతిలో రాజకుమార్తెను పట్టుకున్నవాడు, ఆ రెంటిని సమయిక్యం చేయలేకపోయినా అదృష్టవంతుడే."

"కాని—"

"కాని అది కల్పనా జగత్తులో నష్టపడుతుందా? యే మాత్రం నష్టపడదు నవలల రీతిగానే మన కల్పనా జగత్తును రూపొందించుకోవాలా? ఊహుఁ- నేను నా స్వంత కల్పనా జగత్తును నిర్మించుకుంటాను. యీ నా భూభాగంమీద కల్పనా జగత్తును నిర్మించుకుంటాను. ఒకదానికోసం యింకో దానిని మొత్తివేసే వారిని మీరు కల్పనా జగత్తు నిర్మాతలు అంటారు. వారు చేపలలాగా నీటిలో యీదాలి. లేకపోతే ఒడ్డున పిల్లులలాగా తిరుగుతూండాలి. లేకపోతే గబ్బిలాయిల లాగా గాలిలో విహరించాలి. నేను కల్పనా జగత్తుకు పరమ హంసను. నేను నేలమీద, నీటిమీద గాలిలో ప్రేమ సత్యాన్ని సాధిస్తాను. నదిలో నా గూడు గట్టిగా పాదుకుని వుంటుంది. మానస సరోవరం వేపుకు నేను యెగిరితే అనంత వాయు మార్గాన యెగురుతాను. నా లావణ్య చిరకాలం

వర్ధిల్లుగాక! నా కేతకి చిరకాలం వర్ధిల్లుగాక! అన్ని విధాలా అమితరాయ్ ధన్యుడవుగాక!"

ఈ భావం రుచించనట్టు యతిశంకర్ మౌనంగా కూర్చున్నాడు. అతని ముఖ కవళిక చూసి అమిత మంద హాసం చేశాడు.

"చూడు. ఒకనికి అమృతం మరొకనికి విషం. యిది నా ఒక్కడికే వర్తించవచ్చు నీకు వర్తింప జేసుకోవాలని యత్నించి నన్ను నిందించడం ప్రారంభిస్తే అపార్థం చేసుకుం టావు. ఒకరి అర్థాన్ని యింకొకరి మాటలకు పొందుపరచా లని చూస్తేనే యీ ప్రపంచంలో గందరగోళం పోరాటం సంభవిస్తాయి. నీ అర్థాన్ని యింకోసారి నీకు తేటతెల్లం చేయ డానికి యత్నిస్తాను. నేను అలంకారాలు వుపయోగించాలి. నగ్నంగా చెప్పితే సిగ్గు వేస్తుంది. కేతకికి నాకూ బంధనం ప్రేమ. కాని యీ ప్రేమ పాత్రలోని నీరు లాంటిది. నిత్యమూ వుపయోగిస్తుంటాను. లావణ్యా చెంతకు చేర్చే ప్రేమ సరోవరం లాంటిది. దానిని యింటిలోనికి తీసుకు రాలేం. కాని దానిలో నా మనసు విహరిస్తూంటూంది."

కొద్ది కలవరపాటుతో యతిశంకర్, "అయితే యీ యిద్దరిలో ఒకరిని యెంచరాదా!"

"మెంచుకో గలిగినవారు మెంచుకుంటారు. నేను మాత్రం మెంచుకోలేను."

"కాని శ్రీమతి కేతకి గనక—"

"ఆమెకు సర్వమూ తెలుసు. కాని పూర్తిగా గ్రహించిందో లేదో చెప్పలేను యే విధంగానూ ఆమె మోసం చేయలేదని రుజువుచేయడంలోనే నా జీవితం గడపుతాను. లావణ్యకు ఋణపడి వుందనికూడా ఆమెకు తెలియాలి."

"సరే అంతవరకు బాగానే వుంది. కాని లావణ్యకు నీ వివాహం సంగతి తెలియజేసి తీరాలి."

"తప్పకుండా తెలియజేద్దాం. కాని ముందుగా వుత్తరం పంపుతాను. నువు తీసుకుని వెళ్ళి యిస్తావా?"

"సరే. తీసుకువెళ్ళి యిస్తాను."

ఇదీ అమిత ఉత్తరం:

"రోడ్డు చివర మనం నిలబడ్డ సాయంకాలమే మన ప్రయాణమును కవితతో ముగించాను. నేడు కూడా నేను ఒక రోడ్డు చివర నిలబడ్డాను. యీ ఆఖరి క్షణాన్ని కవితతోనే గుర్తుపెడతాను. యింకే పదాల భారం నేను మోయలేను. దురదృష్ట నివారణ చక్రవర్తి చేపలాగా పట్టుబడగానే మృతి చెందాడు. యిక చేసే దేమీ లేదు. నా ఆఖరి మాటలను చెప్పే బాధ్యత నీ కవికి వదిలి వేసేయి:

నీ అంతర్ధాన పటంమీద
నీ రూపమే గాంతు నిరంతరమ్ము
హృదయ జ్ఞాత ప్రపంచంలో
గాంతును నీ అంతిమ ప్రకాశమ్ము
లభించెను నాకు పరశువేది
నాలోని శూన్యమును నింపితివి నీవే
నువు కానుకగా ప్రసాదించిన
పవిత్ర సాయం దీపం
కనుగొన్న మరుక్షణం
హృదయ దేవాలయంలో
జీవితం అంధకారమాయె.
వియోగ హోమాగ్ని నుంచి
దేవతా ప్రతిరూప ప్రేమ
విషాద కాంతిలో ప్రత్యక్షమాయె.

— మిత.

ఆ తరవాత కొద్ది కాలానికి కేతకి సోదరి కూతురు అన్నప్రాసన మహోత్సవానికి వెళ్ళింది. అమిత వెళ్ళలేదు. పడక కుర్చీలో కాళ్ళు పారజాపుకు పడుకున్నాడు. పాదాలు

ముందరి కుర్చీమీద ఆసీనించాడు. విలియం జేమ్సు ఉత్తరాలు చదువుతున్నాడు. ఇంతలో యతిశంకర్ లావణ్యా వద్దనుంచి ఉత్తరం తీసుకుని వచ్చాడు. ఒకవేపున ఆరు నెలల తరవాత జూన్‌లో శోభనలాల్‌తో లావణ్యా వివాహం రామగిరికొండల మీద జరుగుతుందని వ్రాసివుంది. రెండో వేపున ఇలా వ్రాసి ఉంది.

మిత్రమా! వినపడ లేదా
అంధకారంలో చక్రగర్జన
క్రూర కాల రథం
సుదూరానికి ధృతగతిలో తోయగ
పడియుంటెని నేడు అన్యప్రభాత శిఖరాన
వేయి స్మృతులలో నను నే గోల్పోయితి
మహావేగ వాయువేమృత ఘంటాధ్వని
ఇపుడు చూచితే నన్ను గుర్తించలేవు.
మిత్రమా! శెలవు.
వసంతకాలంలో పత్ర భాష్పాల
పూవులు రాల్చునప్పుడు
ఒకరోజున వాడిపోతున్న
గతాన్ని స్మరిస్తావు.

అక్కడ చలించు కాంతినీడల – స్వప్నం
గోచరిస్తుంది నీకు
అది స్వప్నంకాదు, యదార్థం
మృత్యుంజయ ప్రేమ.
నిర్వికారం నీ కానుక
వికార కాల తరంగాలు
దూరానికి నన్ను గొంపోవునేమో
మిత్రమా! శెలవు.
నష్టం నీది కాదు. నా ఉద్రిక్త అనిత్య
మృత్తికతో
నీ దేవళంబునింప రూపొందించుకొమ్ము.
దేవతావిగ్రహము.
నా నీచ స్పర్శ మలినమ్ము చేయరాదు
వేడికన్నీరు పూజాపుష్పాల అవమానించరాదు
శోకించకు, బాగుంటిని నేను
పగులని నా జీవిత పాత్ర నింపవచ్చు
మిత్రమా! శెలవు.
నాకోసం నిరీక్షించు నౌకరు, అతని
క్షమా హస్తాల

వెన్నెల రాత్రుల సుగంధపుష్పాల పోవుచేయు
నా మంచి చెడ్డలు మిశ్రమమ్ము,
నిత్య గృహ పరిమాణ ప్రేమ ఫలము
అతని కోసమే.

ఇక నీకు మహనీయ మిత్రమా!
అసమాన ప్రేమికుడా, అమిత అనంత కానుక
నీవు నా కిచ్చినది యిచ్చితిని నీకు,
ఇంకా రుణపడి యుంటి నీకు
శెలవు, మిత్రమా శెలవు!

— వన్య.

